**KANCHI CHERINA KATHALU**



**MAKINEEDI SURYA BHASKAR**

First Edition : 17th August 2017
(56th Birthday of the Writer)

SOUMYA PUBLICATIONS
# 9-3-6/1A, Saraswathi Nilayam
Gandhinagar
KAKINADA-533 004

Mobile: 89852 17627
e-mail: makineedi.writer@gmail.com

Rs.**250**

# అంకితం...

## సర్వశ్రీ...

| | |
|---|---|
| డా॥ ఎల్. కె. సుధాకర్ | యస్వీ. కృష్ణ |
| వాడ్రేవు చినవీరభద్రుడు | డా॥ వాడ్రేవు వీరలక్ష్మీదేవి |
| మంచికంటి వెంకటేశ్వర రెడ్డి | దామెర్ల గీత |
| డా॥ ఆలూరి విజయలక్ష్మి | డా॥ కర్రి శివాజీ |
| ఇంజేటి శ్యాంబాబు | ఎం.వి.వి.ఎన్. సౌమ్య |
| పి.వి. నరసింహారావు | చలసాని ప్రసాదరావు |
| దాట్ల దేవదానం రాజు | శారద |
| సి. సుజాత | ఎం. సరస్వతి |
| డా॥ నాగినేని భాస్కరరావు | డా॥ వై. కమలేంద్రనాథ్ |
| డా॥ కొలకలూరి ఇనాక్ | కడయింటి కృష్ణమూర్తి |
| కాశీభట్ల వేణుగోపాల్ | డా॥ ర్యాలి ప్రసాద్ |
| కర్ణా వేంకట రమణారావు | పి. సత్యవతి |
| డా॥ పాపినేని శివశంకర్ | ఎలికట్టె శంకరరావు |
| శశిశ్రీ | కూర్మనాథ్ |
| రాజా సమీర్ నందన్ | కె.ఎన్. మల్లీశ్వరి |
| దగ్గుమాటి పద్మాకర్ | ఎ. ప్రభాకర్ |
| అవసరాల రామకృష్ణారావు | మాల్యశ్రీ |
| కాటూరి రవీంద్ర త్రివిక్రమ్ | డా॥ శిరీష (శ్రీరామశర్మ) |

విహారి గార్లకు
మనస్సు నమస్సులతో...

– మాకినీడి సూర్య భాస్కర్

# కృతజ్ఞతలు

చినుకు, మువ్వలు, వార్తాసాగరం, రసరేఖ, కళాదీపిక, మల్లెతీగ, మల్లెపందిరి పత్రికలకు, సంపాదకులకు...

ఏడు సంవత్సరాలపాటు వారానికో పేజీ కేటాయించి 'సాహిత్యానుబంధం'లో ఎన్నెన్నో వ్యాసాలు, సమీక్షలు, వివిధ శీర్షికలతో నిర్వహింపజేసిన సర్కార్ ఎక్స్‌ప్రెస్ దినపత్రికకు ప్రత్యేకించి...

వారం వారం రాసిన వ్యాసాలను ఆయా రచయితలకు పంపే బాధ్యత కూడ తీసుకున్న సర్కార్ ఎక్స్‌ప్రెస్ ఎడిటర్ శ్రీ గొడవర్తి సత్యమూర్తిగారికీ...

వారం వారం అందుకున్న వ్యాసాలపై స్పందించి 'డియర్ ఎడిటర్'కు ఎంతో బాధ్యతతో ఉత్తరాలు రాసిన కథకులకు ప్రత్యేకించి...

కథకులు వెలువరించిన అభిప్రాయాలను వ్యాసాల చివర పొందుపరచిన సౌమ్య పబ్లికేషన్స్‌కు...(ఈ అభిప్రాయాలు ఏదో గొప్ప కోసమో, సర్టిఫికెట్టుగానో భావించి కాదుగానీ, కేవలం రికార్డు చేసే నిమిత్తం మాత్రమేనని మనవి)

నా వినమ్ర క్షమ నమోవాకములు అర్పించుకుంటూ, ఈ కథానికావిమర్శ వ్యాసాలను కూడ ఎప్పటిలా ఆదరిస్తారని భావిస్తూ...

కాకినాడ,
17.8. 2017 — మాకినీడి సూర్య భాస్కర్
(రచయిత 56వ జన్మదినం)

# కథన విశ్లేషణ క్రమంబెట్టిదనిన...

క
థా
లో
క
ం




క
థా
లో
క
న
ం

## కథలు తిరిగి చెప్పడం ఎందుకు?

చిరుతప్రాయం ప్రాణం కథ!

కథలంటే ఇష్టపడని పిల్లలుండరు. కథ చెబితేనే పాలు తాగుతారు; ముద్ద మింగుతారు; నిద్దరోతారు. నిద్దట్లో కలలు కంటారు.

మనసును లీనం చేసే శక్తి కథ!

వింటూ, తింటూ, కంటూ లీనమైపోతారు. కథల్లోని పాత్రల్లోకి తమను ఒంపుకుంటారు. జీవితం కథలతో మొదలవుతుంది. కథలతోనే ముగుస్తుంది – స్మృతులుగానో, జ్ఞాపకాలుగానో, ఆత్మ కథలుగానో!

***

చెప్పిన కథే చెబుతానంటే పిల్లలు ఊరుకోరు. ఎప్పటికప్పుడు కొత్తవి కావాలి. లేదా కొత్తగానన్నా చెప్పాలి. కథ తరవాత కథ అడుగుతూనే ఉంటారు. చెప్పేవాళ్ళు మాత్రం చెప్పలేరు. అందుకే ఒక ముగింపు కావాలి. అదే కథను కంచికి పంపడం. "కథ కంచికి, మనమింటికి" అనడంతోనే, ఇక కథ ఉండదని బాగా అర్థం చేసుకుంటాడు పిల్లాడు. నిద్రకు ఉపక్రమిస్తాడు. కలలు కంటాడు; తాదాత్మ్యమవుతాడు; ఆలోచన చేస్తాడు; స్మృతులుగా, జ్ఞాపకాలుగా, ఆత్మీయ కథలుగా వాటిని మనసులో పదిలపరుచు

కుంటాడు. ఆ కథలసారమే జీవనతాత్త్వికత అవుతుంది; జీవిత సారమవుతుంది.

***

కంచికి చేరిన కథలే ఆలోచనలకు బీజమేస్తాయి. అంటే, చెప్పేసిన కథలన్నమాట. కథ సృజించడమంటే, ఒక విషయాన్ని కళాత్మకంగా కనుక్కోడమే! ఓ జీవన దృశ్యాన్ని, సందర్భాన్ని, సన్నివేశాన్ని, బాధని, ప్రేమని ఆవిష్కరించడమే!

కథ విన్న కన్న పిల్లాడో, పెద్దోడో, ఎవరైతేనేం, ఒక శ్రోత, ఒక పాఠకుడూ కథలోని ఆలోచనని పసిగడతాడు. ఓ సంతోషాన్నిస్తాడు, బాధనిస్తాడు, తత్త్వాన్నిస్తాడు కథకుడు; అదే సంతోషాన్ని, బాధని, తత్త్వాన్ని తీసుకుంటాడు శ్రోత, పాఠకుడు.

కథను సృష్టించడం ఒక అద్భుత ప్రక్రియ. ఆ ప్రక్రియ విత్తనం అవుతుంది. ఒక అనుభూతిని, ఒక ఆర్ద్రతని, ఒక సన్నివేశాన్ని, ఒక సందర్భాన్ని, ఒక జీవితశకలాన్ని, ఒక తత్త్వాన్ని – వెరసి ఒక మానవీయతని 'ఆలోచన మొలక'గా అంకురింపజేస్తుంది.

అందుకే నా 'కంచికి చేరిన కథలు', విశ్లేషణాత్మకమైన ఆలోచనలయ్యాయి. ఈ ఆలోచనలే జీవితానికి తాత్త్వికత కూర్చేవీ; జీవితాన్ని మార్చేవీ!

***

కథ చెప్పడంకంటే, తిరిగి చెప్పడమే నామటుకు నాకు ఇష్టం. ఎందుకంటే తిరిగి చెప్పినప్పుడు కథతోపాటూ నా ఆలోచనలను కూడా పంచుకోగలుగుతాను. అసలు కిక్కిచ్చే విషయం ఇదే. కథకుడికిపాపం, ఆ వెసులుబాటు ఉండదు. తన ఆలోచనని కళాత్మకం చేసి వదలడంవరకే అతని పని. తిరిగి చెప్పే నాలాంటి వారికి కథతోపాటూ, కళాత్మకతని విశ్లేషించి కబుర్లు కూడా చెప్పే వీలైతే కలుగుతుంది.

ఈ నేపథ్యంలో కథలు చెప్పడంగాని, ఆ కథలకి సంబంధించిన కబుర్లు చెప్పడంగాని ఎందుకని ఆలోచిస్తే – సంతోషం కోసం; ఉల్లాసం కోసం!

సంతోషంతో పాటు, ఉల్లాసంతో పాటూ కథలు జీవనసారాన్నివ్వాలి. అవి మనుషుల్ని మార్చకపోయినా, మనసుల్లో

కొంతైనా మానవీయతని వీయాలి. అందుకే కథలు చెప్పడమైనా, తిరిగి చెప్పడమైనా!

ఇన్ని కథల్ని తిరిగి చెప్పినతర్వాత, ఒక నిమిషం ఆగి ఆలోచిస్తే– నాకెటువంటి కథలు నచ్చాయో, ఏ కథలు నన్ను తిరిగి చెప్పడానికి ప్రేరేపించాయో ఒక అంచనా వచ్చింది. మౌలికంగా మానవత్వాన్నిమప్పే కథ నాకు నచ్చింది. నేను తిరిగి చెప్పిన కథలన్నీ అలాంటివే. వృత్తిపరంగా ఉపాధ్యాయుణ్ణి గనక, విద్యాసంబంధమైన కథ నచ్చింది. ప్రవృత్తి పరంగా రచయితని, చిత్రకారుణ్ణి గనక ఆ సంబంధమైన కథలూ నాకు నచ్చాయి. అంతస్సౌందర్యాన్ని ఇష్టపడే తాత్వికునిగా ఆ కోణంలో కథలూ నాకు నచ్చాయి. నాకు నచ్చిన కథల్నే తిరిగి చెప్పాను. ఈ చెప్పడంలో నా ఆలోచనలతో పాటూ కథని కూడ చెప్పడం నా అలవాటు. ఎందుకంటే, నా పాఠకుడు మళ్ళీ కథ గురించి వెతుక్కోకూడదు.

***

అంతస్సూత్రంగా మానవత్వాన్ని ప్రతిపాదించిన కథలే నేను తిరిగి చెప్పినవన్నీ! 'క్రిష్ణుడి బొమ్మ'నుంచి, ఆకలేమయ్యిందమ్మా ఎన్నెలా, ఎయిడ్స్ కతలు రెండు, వ్యావసాయిక కఠిన వాస్తవికత, ఎంత కష్టం ఆత్మహత్య!, పెద్దరికం తెలీని పెత్తనం, మానవీయతను కథీకరించిన 'అతడు మనిషి', కాలిక స్థాలిక సంకేతం పిఠాపురం రోడ్డు మొదలైన వ్యాసాలకు సంబంధించిన కథలన్నీ మానవీయతని బలంగా చెప్పినవే. నాకు నచ్చిన కథ లక్షణం – ఇంకోటి – కన్నీళ్ళు పెట్టించడం కూడా అనిపిస్తుంది. మంచికంటి, ఇంజేటి శ్యాంబాబు, దాట్ల దేవదానం రాజు, కాశీభట్ల వేణుగోపాల్, పాపినేని శివశంకర్, శశిశ్రీ, రాజా సమీర్‌నందన్, అవసరాల రామకృష్ణారావు, దామెర్ల గీత, ర్యాలి ప్రసాద్, పి.సత్యవతి, ఎలికట్టె శంకర్రావు నన్ను బాగా ఏడిపించిన కథకులు. కన్నీళ్ళు బాధతోనే కాదండోయ్! సంతోషంలోనూ వస్తాయి – ఆలూరి విజయలక్ష్మి, పి.వీ, వాడ్రేవు వీరలక్ష్మీదేవి, కడయింటి కృష్ణమూర్తి, మళ్ళీ దాట్ల, కూర్మనాథ్ సంతోషంతో ఏడ్పించినవాళ్ళు. ఇవన్నీ కూడ అంతర్లీనంగా మానవత్వాన్ని మప్పేవే!

ఉపాధ్యాయునిగా, అదీ మునిసిపల్ టీచర్‌గా నాకు బాగా నచ్చిన కథ 'కంచె'. మౌలిక విద్యాసత్యాలను, వ్యత్యాసాలను బాగా ఆవిష్కరించిందీ

కథ. ఇక రచయితగా మెచ్చినవి – కడలి కెరటం, వర్ణచిత్రం కథలు. రచయితకు రక్షణకవచంగా ఉండాల్సిన కాపీరైట్ చట్టం మరో కోణంలో ఎలా పీడిస్తుందో అద్భుతంగా వివరించారు ఎస్వీ. కృష్ణ. ఇక కాపీ కథలెలా వస్తాయో మాల్యశ్రీ తర్కబద్ధంగా చర్చించారు. కాపీకథలనే వివాదాలు అప్పుడప్పుడూ చూస్తుంటాం. ముప్పై, ముప్పై అయిదేళ్ళ క్రితం ఓ ప్రముఖ కథకుడు రాసిన కథ స్వాతిలో ప్రచురింపబడినప్పుడు ఇటువంటి దుమారం వచ్చింది. దానిపట్ల ఎంతో చింతిస్తున్నట్లుగా సంపాదకులు తెలియజేయడంతో, మీ చింతకు కారణమైన బహుమతి నగదును తిరిగి పంపేస్తున్నానంటూ, తిప్పికొట్టారు ఆ కథకుడు. అలాగే, ఇటువంటి వివాదమే 2007 ప్రారంభంలో కూడ వచ్చింది. రెండు సందర్భాల్లోనూ ఆ కథకులు చెప్పిందొకే విషయం – కాపీ కథల్లా అనిపించినా, అవి తమ స్వకపోల కల్పనలనుంచి వచ్చినవనీనూ, తమదైన తాత్త్వికతలోను దాన్ని కథనం చేసే విధానంలోను కచ్చితంగా తేడా ఉందనీనూ. ఇంకో విషయమేమంటే, పోటీలో నెగ్గి బహుమతి గెలుచుకున్న కథల విషయంలోనే ఇటువంటి దుమారాలు రావడం ఆలోచించదగిన విషయం. బహుశా ఎన్నో కథలు అటువంటివి ఉండొచ్చుగానీ, పోటీ కథలనేప్పటికి ప్రత్యేక దృష్టి పెట్టడంవల్ల ఆ కథలు ఇటువంటి వివాదాలకు గురవుతున్నాయని పిస్తుంది. మాల్యశ్రీ కథ, 'వర్ణచిత్రం' ఈ విషయాలన్నిటినీ చాల చక్కగా చర్చకుపెట్టింది.

ఇక నాలోని చిత్రకారుడు మెచ్చిన కథలు క్రిష్ణుడి బొమ్మ, మాష్టర్‌పీచు.

'శారీరక కురూపం వెర్సస్ హృదయ కురూపం', 'హృదయమో ఈస్తటిక్ స్పేస్ స్టేషన్ కావాలి' వంటి విశ్లేషణలు అంతస్సౌందర్యానికి మచ్చు తునకలు. దగ్గుమాటి పద్మాకర్ కథ 'ఈస్తటిక్ స్పేస్' గురించి విశ్లేషిస్తూ – "వందలకొద్దీ ఆడాళ్ళ శరీరాల నునుపు, వంపులు ప్రకటనల్లో పదేపదే కనబడుతుండటంతో శరీరాల రాపిడికి ఎవ్వరైనా ఒక్కటేనన్న యావ, ఆఖరికి ఇంటలెక్చువల్స్‌కీ సహజమైపోయిం"దన్నకథకుడి మాటలను విశ్లేషిస్తూ, "అందుకే కోరిక తీర్చుకోడం కోసం ప్రాణమున్న మనిషే ఉండి తీరాలన్న పరిస్థితినీ దాటుతున్నాడు మనిషి. కేవలం ఆడబొమ్మ ఒకటి చాలు. బట్టల్లాగే మడతపెట్టేసి సూట్‌కేస్‌లో సర్దుకుని

ఎక్కడికైనా తీసుకెళ్ళిపోవచ్చు. కావాలనిపించినప్పుడు గాలి ఊదితే కోరిక తీర్చే ఆడబొమ్మ సిద్ధమైపోతుంది. ఇది మొదటి దశ. ఆ తరువాత ప్రాణమున్న అచ్చుపు ఆడబొమ్మే కావాల్సి వస్తుంది. ఎవరాపగలరు?" అని రాశాను. ఎందుకో ఈ వాక్యాలు కథకుడికి ఇష్టం కాలేదు. "కథలో లేనిదాన్ని ఎలా చెబుతా"రని ప్రశ్నించారు. అందుకే ఈ వాక్యాల్ని ఆయన కోసం తీసేశాను.

సాధారణంగా కథంటే హృదయంనుంచి వచ్చేది. అలా కాకుండా మెదడునుంచి వచ్చే కథలు కొన్నుంటాయి. కథారూపం తీసుకోడానికి ముందే వస్తువు ఎంతో ఆలోచనకి గురయ్యాకా, అప్పుడు కథగా తయారవుతుంది. ఇటువంటి ఆలోచనాత్మకమైన కథలు కూడా నాకు బాగా నచ్చుతాయి. ట్రాపికల్ ఫీవర్, హత్య చెయ్యనవసరంలేదు, రమ నా కూతురు, ఎవరితోనన్నా లేచిపోరాదూ?, ఎవరితో లేచిపోనూ!, స్వేచ్ఛ, స్వర్గం-నరకం, పద్మవ్యూహం వంటి కథలు, ఆలోచనామృతాలు. జీవితాన్ని ప్రభావితం చేసే ఆర్థికాంశ నేపథ్యంగా వచ్చిన కథలు - నీలివల, ఆకలేమయ్యిందమ్మా, చిన్నిమువ్వలు, నదికె పాల్, శ్రమదోపిడీ, కలిసే ప్రయాణం, పోల్చుకోగల రాతే, చెరలాట కూడ నన్ను కదిలించిన కథలు.

***

సరే, ఈ విషయాలపై ఇవేనా మంచి కథలు? ఇంక లేవా?? అంటే, ఏం చెప్పను? నేను చదివిన కథలవరకే నేను చెప్పగలను. వేరేవాటిగురించి ఏం మాట్లాడగలను?

ఈ విశ్లేషణల ద్వారా నాకు అవగతమయిన విషయాలు చాలా ముఖ్యమైని - ఈనాటి తెలుగు కథానిక ముఖ్య లక్షణాలు, మానవత్వ ప్రతిపాదన, మాండలిక భాష వాడకం, ప్రాంతీయ వాస్తవికత, జీవిత కఠోర వాస్తవికత మొదలైనవి. స్త్రీని ఒక అవయవంగా చూడ్డంనించి మనిషి విముక్తుడు కావాలన్నది కూడా బలంగా చెప్పిన ఒక అంశం.

తెలుగు కథానిక విషయానికొస్తే, ప్రస్తుతం గొప్పకాలం. గొప్పకాలంలోనే గొప్ప కథలు వస్తాయి; చెప్పబడతాయి. ఏ యుద్ధమూ చేయకుండానే కథ మనుషుల్ని జయిస్తుంది. జరిగిన యుద్ధాలన్నీ చేయలేని పనిని కథలు చేసి చూపాయి. యుద్ధాలను కథలు ఆపిన సందర్భాలూ చరిత్రలో కోకొల్లలు.

ఎవరు జీవితంలో వేదనకు గురయ్యారో, ఎవరు జీవితాన్ని పరిపూర్ణంగా ప్రేమించగలిగారో, ఎవరు ఆనందాన్ని, బాధనీ తెలుసుకోగలిగారో వాళ్ళే మంచి కథలు చెప్పగలుగుతారు.

కథలు కాలసంబంధి. కాలంతో పాటూ వృద్ధి చెందుతాయి; జీవితంలోని బాధని అనుభవిస్తాయి; కాలక్రమంలో కాలం లేకుండా పోతాయి.

కథలద్వారా, కథల్లోని కాల్పనికత ద్వారా, వాటిల్లోని కఠోర వాస్తవికత ద్వారా మనగురించి మనకు తెలుస్తుంది. మన జీవితం గురించి ఇతరులకు తెలుస్తుంది. జీవితాన్ని ఎలా జీవించాలో, ఏ విధంగా మార్చుకోవాలో, ఏ రకంగా ప్రవహింపజేయాలో బాగా అర్థమవుతుంది.

కథకుని ఆధిక్యత భాషలో ఉండదు. అతని పరిణతపై, అతను కథ చెప్పే పద్ధతిపై ఉంటుంది. కథానిక అందం, అదిచ్చే ఆనందం వాటితోనే వస్తుంది. జీవిస్తూ జీవింపజేసేదే గొప్ప కథవుతుంది.

***

కథానికావిశ్లేషణ వ్యాసాలు ఇంకా దాదాపు ఏభై పైనే ఉన్నాయి. గ్రంథ విస్తరణ భీతితో కేవలంముప్పై ఎనిమిది మంది కథకుల ముప్పై తొమ్మిది కథలపై ముప్పై ఆరు వ్యాసాలను మాత్రమే ఈ సంపుటిలో చేర్చాను. విడి కథలు కాకుండా, కథాసంపుటాలపై కూడ ఓ అరవైపైనే వ్యాసాలున్నాయి. వాటిని కథా'వ్యాసం'గం పేరుతో త్వరలో సంపుటీకరించాలనుంది.

ఈ వ్యాసాలనూ ఎప్పటిలా పాఠకులు ఆదరిస్తారని భావిస్తూ...

కాకినాడ, భవదీయుడు,
17.8.2017 **– మాకినీడి సూర్య భాస్కర్**

**కథానికా వ్యాసాల్లోకిదే మీకు నా ఆహ్వానం!**

కథకుడు : డా॥ ఎల్.కె. సుధాకర్
కథ : క్రిష్ణుడి బొమ్మ
ప్రచురణ : ఆంధ్రభూమి సచిత్రవార పత్రిక
1.1.2004

# కళంకమంటనివ్వని 'క్రిష్ణుడి బొమ్మ'

ఆంధ్రభూమి సంక్రాంతి (2004) కథల పోటీలో మొదటి బహుమతి పొందిన కథ డా॥ ఎల్.కె. సుధాకర్ రచించిన 'క్రిష్ణుడి బొమ్మ'.

స్థూలంగా కథాంశం – బొమ్మలబ్బాయి కిట్టయ్య కృష్ణుడి బొమ్మలమ్మగా వచ్చిన డబ్బులతో రోగిష్టి తల్లికి మందులు కొనాలనుకుంటాడు. ఎంతకీ అమ్ముడుపోవు బొమ్మలు – 'అంత కళగా లేవ'నే నెపంతో. చివరికొకాయన, మానవత్వం పరిమళించే మంచి మనసున్న మనిషి, కుచేలరావు అన్ని బొమ్మల్నీ కొనేస్తాడు. ఇంటి దారి పట్టిన కిష్టయ్యకి మధ్యలో ఆకలితోను, జ్వరంతోను అలమిటిస్తూన్న, కాగిపోతున్న ఓ పిచ్చి అమ్మాయి తారసపడుతుంది. తృప్తిదీరా ఆమె ఆకలి తీర్చి, మందులిస్తాడు కిట్టయ్య. చివరికి కిట్టయ్య తల్లి చనిపోతుంది. చనిపోయిందని కథకుడెక్కడా ప్రత్యక్షంగా చెప్పడు. కేవలం సూచితమే.

'క్రిష్ణుడి బొమ్మ' కథన శిల్పానికి సూచ్యత పట్టుగొమ్మ. కథలోని విషయాలన్నీ సూచ్యంగానే పాఠకుల ఊహకి అందుతాయి. కథ చదవడం మొదలెట్టిన దగ్గర్నుంచీ కిట్టయ్య తల్లి చనిపోతుందనే భావం బలంగా మన ఊహకి అందుతూనే ఉంటుంది. ముగింపు ముందే తెలిసిపోతుంది. అయితే సూచ్యంగా నడపడమే ఈ కథలోని బలమైన కథన శిల్పం.

పాత్రల స్వభావం కూడా సూచ్యంగానే మనకు తెలుస్తుంది. బొమ్మలు తయారుచేసి అమ్ముకునే బ్రహ్మయ్య (బొమ్మల బ్రహ్మయ్య – బ్రహ్మయ్యనే పేరుతో బొమ్మలు చేసేవాడెవడైనా ఉంటే, లోకులతన్ని బొమ్మల బ్రహ్మయ్యనే పిలుస్తారు. బొమ్మల్ని సృష్టించేవాడు కనుక కథకుడు అతనికి బ్రహ్మయ్యనే పేరు పెట్టారేమో!) ముసలివాడై కూతురింటికి పోతూ పోతూ, నమ్మకంగా పని చేసిన కిట్టయ్యకి కృష్ణుడి బొమ్మ పోత పోసే ప్లేట్లు మాత్రమే ఇస్తాడు. వాడు కిట్టయ్యనేమో, వాడికి కృష్ణుడి ప్లేట్లు ఇచ్చాడనిపిస్తుంది. అయితే జీసస్, మహ్మద్ ప్రవక్త, సాయిబాబా బొమ్మలకంటే భిన్నంగా, "ఏ వేళయినా సంవత్సరం పొడవునా క్రిష్ణుడి బొమ్మలకి గిరాకీ ఉంటుందని తెలిసినప్పుడు  కిట్టయ్య మీద బొమ్మల బ్రహ్మయ్యకున్న అవ్యాజమైన ప్రేమ మనకి అర్థమవుతుంది. ఇదే సుధాకర్ కథన రీతి. అలాగే కుచేలరావు భార్య పేరు 'సుమ' అయ్యుండవచ్చునని కూడ తెలుస్తుంది.

బ్రహ్మయ్య ఇచ్చిన ప్లేట్లతో మొదటిసారిగా కృష్ణుడి బొమ్మలు తయారు చేసి అమ్మకానికి తీసుకుపోతే, బేరం కుదరనివ్వని కొనుగోలుదార్లు, "బొమ్మలంత అందంగా లేవ"ని చివరిగా అనే మాట కిట్టయ్య పసిమనసును ఎంతో కలవరపెడుతుంది. వాడి మనసును గాయపరుస్తుంది. ఎంతగా అంటే, ఏడుపుతో మబ్బులు కమ్మిన ఉదయాకాశం అవుతుంది వాడి హృదయం.

ఆ బాధ వాడి తల్లి జబ్బు విషయాన్ని కూడ మరపింపజేస్తుంది, తాత్కాలికంగా. బొమ్మలమ్ముకుంటూనే ఉదయం మధ్యాహ్నమవుతుంది. "బొమ్మలంతగా కళగా లేవ"ని పదే పదే వినిపించిన మాటతో ఆకలెప్పుడు వచ్చి ఎప్పుడు పోయిందో వాడికి తెలీనే తెలీదు.

బాధ...బాధ – "నిజంగా బొమ్మలు కళగా లేవా?" – ఒకటే బాధ. తన కళ మీద పడుతున్న కళంకానికి సంబంధించిన బాధ అది. నిజమే, ఏ కళాకారుడు తన కళకి కళంకం అంటితే బాధపడకుండా ఉండగలడు?

ఆ చిన్న మనసును తొలిచేసిన ప్రశ్న – "దేవుడి బొమ్మకు కళేమిటి?" అన్నది వాడి బాధ, ఎంత పతాకస్థాయికి చేరిందంటే – "మొదటిసారి బొమ్మల బ్రహ్మయ్య ఇచ్చిన ఫ్రేములతో తయారు చేసినవి, స్వయానా తయారు చేసినవి, కళగా లేవని అనిపించుకోడాన్ని జీర్ణించుకోలేక, కన్నీళ్ళను ఆపుకోలేక, కోపమొచ్చి, చిరాకేసి, బాధపడి...ఊహూ, క్రిష్ణుడిమీదే కోప్పడి, తనమీద తనకే కోపమొచ్చి... అడుగులు భారమైపోయి, ముక్కుపుట లెగిరిపడి...." చేతిలోని క్రిష్ణుడి బొమ్మని నేలకేసి అమాంతం కొడతాడు. అదీ కళాకారుడి బాధ. ఓర్చలేనటువంటిది. ఎవరూ తీర్చలేనటువంటిది.

ఇదంతా చూస్తున్న కుచేలరావు, "బొమ్మలు బావున్నాయే!" అంటూ స్వగతిస్తూ దగ్గరకు వస్తాడు. ఆ పదాలు చెవుల్లో పరిమళిస్తుండగా అపనమ్మకంతో, "నిజంగానా?" అని అమాయకంగా అడుగుతాడు కిట్టయ్య.

"మొత్తం బొమ్మలన్నీ ఎంతకిచ్చేస్తావోయ్?" అని అడిగిన ప్రశ్నకి రకీమని "అమ్మకి పదిహేన్రోజులు సరిపడే మందులకి" అని సమాధాన మిస్తాడు కిట్టయ్య.

ప్రపంచంలో మనుషులు రెండు రకాలు – డబ్బుకీ, ప్రేమకీ సంబంధ ముందనుకునేవారు, కుదరదనుకునేవారు. భార్యతో కుచేలరావు చెప్పిన మాటల సారాంశాన్ని గ్రహిస్తాడు, కిట్టయ్య – "ప్రేమంటే నా తల్లికి అనారోగ్యంగా ఉందని బాధపడడం కాదు, ప్రపంచంలోని ఏ తల్లికి అనారోగ్యంగా ఉన్నా బాధపడడమే"నని, వాడి మనసుకు బాగా పట్టింది.

ఇక్కడ గమనించాల్సిన విషయం, కిట్టయ్య కుచేలరావు తల్లుల పరిస్థితి ఒకటే – రేపో మాపో అన్నట్టే. అప్పు తెచ్చిన డబ్బునుంచి మరీ, కొనుగోలు చేస్తాడు కిట్టయ్య బొమ్మల్ని కుచేలరావు. లౌక్యం బొత్తిగా తెలీనివాడు కుచేలరావు భార్య దృష్టిలో. కనుకనే లౌక్యం తెలీని కిట్టయ్య బాధలన్నీ అతనికి అర్థమవుతాయి. లౌక్యులకు ఇదంతా అర్థం కాదు. పైగా ఛాదస్తమనిపిస్తుంది. అదే కుచేలరావు భార్య మాటల్లోనూ ద్యోతకమౌతుంది. లౌక్యం తెలీడమంటే సాటి మనిషి ఆకలి మానాలే కాదు, ప్రాణం కూడా పూచికపుల్లలా తోచడమే. పిచ్చి అమ్మాయి పట్ల మెడికల్ షావువాడి మాటల్లోనూ అదే ద్యోతకమవుతుంది. అయితే, కిట్టయ్య మాత్రం పాతిక రూపాయలు ఖర్చయినా, పిచ్చిదానికి ఇడ్లీలు కొనిపెడతాడు.

నీళ్ళ పాకెట్టిస్తాడు. ఆబగా నోటినిండా ఆ పిచ్చిది తింటుండగా 'మాష్టారి' మాటలు మరింత బాగా అర్ధమవుతాయి వాడికి. మనకీ అర్ధమవుతుంది కుచేలరావు టీచరని. అంతా సూచ్యమే, వ్యంజనమే! ఈ వ్యంజన శిల్పమే కథలో బాగా ఆకట్టుకునే అంశం.

కిట్టయ్య తల్లి చనిపోయినా, ఆకలి తీర్చి జ్వరానికి మందిచ్చి కాపాడుకున్న 'పిచ్చితల్లి' అతనికి ఉందనే ఊరట. పూర్తి సూచ్య శిల్పంతో కళంకం లేని మానవత్వాన్ని ప్రతిపాదించే కృష్ణుడి బొమ్మ సుధాకర్ రాసిన మంచి కథల్లో మంచి కథగా చెప్పుకోవచ్చు.

కళకీ, మానవత్వానికీ కళంకమంటనివ్వని సందేశం ఈ కథా సారాంశం.

లోగడ ఇండియా టుడే లో వచ్చిన గొబ్బిపూలు కథ సుధాకర్‌కి ఎప్పుడో మంచి గుర్తింపు తెచ్చిపెట్టింది. తూర్పుగోదావరి జిల్లా షెడ్యూల్డ్ కులాల కో-ఆపరేటివ్ సోసైటీ అసిస్టెంట్ ప్రాజెక్ట్ ఆఫీసర్‌గా అంతులేనన్ని అలజడుల మధ్య, క్షణం మనసుకు తీరికలేని ఉద్యోగంలో ఉంటూ కూడ, మంచి కథలు, మంచి మంచి కవితలు రాసి, తనను తాను బ్రతికించుకుంటున్న డా॥ లంకా కనక సుధాకర్‌ను అభినందిస్తూ ముందు ముందింకా ఇలాంటి బహుమతులింకెన్నో పొందాలని ఆశిద్దాం.

(16-01-2004 డా॥ ఎల్.కె. సుధాకర్ అభినందన సందర్భంగా)
సర్కార్ ఎక్స్‌ప్రెస్, 15-1-2004, గురువారం

---

... నా కథమీద మంచి వ్యాసాన్ని కర్టెన్ రైజర్‌గా ప్రచురించిన ఎడిటర్‌గారికి, ఆ వ్యాసాన్ని రాసిన మాకినీడికీ నా నమస్కారాలు.

నాకే తెలియని కొన్ని అంశాలను సూచించి నన్ను ఆశ్చర్యచకితుణ్ణి చేశారు రచయిత. లోగడ నా కవిత్వంపై కూడ ఈ విధంగానే ఆయన స్పందించారు. ఆయనకు నా కృతజ్ఞతలు.

**- డా॥ ఎల్.కె. సుధాకర్, కాకినాడ**

కథకుడు : వాడ్రేవు చినవీరభద్రుడు
కథ : ట్రాపికల్ ఫీవర్
ప్రచురణ : ఆదివారం వార్త

# ట్రాపికల్ ఫీవర్ – టిపికల్ ఫ్లేవర్

భారత దేశంలో చొరబడుతున్న సరికొత్త వలస వాదులకు విరుగుడును ప్రతిపాదించిన లోతైన కథ, వాడ్రేవు చినవీరభద్రుని 'ట్రాపికల్ ఫీవర్'.

ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా ఖండాల్నీ, పసిఫిక్ మహాసముద్ర ద్వీపాల్నీ చుట్టి వచ్చిన నావికులు మొదట కుతూహలంతో, ఆ పిమ్మట వ్యాపారం కోసం, ఆ వెనుక అధికారం కోసం పాకులాడి 16వ శతాబ్దంలో ప్రాచ్యదేశాల్లో స్థాపించిన వలసవాదమే నేడు గ్లోబలైజేషన్ పేరుతో తిరిగి నయావలసవాదంగా పరిణమించిందని ఈ కథలో నిరూపిస్తారు చినవీరభద్రుడు.

ఆ వలసవాదులే ఇప్పుడు అంతర్జాతీయ కన్సల్టెంట్ల రూపంలో మళ్ళీ యాత్ర కొనసాగిస్తున్నారంటారు. అటువంటి నయావలసవాదపు కుహనా తంత్రానికి అచ్చమైన ప్రతీక ఈ కథలోని వరల్డ్ బ్యాంక్ కన్సల్టెంట్ ప్రొఫెసర్ రాబర్ట్.

జన్మతః డెన్మార్క్ దేశీయుడైన రాబర్ట్

ఇరవయ్యేళ్ళుగా ఐక్యరాజ్యకమిటీ సంస్థల్లో వివిధ హోదాల్లో పనిచేసి, ఈనాడు రాష్ట్రంలో దారిద్ర్య నిర్మూలన కోసం ప్రభుత్వం కోరుతున్న ఋణ సదుపాయానికి ప్రీ–అప్రయిజల్ కోసం వరల్డ్ బ్యాంక్ తరపున వచ్చినవాడు.

పురాతన యూరోపియన్ నావికుల, వలస పాలకుల, చిత్రకారుల కుతూహలం అతనిలో కెగబాకుతూ ఉంటుంది. అతని చూపుల్లోని భావాలు తెలియాలంటే దాదాపు ఆరు శతాబ్దాల ఆధునిక ప్రపంచ చరిత్ర తెలియాలి. భారతదేశానికి సముద్ర మార్గాన్ని వెతకడానికి తెప్పల మీద బయలుదేరిన సాహస నావికుల మనః ప్రవృత్తిని అంచనా కట్టగలగాలి. ట్రాపికల్ క్లైమేట్‌ని చూడగానే పాశ్చాత్య మానవునిలో మేల్కొనే ఆకలి, తృష్ణల జాడను పసిగట్టగలగాలి. ఉష్ణమండల దేశాల గాలిలో అప్రాచ్యుని అవ్యక్త దాహాన్ని సేదదీర్చేదేదో ఉంది. దాన్ని పసిగట్టగలగాలి. లేదంటే, భారతదేశం వంటి తృతీయ ప్రపంచ దేశాలు పాశ్చాత్య కుతంత్రానికి బలి కావలసిందే.

తృతీయ ప్రపంచ దేశాల్లోని బీదవాళ్ళతో రాబర్ట్ మాట్లాడే తీరులో ఇదే ద్యోతకమవుతుంది. లాబరేటరీలో శాస్త్రవేత్త తన బొటనవేలునీ, చూపుడు వేలునీ కలిపి బొద్దింకనో, మరే కీటకాన్నో శ్రద్ధగా, ఆబ్జక్టివ్‌గా పరికించి చూస్తున్నట్లే ఉంటుంది – తృతీయ ప్రపంచ దేశాల మనుషుల ముఖాలొక్కొక్కటీ తదేకంగా పరిశీలిస్తుం దతని చూపు. పాశ్చాత్యుని కెప్పుడూ ఇక్కడ వనరుల మీదనే దృష్టి.

రాష్ట్రంలో దారిద్ర్య నిర్మూలన కోసం ప్రాజెక్టు రూపకల్పనకు వరల్డ్ బ్యాంక్ పంపిన మిషన్ సభ్యుల బృందం నిండుగా విరబూసిన వేపచెట్ల మధ్య తీపిగాలుల్లో తడుస్తున్న మహబూబ్‌నగర్ జిల్లాలోని ఒకానొక గ్రామంలో టాటా సియారాలో దిగుతుంది. ఆ బృందానికి లీడర్ రాబర్ట్. అతనితోపాటు దేశీయ ఋణసంస్థల ప్రత్యేక నిపుణుడు మోహన్ దేశాయ్, ట్రాపికల్ అగ్రికల్చర్‌లో నిపుణుడు, కొన్నాళ్ళు ఫిలిప్పీన్స్‌లో ప్రపంచ ఆహార సంస్థకు సలహాదారుగా పనిచేసిన విద్యాధర్ మిశ్రా, కథను నడిపే 'నేను'లు మిషన్‌లోని సభ్యులు.

కారు దిగుతూనే గ్రామీణ భారతదేశపు ఎర్రని దుమ్ముకి ఉక్కిరి బిక్కిరై ముక్కుకీ, నోటికీ కర్చీఫ్ అడ్డు పెట్టుకున్న రాబర్ట్, అంతలోనే మహబూబ్ నగర్ జిల్లా అధికారుల వాహనాలు దుమ్ము రేపుకుంటూ వస్తే, కర్చీఫ్‌తో తనను తాను కాపాడుకోడానికి ఎంతమాత్రమూ

ప్రయాసపడదు. కారణం, అప్పటికే అతని దృష్టి ఊరిమధ్య నిండుగా విరిసిన వేపచెట్లపై పడుతుంది. గ్రామసభలో కూర్చోడానికి కూడా ఇష్టపడక, 'ట్రాన్సాక్షనల్ వాక్' పేరుతో మిశ్రానీ, 'నేను'నూ వెంటేసుకుని పొలాలవైపు ఊరినీ, పరిసరాల్నీ పరిశీలించడం మొదలెడతాడు. "చూశారా, ఈ వేపచెట్లు. వీటిలో అద్భుతమైన ప్రోడక్టులు దాగి ఉన్నాయి. మీ ప్రభుత్వానికి నేను చాలాసార్లు చెప్పాను. రీసెర్చ్ అండ్ డెవలప్‌మెంట్ పెరగాలి. రాబోయేదంతా గ్లోబలైజేషన్" అంటూ, గ్లోబలైజేషన్ ముఖ్యోద్దేశాన్ని వివరిస్తాడు. "ఇంటెలెక్చువల్ ప్రాపర్టీ మీద ఎవరికి హక్కులు ఉంటాయో, వాళ్ళదే ప్రపంచం". వ్యవసాయరంగం వరకు తీసుకుంటే ఎక్కువ సాగునీటి పథకాలు కావాలనుకోడం, వ్యవసాయ బావులకు విద్యుత్ కనెక్షన్లు ఇవ్వాలనుకోడం, పంట మార్పిడి, ఎరువుల వాడకం – ఇదంతా కన్వెన్షనల్ థింకింగ్, పూర్వకాలపు భాష.

గ్లోబలైజేషన్ ఫిలాసఫీ వ్యాపారం, ఎంటర్‌ప్రెన్యూర్ షిప్. అదీ రిస్కుతో కూడుకున్నది. దీనిమీదే గ్లోబలైజేషన్ ప్రగతి మొత్తం ఆధారపడుతుంది. షెడ్యూల్డ్ కులానికి చెందిన చిన్న రైతు జంగయ్య. రిస్కు తీసుకుని బోరు తవ్వించుకోడాన్ని ఉదహరిస్తూ మొత్తం సోవియట్ రష్యానంతా విశ్లేషించ వచ్చునంటాడు రాబర్ట్. విఫలమైన సంఘటిత సమిష్టి నేపథ్యాన్ని కాదని జంగయ్య ఒక అడుగు ముందుకు వేసాడు. పంటలు బాగా పండించి మార్కెట్‌ను అందుకోగలిగితే అంతర్జాతీయ రైతు సమాజంలో సభ్యుడవుతాడు. ఆపై గ్రామరాజకీయాల్లో ముఖ్యపాత్రనూ పోషించగలుగుతాడంటాడు రాబర్ట్. కానీ విఫలమైతే మాత్రం ఎందుకూ పనికిరాడు. అదే రిస్కు. ఆ రిస్కుని ఛాలెంజిగా తీసుకుని గ్రామీణ ఆర్థిక వ్యవస్థని దాటి అతడు విస్తృత ప్రపంచ ఆర్థిక వ్యవస్థతో జత కట్టగలుగుతాడని గ్లోబలైజేషన్ మహిమను వివరిస్తాడు.

అయితే అసలు రహస్యం వేరే కోణంలో ఆలోచిస్తే తెలుస్తుంది. గ్రామీణాభివృద్ధి సంస్థ వ్యవసాయాధికారి విశ్లేషణలో అది అర్థమవుతుంది. మాదిగ కులానికి చెందిన జంగమయ్య తరతరాలుగా వెట్టిని వారసత్వంగా పొందినవాడేగాని, ఎప్పుడూ రైతుగా బ్రతికినవాడు కాదు. బానిసగా, కూలీగా బతికినవాడు. అతడిప్పుడు తెల్లచొక్కా తొడిగి, తలపాగా చుట్టి రైతు అవతారమెత్తితే వచ్చే ఇబ్బందులెన్నో! వడ్లు వెయ్యాలి. టౌనుకెళ్ళి విత్తనాల షాపు దగ్గర, ఎరువుల షాపుదగ్గర తోటి రైతులతో మాట్లాడాలి.

ట్రాక్టరు ఓనర్లతో కిరాయి బేరాలాడుకోవాలి. పంట కోతకి కూలీల్ని బెత్తాయించుకోవాలి. ఇంతా చేస్తే చుట్టూ ఉన్న పీతమనుషులు ఊరుకుంటారా? కాలుపట్టి లాగేయరూ! అంతే కాదు, వ్యవసాయ నిపుణుడు మిశ్రా చెప్పే థియరీకంటే ప్రాక్టికాలిటీ, లాబరేటరీ కండిషన్ కంటే లోకల్ కండిషన్‌గురించిన అవగాహన అవసరం. గ్లోబలైజేషన్ కూడ అంతే. ఊరకే 'బలై'పోడం కాదు; ఇక్కడి అవసరాలు, సమస్యలు, పరిష్కారాల నేపథ్యంలో ఆలోచించి ప్రభుత్వ విధి విధానాలను రూపొందించాలేగాని వరల్డ్ బ్యాంక్ చెప్పింది కదాని ఏకపక్షంగా అమలుపరిస్తే వెన్నెముకల ఆత్మహత్యలే చివరకు మిగులుతాయి. దేశ ఆర్థిక వెన్నెముక విరిగిపోతుంది.

ఈ కథలో గ్లోబలైజేషన్ మాయాజాలానికి సమాంతరంగా జంగయ్య చేనులోని పాముల పుట్ట, ఇంటిలోని కులదైవం, ఎల్లమ్మ ఉన్న పెద్ద పుట్టలకి సంబంధించిన గ్రామీణ జానపద భావనల నేపథ్యం సాగుతుంది. కథను చెప్పే 'నేను' పాత్రకు జ్వరమొస్తే, ఒళ్ళు తెలియని అపస్మారక దశలో జంగయ్య ఇంట్లోకి తేబడతాడు. జంగయ్య భార్య రాములమ్మ చెప్పిన ఎల్లమ్మ కథలోనే విన్నాడో, లేక ఆ కథ వింటుండగా నిదురలోకి జారుకున్నాడో – తన మగతలో కలవరంలో కలత నిద్రలో 'నేను' పాత్ర ముందొక భీకరాకారం కనిపిస్తుంది. అది ఒక మహాశక్తి. నాలుక వెళ్ళజాపుతుంది. ఆ నాలుక మీంచి రక్త బిందువులు జారుతుంటాయి. వెయ్యి చేతులు, ప్రతి చేతిలో శూలం, శూలం చివర జంతువులు తగుల్కొని నెత్తురోడుతుంటాయి. కొన్ని చేతుల్లో మండుతున్న కొరివిలు, కొన్ని చేతుల్లో కత్తులూ ఉన్నాయి. నడుముకీ, పాదాలకీ, మెడకీ చుట్టుకున్న పాములతో ఆమె నడుస్తున్నంత మేరా భవనాలు ధ్వంసమవు తుంటాయి. కరెంటు తీగలు, టెలిఫోన్ తీగలు తెగిపోతుంటాయి. భూమి కంపిస్తూ చీలిపోతూ ఉంటుంది. వేలాది ప్రజానీకపు హాహాకారాల నేపథ్యంతో కూడిన భీకర దృశ్యంతో ఒక మూలగా సూట్లు తొడుక్కున్న రెండు పిల్లులు కనిపిస్తాయి. ఆ పిల్లుల మొఖాల్లో రాబర్ట్స్, మిశ్రాల పోలికలు కనిపిస్తాయి. బహుశా వాటిలో ఒకటి తెల్లపిల్లి కాగా, రెండోది నల్లపిల్లి కావచ్చు. ఆ నల్లపిల్లి దశాబ్దాలుగా దేశాన్ని పరాయి పంచకు చేరుస్తున్న జయచంద్రబాబులకు ప్రతీక కావచ్చు.

ఎప్పటికీ నలుపు తెలుపుల చదరంగపు ఎత్తులు తప్పవా? తెల్లవాడి ముందు నల్లవాడు తెల్లమొహం వేయాల్సిందేనా? అప్పటి వలస పాలనతో

నల్లవాడు రెండో తరగతి పౌరునిగానే చలామణీ అయ్యాడు. ఇప్పుడు నయా వలస (వాదపు) పాలనలోను అంతే.

చదువుకోడానికే ఎన్నో పాట్లు పడ్డ 'నేను' పాత్రకు సెంటర్ ఫర్ సౌత్ ఏషియన్ ఎకనమిక్స్‌లో ఉద్యోగం. చిన్నచిన్న కన్సల్టెన్సీలతో ఎన్నో మెట్లెక్కి వచ్చినా, ఎంతో సుదీర్ఘ యానం తరువాత వరల్డ్ బ్యాంక్ కన్సల్టెన్సీ దొరకబుచ్చుకోగలుగుతుంది. వరల్డ్ బ్యాంక్ కన్సల్టెన్సీలో ఒక యూరోపియన్ లేదా అమెరికనే ఎప్పుడూ మిషన్ లీడరుగా ఉంటాడు. అతని కన్సల్టెన్సీ రేట్లే వేరు. లీడరుగానే కాదు, కేవలం మెంబర్లుగా ఉన్నప్పుడు కూడ తెల్లవాళ్ళ రేట్లు వేరే. తక్కినవాళ్ళ రేట్లు వేరే. మీటింగులు జరిగినపుడు చర్చల్లో, తీర్మానాల్లో ప్రజంటేషన్లలో తెల్లవాళ్ళకి లభించే గుర్తింపు వేరే. ఎన్నో యేళ్ళ ఇంటర్నేషనల్ అనుభవం తరువాత కూడ 'నేను'కు తెల్లవాళ్ళతో సమాన హెూదా లభించలేదు. సరికొత్త గ్లోబల్ గ్రామంలోనూ 'నేను' రెండో తరగతి పౌరుడే.

కలలో, మధ్య మధ్య మెలకువలో, కలత నిద్రలో 'నేను' పాత్ర ఏయే దృశ్యాలు చూసిందో, తనకేం జరిగిందో ఏమయ్యిందో తెలీదుకానీ మహత్తరమైన రసాయనిక చర్యేదో జరుగుతుంది. తననెవరో ఖండించగా రెండు ముక్కలు కాగా, తల వచ్చి రాములమ్మ ఇంట్లో పడినట్లుగా కలగంటుంది. నేను పాత్రకు అమ్మవారు (చికెన్ ఫాక్స్), అత్యంత సున్నితమైన ట్రాపికల్ ఫీవర్ సోకుతుంది. కేవలం ట్రాపికల్ ఫీవరేనా అది? కాదు, ప్రక్షాళన ప్రక్రియ. చలికాలాల సమస్త సూక్ష్మ వ్యాధుల్నీ శరీరంలో మూల మూలలా దాగినవాటిని కూడా అమ్మవారు ఊడ్చి ఊడ్చి శుద్ధి చేస్తుంది. అమ్మవారు తగ్గాకా నూరిన వేపాకు ముద్దతో స్నానం తప్పనిసరి. చిన్నప్పటి జ్ఞాపకాలు నేనుకు. చిన్నప్పుడు పల్లెలో అమ్మవారి తిరణాలలో బూరలు, బొమ్మలు కూడ ప్రాణంతో కదలాడితే, ఇప్పుడు మనుషులు కూడ బొమ్మల్లా, శాంపిల్సులా, స్టాటిస్టిక్స్‌లా కనబడడం విస్మయం కలిగిస్తుంది. పేరుకున్న పొరల్ని చీల్చుకుని కరడు కట్టిన విజ్ఞానపు మాడు పగులగొట్టి లోపల దాగి ఉన్న స్వస్థతలా అమ్మవారు తన లోపల్నుంచి బయటికొచ్చి నట్లనిపిస్తుంది 'నేను'కు.

వేపాకు ముద్ద కలిపిన నీళ్ళతో స్నానం చేసాకా, గుగ్గిలం ధూపంతో ఆరబెట్టుకున్నాకా పూర్తిగా నెమ్మదించినా, కళ్ళలో నలత ఎర్రజీరగా మిగిలే ఉంటుంది. దానికి మందుగా బాలింతరాలి చనుబాలు రెండు చుక్కలు 'నేను' కళ్ళలో వేస్తుంది రాములమ్మ.

కథ ముగిస్తూ, మిషన్ లీడర్ రాబర్ట్‌కు 'నేను' తన కన్సల్టెన్సీ ఉపసంహరించుకుంటున్న లేఖను అందజేస్తుంది. ఇకమీదట ఇక్కడే ఏదో చిన్న ఉద్యోగం చేసుకుంటూ, తన తీరిన సమయాలలో గ్రామాల్లో తిరుగుతూ ప్రజలతో కలిసి పని చెయ్యాలని నిర్ణయించుకుంటుంది.

ట్రాపికల్ ఫీవర్ వచ్చి తగ్గుతుంది.... పురా భారతీయమైన టిపికల్ ఫ్లేవర్‌తో జ్ఞానోదయమవుతుంది.

ఈ కథలో వీరభద్రుడి కథన వీరత్వం అబ్బురపరుస్తుంది. పౌరాణిక సమకాలీనాసక్తి (Contemporary Interest in Myth) కథనానికొక నిండైన శైలినీ, సమగ్రమైన శిల్పాన్నీ అందించడం ఈ కథలోని విశేషం. భారతీయమైన సేవాభావానికి, సేవ పేరుతో అలుముకుంటున్న పాశ్చాత్య వ్యాపార దృక్పథానికీ భేదాన్ని ఒకే సామ్యం, వేపతో విపులీకరించడమే ఈ కథలోని ఆకర్షించే వస్తు శిల్ప సంధాన సంవిధానం.

ఇంత గొప్ప కథను రాసిన వాడ్రేవు చినవీరభద్రునికి నా అభినందనలు.

(సర్కార్ ఎక్స్‌ప్రెస్, 29-06-2004, మంగళవారం)

---

డియర్ ఎడిటర్,

...సాహిత్యం గురించి ప్రత్యేకంగా ప్రచురిస్తున్నందుకు ధన్యవాదాలు. మాకినీడి సూర్య భాస్కర్ గారు చాలా బాగా నిర్వహిస్తున్నారు.

వాడ్రేవు చినవీరభద్రుడిగారి కథ 'ఆంధ్రజ్యోతిలో వచ్చినపుడు చదివాను. బాగున్నట్టనిపించింది. కానీ భాస్కర్‌గారి వ్యాఖ్యానంతో బాగా అర్థమయ్యింది. మనం చాలా ప్రమాదకరమైన పరిస్థితుల్లోకి బలవంతంగా నెట్టబడుతున్నామనిపిస్తోంది.

ఆ కథ రాసిన వీరభద్రుడిగారికి, గొప్పగా వ్యాఖ్యానించినందుకు భాస్కర్ గారికి, మంచి వ్యాసాన్ని ప్రచురించినందుకు మీకు నా హృదయ పూర్వక ధన్యవాదాలు. ఆ మాత్రం స్థలం కేటాయించినందుకే వ్యాసం సమగ్రంగా వచ్చింది.

ప్రతి గురువారం మాకినీడిగారు కళగురించి కూడా బాగా వ్రాస్తున్నారు. అందుకు కూడా నా అభినందనలు.

**– పి. మైథిలీశరణ్య,** బి.ఏ., **ప్రతాప్‌నగర్**

కథకుడు : మంచికంటి వెంకటేశ్వర రెడ్డి
కథ : మిత్తవ
ప్రచురణ : ఆదివారం ఆంధ్రజ్యోతి

## మంచి కథకుడు
## మంచికంటి

మనుషుల జీవితాలను కరువు ఏ విధంగా ధ్వంసం చేస్తుందో సహజమైన భాషలో, శైలిలో తెలియజెప్పిన కథ 'మిత్తవ'. కథకుడు 'ఒంగోలు కథాకంటి' మంచికంటి వెంకటేశ్వర రెడ్డి. 2003 తానా కథాసాహితి కథల పోటీలో బహుమతి పొందిన కథల్లో మొదటిది.

"ఏం మడిసో! ఇల్లొదిలిపెట్టి పోయి ఇయ్యాల్టికి పది రోజులైంది. ఒక మంచి లేదు, చెడూ లేదు. చచ్చాడో బతికేడో కూడా తెలీదు... పుట్టి బుద్దెరిగినాక ఇంత కటీనమైన మనిసిని నేనెక్కడా చూళ్ళేదు... లెక్కకు మడిసేగానీ, అబ్బో... అబ్బో... కొరివితో తల గోక్కున్నట్టే గదా!" అంటూ ప్రధాన పాత్ర 'గోయిందమ్మ' స్వగతంతో ప్రారంభమౌతుంది కథ.

తను కన్న పిల్లలిద్దర్నీ, తనను కన్న మూడుకాళ్ళ ముసలి తల్లిదండ్రుల్నీ, తనకోసం అన్నీ వదులుకొచ్చిన తననీ వదిలిపెట్టేసి

అర్ధంతరంగా అంతర్ధానమైపోయాడు భర్త. ఉండి మాత్రం వాడు చేసేదేముంది? "ముద్దెనక చేతులు బెట్టుకొని, గోయిందమ్మనే అదిలించి బెదిరించి అయినకాడికి పట్టుకెళ్ళి రాజకీయాలనీ, మీటింగులనీ చెడతిరిగి తగలేసుకొచ్చేవాడు", కొడుకు గురించి సొంత తల్లి అభిప్రాయం.

భర్త ఎలాంటి వాడైతేనేం, "ఉండే పొలానికి తోడు ఇంకొంత మగతకీ, పొలికీ దీసికొని" పొలం పనులన్నీ స్వయంగా చూసుకుంటూ దేనికీ దిగుల్లేకుండా చక్రం తిప్పింది గోవిందమ్మ. కరువు పుణ్యమాని, "మొగతాలోళ్ళొచ్చి ఇంటిమీద పడ్డారు. మట్టిలో బోసిన గింజలు మట్టిలోనే మసైనియ్. అప్పులోల్లొక తట్టు, కూలోళ్ళొక తట్టు పీక్కు తింటా ఉంటే", "యడదాడ మునగకపోయే తలికి కాలూ జెయ్యాడక" దేశాలు పట్టుకు పోయాడు భర్త. మణుసులో మాట బైటికి చెప్పుకుందామన్నా మడిసి తోడు కూడా కరవైంది. "ఇట్టాంటప్పుడు గూడా మనిషి అసిదోడు లేకపోతే ఏం కోసక తింటానికా మొగుడనే వోడు" – ఇదీ గోవిందమ్మ స్వగతం. కళ్ళనుంచి బొట బొటా కన్నీళ్ళు కారుతుండగా పలుకుతుంటే, వింటున్న మనకూ కళ్ళనుంచి బొటబొటా కన్నీళ్ళు కార్తాయి. కారడం మొదలెట్టిన దగ్గర్నుంచీ మరి ఆగవు.

"అత్తని గెంజి కాసి పోసేకాడికి పోయి ఊపిరి నిలుపుకో"మని చెప్పి, పిల్లల్ని తీసుకుని కొంగుకు కట్టుకున్న నాలుగు రూకలతో రోడ్డున పడుతుంది గోవిందమ్మ. దారీ తెన్నూ లేదు. గమ్యం ఏమిటో తెలీదు. 'గంపెడు చీకటిని నెత్తి మీదేసుకుని' బయల్దేరుతుంది. ఊర్లో కరువు మండిపోతోంది. 'పొలలన్నీ యాడలేని నిశ్శబ్దాన్నీ మింగి' బావురుమంటున్నాయి. ఎండి పరిగలయ్యాయి. పైరు బొందుపోయింది. యాడ మోటార్లాడ సచ్చిన మడుసుల్లా పొర్లాడుతుండాయి.

దారిలో స్నేహితురాలు తులసమ్మ కలుస్తుంది. ఇల్లు ఒబ్బిడి చేసుకుని తానూ ఊరు విడిచి పోతున్నట్లు చెబుతుందామె. ఆమెకో గమ్యమంటూ ఉంది. పని వెతుక్కుంటూ వెళ్ళిన భర్త దగ్గరకు పోతోంది.

కనిగిరి పోయే బస్సు వస్తే ఇద్దరూ ఎక్కుతారు. దారి పొడుగునా జరిగే సంఘటనలు కరువు రక్కసి క్రూర పైశాచికత్వాన్ని కళ్ళకు కడతాయి. "ఇన్ని అగచాట్లమారి కాలం ఎప్పుడూ రాలేదమ్మ. ఊళ్ళో ఏ మూలకెళ్ళినా ఉగ్గిన్నెడు ఉప్పునీళ్ళయినా పుట్టకపోతుంటే ఏ బాయిలోనా గొంతు తడుపుకోడానికి సుక్క నీరు లేదు. బోరింగు పంపులు గలగల మోగి

ఎన్నాళ్ళయింది? ఆరు మైళ్ళు నడిస్తే అక్కడా దొరికేది ఉప్పునీళ్ళే గదా!" అంటుంది తులశమ్మ మాటల మధ్య.

బస్సు బయల్దేరతీసి అర్ధగంటైనా కాదు, ఐదారు గొర్ల లారీలు బస్సుని దాటుకు వెళ్తాయి. గోవిందమ్మ అడిగితే చెబుతుంది తులశమ్మ, "ఆరుగాలం మేపి మేపీ ఇయ్యాల వొౌలుకుల్లో కలపాల్సొస్తుందే... దయా దాక్షిణ్యం లేకుండా అమ్మి పార్నాకిన గొర్లయ్యన్నీ" అంటుంది.

ఇలాంటి కరడుగట్టిన కరువులో మగతోడు లేని గోవిందమ్మ గమ్యం లేని... తెలీని ప్రయాణం. పిల్లల్ని చూసుకుంటే కడుపు తరుక్కుపోతుంది. "డొక్కల్లోకి లాక్కుపోయిన కడుపులు, పుల్లల్లా ఎండిపోయిన కాళ్ళూ, చేతులూ, పరిక్కంపలాగా ఎండిపోయిన నెత్తీ, పీక్కుపోయిన ముకాలు''తో పిల్లలిద్దరూ తోటకూర కాడల్లా వ్రేలాడిపోతున్నారు. వాళ్ళు కడుపునిండా కూడు తిని ఎన్నాళ్ళయ్యిందో!

బస్సు కనిగిరి చేరుకుంది. అందరితో పాటూ తానూ దిగుతుంది గోవిందమ్మ. డిపోలోను, బజార్లోను భర్తకోసం వెతుకుతుంది. జాడ దొరకదు. తన ఊరివాడు రాంకోటి కనబడితే తన భర్తగానీ కనిపించాడేమోనని వాకబు చేస్తుంది. ఫలితం శూన్యం. తను పుట్టిన ఊరు 'వెంకటాపురం' పోయే బస్సులు రెండు వచ్చిపోతాయి. వాటిని చూస్తూనే వదిలేస్తుంది గోవిందమ్మ. "ఆ ఊరు పేరు తల్చుకుంటేనే ఎందుకో ఇబ్బంది"గా అనిపిస్తుంది. "యాడజూసిన కరువు ఒకే తీరుగా ఉండప్పుడు ఒక సంసారం బోయి, ఇంకో సంసారం మీదబడితే ఎట్టా బరిస్తారు?" అనుకుంటుంది గోవిందమ్మ.

మూడో బస్సు కూడ వచ్చింది. అప్పటిగ్గూడా గోవిందమ్మకు బస్సెక్కాలనిపించలేదు. ఎన్నిసార్లో రమ్మని కబురు చేసినా, నా పిల్లలూ... నా సంసారం... నా గొడ్లు గోదా అంటూ వెళ్ళేది కాదు. అందుకే, "ఇయ్యాల అవటానికి అమ్మగారిల్లయినా ఏ మొహం పెట్టుకోని బోవా"లనుకుంటుంది. కానీ తప్పుతుందా? గత్యంతరం లేని స్థితిలో బస్సెక్కి కూర్చుంటుంది గోవిందమ్మ.

పుట్టింటికి చేరుతుంది. అమ్మ, నాన్న పంచలోనే పడుకుని కనబడతారు. అమ్మ పక్కలో మేనల్లుడు, నుదుటిమీద తడిగుడ్డతో మూలుగుతూ కనబడతాడు. లోపలికెళితే వదినా మంచమ్మీదే. తల్లీ, తండ్రీ, వదిన, వాళ్ళ పిల్లాడు 'బుజ్జిగోడు' అందరూ జ్వరంతో తలో మంచం పట్టేశారు.

"మ్మాయ్...గోయిందా! ఎప్పుడు తినొచ్చారో పిల్లలు... ఎండే నక్కల్లా నకనకలాడుతుండారు. పొయ్యిమీద కాసిన్ని బియ్యం కడిగెయ్యమ్మా" అన్న తల్లి మాటతో అందుకోసమే ఎదురు చూస్తున్నట్టుగా దిగ్గన లేచి బియ్యం నానేసి ఎసట్లో పోస్తుంది. గోవిందమ్మ జాడీలోంచి చింతకాయ పచ్చడి తీసి రోట్లో నూరుతుంది. వేడివేడి అన్నంలో పచ్చడి కలిపి పిల్లలిద్దరికీ పెడుతూ మధ్యమధ్యలో తానూ ఒక్కో ముద్ద నోట్లో వేసుకుంటుంది. ఆవురావుమంటూంటే ఆకలికి ఆమాత్రం తిని ఎన్నాళ్ళయ్యిందో! అన్నా వదినా తననూ, తన పిల్లల్నీ ఆదరించారంతే చాలు అనుకొంటూండగా...

ఆ యింటి మీద 'మిత్తవ' వచ్చి పడుతుంది. ఊరి వైద్యగాడు నారాయణ మందు పని చెయ్యదు. అన్న కొడుకు బుజ్జిగాడు హరీమంటాడు. కలత...కలవరం, చెదరిన మనసులు... కరిగిన ఆప్యాయతలు... అన్నతో వదిన రహస్యంగా అన్న మాటలు వింటుంది గోవిందమ్మ. "ఈమె పిల్లలతో ఇక్కడే ఉండిపోయేలాగుంది. మనం మాత్రం అష్టైశ్వర్యేలు అనుభవిస్తున్నామా?" అంటుంది. ఆ రాత్రి గోవిందమ్మకు నిద్ర పట్టదు. అందరూ నిద్రపోతున్న సమయంలో పిల్లల్ని తీసుకుని ఊరి బయటకు వెళ్తుంది. అడవి తుప్పల మధ్య ఉందొక పాడుబడిన నుయ్యి. అమాంతం పిల్లలిద్దర్నీ ఎత్తి అందులో పడేస్తుంది. గోవిందమ్మ, తర్వాత తన చీరకొంగుతో ఉరేసుకుంటుంది.

మర్నాడుదయం "ఊరు ఊరంతా అక్కడే చేరుతుంది. చెట్టుకు వేలాడుతున్న గోవిందమ్మ శవం, నాలుక సాగి ఉంటుంది. రాక్షసి కళ్ళలా ఉబికివచ్చి ఉంటాయి కళ్ళు. అన్న, తల్లి కూడ వస్తారు. ఆ దృశ్యం చూడలేక బోర్లాపడి ప్రాణాలు వదులుతుంది తల్లి లక్ష్మమ్మ.

దాహం, ఆకలి... వలస, నిరాశ... చివరికి మృత్యువు ('మిత్తవ'- ప్రకాశం జిల్లా మాండలికం) కరువు కోరలకు చిక్కి ఎందుకూ కాకుండా పోతుందొక నిండు కుటుంబం... ఇదీ ఇతివృత్తం 'మిత్తవ' కథలో - చదువుతున్నంత సేపూ గుండెలవిసిపోతాయి.

కథాప్రారంభంలో గోవిందమ్మ తన అత్త సుబ్బమ్మతో ఇల్లు విడిచి పోయిన తన భర్త గురించి మాట్లాడుతూ అంటుంది - "నిన్నుగూడా యెంటబెట్టుకెళ్తే, నేను నా పిల్లలు ఏ నుయ్యో గొయ్యో చూసుకునేవాళ్ళం గదా!" అని. అదే నిజమవుతుంది చివరికి. ఆ విధంగా ప్రారంభంలోనే కథాంతాన్ని సూచిస్తాడు కథకుడు మంచికంటి. అలాగే, ఎక్కడానికి సందే

లేని బస్సులోకి ఎక్కుతూ, "ఈ పిల్లల్నేసుకుని ఈ సముద్రంలో ఈదాలంటే అయ్యే పనేనా?" అనుకుంటుంది గోవిందమ్మ. ఇది కూడా భవిష్యత్తుకు సూచనగా అనిపిస్తుంది.

కరువు కాటకాల భీకర సంక్షోభాన్ని కాల్పనికతకు తావు లేకుండా సూటిగా, ధాటిగా కళ్ళకు కట్టిస్తారు కథకుడు. స్వయంగా కవి కూడా కావడంవల్ల మంచి మంచి కవితాత్మకమైన భావచిత్రాలు కథలో సైతం వాడారు మంచికంటి – ఎండిపోయిన కళ్లల్లోంచి కూడా ఊట తన్నుకు రావడం, గంపెడంత చీకట్ని నెత్తినేసుకోడం, ఉగ్గిన్నెడు నీరుతో గొంతు తడుపుకోడం, చేలు పరిగలేరుకోడం వంటివి. మొత్తానికి కరువు రక్కసి కర్కశ రూపాన్ని అద్భుతంగా చిత్రించిన మంచికంటి మంచి కథకుడు... మంచి కన్నున్న కథకుడు!

(సర్కార్ ఎక్స్‌ప్రెస్, 6-07-2004, మంగళవారం)

---

మాకినీడివారికి కృతజ్ఞతలు. వ్యాసం చదువుతుంటే నా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. కథ రాసేటప్పుడు కూడా నాకిది అనుభవం కాలేదు. అంత బాగా రాశారు మాకినీడి.

లోగడ ప్రముఖ కవి, విమర్శకులు ఆవంత్స సోమసుందర్ గారు రాశారు. ఇప్పుడు భాస్కర్‌గారూ! చాలా బాగా రాశారు.

ప్రచురించిన ఎడిటర్‌గారికి నా అభినందనలు.

**– మంచికంటి వెంకటేశ్వర రెడ్డి, ఒంగోలు**



యువత 'కలల సార

ఆవిష్కరించిన ఆ

కథయిత్రి : డా॥ ఆలూరి విజయలక్ష్మి
కథ : కలల సౌరభం
ప్రచురణ :

## యువత 'కలల సౌరభం'
## ఆవిష్కరించిన ఆలూరి

పుట్టిన దేశంలో ఉన్నత విద్యాభ్యాసం కావాలి. మెరుగైన జీవితం కోసం మాత్రం నేటి యువత ఇంటిగడప దాటినంత సునాయాసంగా ఖండాంతరాలు దాటి అమెరికాకు వలసపోతోంది. తమ చదువునీ, శక్తినీ, యుక్తినీ, తాము పుట్టిన దేశానికి ఉపయోగించకుండా వేరే దేశానికి ధారాదత్తం చేసి ఆ దేశ అభివృద్ధికి ధారపోస్తోంది. "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి" అన్న ఆర్యోక్తిని మరచిపోయి తమ సుఖశాంతులను అన్వేషించుకుంటూ 'విచ్చలవిడి' సంఘానికి ఆకర్షింపబడుతోంది – సాధారణంగా అమెరికా వెళ్తున్నవారి గురించి అందరూ అనుకునే అభిప్రాయమే ఇది. ఇది పూర్తిగా అసత్యం కాకపోయినా, ప్రవాస యువతలో దేశం కోసం ఆలోచించే 'మంచి' లేకపోలేదని తెలిపే కథ డా॥ ఆలూరి విజయలక్ష్మి 'కలల సౌరభం'.

అమెరికా వెళ్ళిన యువతీ యువకులకు

కర్తవ్య నిర్దేశం చేసే మంచి కథ – కేవలం మూడు పాత్రల మధ్య జరిగిన సంభాషణలతోను, ప్రత్యక్షంగా కాకపోయినా, మాటల సందర్భంలో వినిపించే మరో రెండు ముఖ్య పాత్రలతోను మొత్తం కథంతా సాగుతుంది. నాలుగు సంవత్సరాల తరువాత కూతురు సుధకు పురుడుపోసే నిమిత్తం అమెరికా ప్రయాణమైన వసుధ కూతురువద్దకు చేరకుండానే కథ ముగిసి పోతుంది. కారణం, అల్లుడు ప్రశాంత్‌కు అనుకోకుండా తప్పనిసరి పని తగిలి, ఆమెను రిసీవ్ చేసుకుందుకు చికాగో విమానాశ్రయానికి వెళ్ళలేని పరిస్థితిలో, ఆ పనిని చికాగోలోనే ఉంటున్న రామానుజం నిర్వర్తించడం, చికాగోకు మూడుగంటల దూరంలో ఉన్న కూతురి వద్దకు ఆ చలిరాత్రే తీసుకుపొమ్మని అతణ్ణి బలవంతపెట్టలేనితనంతో ఆ రాత్రికి రామానుజం ఇంటిలోనే ఉండడం, అంతలోనే కథ ముగిసిపోడంతో వసుధ కూతురు, అల్లుళ్ళ గురించి పాఠకుడికేమీ తెలీదు. అయితే ఒకటి, తల్లిదండ్రులిద్దరూ ఉన్నత సంస్కారం కలిగిన ఉపాధ్యాయులు కావడమూ, కథలో వసుధది మంచి వ్యక్తిత్వంగల అప్టిమిస్టిక్ పెర్సనాలిటీ కావడమూ, ఆమె కూతురు సుధ, ఆమెతోపాటు అల్లుడూ మంచివారే అయ్యుంటారని తోస్తుంది.

చికాగో వీథుల్లో వెళ్తుంటే వసుధకు స్వామి వివేకానంద చికాగోలో జరిగిన పార్లమెంటాఫ్ రెలిజియన్స్‌లో శ్రోతల హృదయాల్ని తట్టిన ఆయన సంబోధన, సభికుల్ని మంత్రముగ్ధుల్ని చేసిన ఆయన ప్రసంగం గుర్తు వస్తాయి. పత్రికల ద్వారా పరిచితమైన చికాగో నివాసి, ప్రపంచ ప్రసిద్ధ చిత్రకారుడు ఎస్వీ రామారావు గుర్తొస్తారు. "ఏ దేశమేగినా ఎందు కాలిడినా పొగడరా నీ తల్లి భూమి భారతిని…నిలుపరా నీ జాతి నిండు గౌరవమ్ము" అని బోధించిన ఉపాధ్యాయిని ఆమె.

ఈ కథలో అడుగడుగునా ఇక్కడ పుట్టి పెరుగుతున్న తెలుగువారికీ, ప్రవాసం పోయి అమెరికాలో స్థిరపడ్డ తెలుగువారికీ ఉన్న భేదం ద్యోతకమవుతూనే ఉంటుంది. రామానుజం దంపతులు స్వచ్ఛమైన తెలుగు మాట్లాడ్డం, కొడుకు కూడ తెలుగులో మాట్లాడ్డం ఆమెకు వీనుల విందవుతుంది. అమెరికా వెళ్ళినవారు బాగానే ఉంటారు. ఇక్కడ మనం మాత్రం కావలసినదానికీ అక్కర్లేనిదానికీ ఇంగ్లీషులోనే మాట్లాడతాం. ఆఖరికి ఇంగ్లీషులోనే నవ్వుతాం; ఏడుస్తాం కూడా.

సరే, ఇక కథావిషయానికొస్తే–కొడుకును అమెరికా పంపుతూ రామానుజానికి తల్లి చెప్పిన మాట–"మన కడుపుకు మనం ఎంత తిన్నా

విలువేముంది? నీకు పది ముద్దలుంటే, ఒక ముద్దన్నా పక్కవాడికి పెట్టు. ఆ ఒక్క ముద్దకే విలువెక్కువని మరచిపోకు నాన్నా!" అన్న హితవు. దాని ప్రకారం అతను నడచుకోడం కథాంశం. నిజానికి ఇదే సనాతన భారతీయ ధర్మం – "సర్వేజనా స్సుఖినోభవంతు...లోకాస్సమస్తా సుఖినోభవంతు". ఈ ఆదర్శమే అవసరాన్ని త్యాగం చేసి పొదుపుచేసి, ఆ డబ్బును ఇండియా వచ్చినప్పుడల్లా తన ఊరికి ఏదో ఒక సహాయం చేసి రావాలనే తాపత్రయంగా రూపుదాల్చుతుంది. దానికి మనసా వాచా కర్మణా అనుకూలించే అర్ధాంగి సుమతి. వ్యక్తులుగా చెయ్యగలిగేది స్వల్పమే అయినా దాన్ని మంచి సంకల్పంతో చేస్తే ఎంతో కొంత పాజిటివ్ ప్రభావంతో కొంతమందికైనా ఉపయోగపడుతుందని నమ్మే తత్వంగల ఆదర్శ జంట వారిది. అంతకు ముందు తన ఊరి లైబ్రరీకి పుస్తకాలు కొని, కొంతమంది పేద విద్యార్థుల చదువుకు సహాయపడ్డం, మంచినీటి చెరువుకు పూడిక తీయించటానికి కొంత డబ్బు సర్దడం వంటి చిన్నచిన్న సహాయాలు చేసిన రామానుజం ఈసారి తన ఊరి హైస్కూల్లో ఆడపిల్లలకు మూడు టాయిలెట్స్ నిర్మింపజేసి, వాటి మెయింటెనెన్స్ కోసం పైపులు, మోటారు కూడా వేయించి వచ్చాడని తెలుసుకున్న వసుధ ఎంతో ఆశ్చర్యపోతుంది – "మహిళలకు సంబంధించిన ఇంత ముఖ్య అంశం ఏ దేశంలో ఉన్నా ఆ యువకుడి హృదయాన్ని కలవరపరచడం ఆమెకెంతో విస్మయం కలిగిస్తుంది. స్కూలులో ఆడపిల్లల్తో పాటు ఉపాధ్యాయినుల బాధాకరమైన అనుభవాలు పరిచయమున్న టీచర్ ఆమె. (మన స్కూళ్ళ పరిస్థితులివి. కాకినాడ మున్సిపాలిటీకి పెద్ద స్కూలైన గాంధీనగరం హైస్కూల్లోనూ ఇంతే)

స్థూలంగా ఇదే అంశమైన ఈ కథ, "ఈనాటి యువతీయువకులు తమ సుఖసంతోషాల గురించి, తమ అభివృద్ధి గురించే తాపత్రయ పడతారు తప్ప పక్కవారి గురించి, చుట్టూ ఉన్న సమాజం గురించి బొత్తిగా పట్టించుకోరనే సామాన్యీకరణ తప్పు" అని నిరూపిస్తుంది. బతుకులోని రాక్షసపోటీ కొంత, వారినలా మారుస్తుందేమోకాని, అదర్శాలు కలలు యువత సజీవ లక్షణం, ప్రాథమిక స్వభావం – ఏ తరంలోనైనా సరే. ఇదే యువత 'కలల సౌరభం'.

ఈ స్థూలాంశంతో పాటు మరెన్నో ఆదర్శాలను, బోధలను యువతకు చేశారు కథయిత్రి. అయితే ఎక్కడా పనిబెట్టి చెప్పిన వైనం ద్యోతకం కాదు. కథలోని అంశంలా సహజంగానే సాగిపోతాయి, రచయిత్రి క్లాసులన్నీ. దీనిక్కారణం వస్తువు తనకు తగ్గ శిల్పాన్ని సంతరించుకోడమే.

వస్తు శిల్పాల సమన్వయం మనసుకు పట్టి, ఒక అక్షరం వదలకుండా చదివించే గొప్పతనం ఈ కథలో ఉంది. ఫామిలీ ప్లానింగ్ వంటి ఎన్నెన్నో అంశాల్ని చెప్పినా, అవన్నీ కథలోని సంభాషణల్లో భాగం కావడంతో ఎంతో సహజంగా ఆయా సంఘటనలకు అతుక్కుపోయినట్లుగానే అనిపిస్తాయి. అలాగే ఎన్నో సందర్భాల్లో ఆలోచనాత్మకమైన ప్రశ్నలను సైతం కథాగమనంలో లేవనెత్తుతారు కథయిత్రి. అవన్నీ కూడ సహజంగా కథలో మిళితమైపోడంవల్ల ఎంత మాత్రమూ ఎబ్బెట్టుగా అనిపించవు.

సందర్భవశాత్తూ సుమతిచేత, "మంచి ఉద్యోగంలో స్థిరపడేదాకా పిల్లలు పుడితే సరిగ్గా చూసుకోలేమని వాయిదా వేసాం. తీరా కావాలనుకునే టప్పటికి పిల్లలు పుట్టడం కష్టమయింది. రకరకాల పరీక్షలూ, మందులూ, హార్మోన్ ఇంజక్షన్లూ... రెండుసార్లు గర్భం వచ్చికూడా నిలవకపోవడం..." ఇలా చెప్పిస్తారు రచయిత్రి. రచయిత్రి డాక్టరు కూడా కావడంచేత ఈ మాత్రం చెప్పలేకుండా ఉండలేరు, సహజంగా! వృత్తి ప్రవృత్తిలో ప్రతిఫలించడం అంటే ఇదే.

అయితే చాలామంది దంపతుల్లో పిల్లలు కావాలనుకునే సమయానికి, అంతకుముందు గర్భనిరోధం కోసం వాడిన మందులవల్లే పిల్లలు పుట్టకపోడం నూటికి అరవై కేసులు పైగా సంభవిస్తుంది. కారణం శరీర సహజధర్మాలకు వ్యతిరేకంగా హార్మోన్ ఇంబేలన్స్‌కు గురిచేస్తూ ఈ మందులు పనిచేయడమే. ప్రోజెస్టిరాన్, ప్రోలాక్టిన్ వంటి హార్మోనుల తయారీని అడ్డగించి, క్రమేపీ ఆ వ్యవస్థను నిర్వీర్యం చెయ్యడంవల్ల కలిగే ఈ దుష్పరిణామాల్ని డాక్టరైనవారు విడమరచి చెప్పి, ఏ కండోమ్ లేదా లూప్‌వంటి భౌతిక గర్భనిరోధ సాధనాల వాడకాన్ని ప్రమోట్ చేయడం మంచిదేమో!

స్వామి వివేకానంద మాటలతో కథావస్తువుకు సరిపోయే ముగింపు ఇచ్చారు కథయిత్రి. "మీ హృదయాలను ప్రపంచమంత విస్తృతం చేసుకుంటే అప్పుడు మహాశక్తి మీ వెనుక ఉంటుంది. ఇతరులకోసం చేసే అతిస్వల్ప కార్యం కూడా మీలోని శక్తిని మేల్కొలుపుతుంది. ఇతరులకోసం ఏ కొద్దిపాటి మంచిపని చేసినా మీలో సింహానికున్నంత శక్తి -మీరు భరించలేనంత శక్తి ఉద్భవిస్తుంది. మీరు ఆశ్చర్య చకితులవుతారు". ఈ కథద్వారా డా॥ ఆలూరి విజయలక్ష్మి, యువతకు ఇవ్వాలనుకున్న సందేశం ఇదేనని చెప్పడం అత్యుక్తి కాదు. అసత్యం అసలే కాదు.

(సర్కార్ ఎక్స్‌ప్రెస్, 21-09-2004, మంగళవారం)

కథకుడు : ఇంజేటి శ్యాంబాబు
కథ : ఆకలేమయ్యిదమ్మా ఎన్నెలా!
ప్రచురణ : ఆంధ్రజ్యోతి ఆటా కథలపోటీ
2003

# ఇంజేటి ముంజేతి కథనదర్పణం –
# 'ఆకలేమయ్యిందమ్మా ఎన్నెలా...'

ఆంధ్రజ్యోతి – ఆటా కథల పోటీ (2003)లో ప్రథమ యువ పురస్కారం పొందిన కథ 'ఆకలేమయ్యిందమ్మా ఎన్నెలా...' కథకుడు ఇంజేటి శ్యాంబాబు. గత ఎనిమిదేళ్ళుగా జర్నలిస్టు జీవితం గడుపుతున్నారు.

తన కథగురించి చెబుతూ, "మరువలేని మరపురాని నాలాంటివాళ్ళ కథే" అన్నారు. కానీ, నిజానికిది ఆయన ఆత్మకథ. "మా అమ్మకు గుర్తున్నంత వరకు 1972 ఆగస్టు ఒకటి నా పుట్టిన తేదీ" అంటారు రచయిత, తన పరిచయంలో. కథలోని ముఖ్యపాత్ర (హీరో అనడంలేదు, హీరో అనగానే మనకు సినిమాల్లోని హీరోలే గుర్తుకొస్తారు. నేటి సినిమా హీరోలు జీరోలు. వారితో పోలిస్తే మన ముఖ్యపాత్రను చిన్నబుచ్చినట్టే) సుందర్రాజు పుట్టిన రోజు కూడా స్కూల్లో చేర్చే రోజు పంతులుగారు ఉజ్జాయింపుగా లెక్కగట్టి ఖరారు చేసిన ఆగస్టు ఒకటే. కేవలం

పుట్టిన రోజు సాదృశ్యంతోనే ఈ కథ కథకుని ఆత్మకథ అనడంలేదు. కథాగమనంలో అడుగడుగునా మనసును తడిపేసే ఆర్ద్రపూరితమైన కథకుని ఆత్మీయతే దానికి నిదర్శనం.

సుందర్రాజు చిన్నప్పటి జ్ఞాపకంతో మొదలవుతుంది కథ. తాటి తోపు అవతల ఎక్కడో దూరంగా ఉన్న హాస్టలునుంచి – అన్నం, పప్పు, చారు కంచంలో పడగానే గబగబా గొంతులో వేసుకుని, చేతులు కూడా సరిగ్గా కడుక్కోకుండా అమ్మ దగ్గరికి పరుగెత్తేవాడు. అమ్మ దగ్గర పడుకోవాలనీ, ఇంట్లోనే ఉండాలనే ఆశతో. కాని అస్తమానూ ఇంటికొచ్చేస్తే హాస్టల్లో ఉండనివ్వరని 'ఏడుస్తూ కాస్త దూరం మోస్తూ, నడిపిస్తూ' సుందర్రాజును తీసుకెళ్ళి మళ్ళీ హాస్టల్లో పడేసేది అమ్మ. ఈ విషయాన్ని కూతురు మమత కెన్నిసార్లు చెప్పాడో సుందర్రాజు.

అదే పనిగా గతకాలపు చేదు అనుభవాల తీపి స్మృతులను తలచుకుంటూ చెమరించడం సుందర్రాజుకు అలవాటు. అదొక్కటే అతనికున్న అలవాటు. అలవాటైనవే చేస్తాడుగాని, అలవాటు కానివి ఎప్పటికీ చెయ్యడు సుందర్రాజు. "నాన్నా! నువ్వెందుకు అమ్మ ఏం చేసినా తినవు?" అని ప్రశ్నించిన కూతురుకు అదే చెబుతాడు, "నా కలవాటు లేదమ్మా" అని. ఆరోజు చేసిన పెసరట్లు భార్య తినమంటే వద్దంటాడు. ఆమె నిష్ఠూరంగా మాట్లాడితే, అన్నంతోపాటు తినేయడానికి అయిష్టంగా ఒప్పుకుంటాడు.

ప్రతిరోజూ వట్టి అన్నం తప్ప మరేమీ తినడు సుందర్రాజు. ఎందుకంటే, అన్నీ తినడం గత జీవితంలో తనకు అలవాటు లేనిది. నడిచొచ్చిన జీవితంలో తనకు తెలియని వాటిని, అలవాటు లేనివాటిని ఇప్పుడు కొత్తగా చేసుకోవాలని లేదంటాడు. కొంపకి అద్దె, ఫోనుబిల్లుతో పాటు నెలకి పదిహేనువేల జీతగాడైన ఆఫీసర్ సుందర్రాజు. తనకి నాలుగేళ్ళు వచ్చినప్పట్నుంచీ కాలేజీ మెట్లు దిగేదాకా ఎస్సీ హాస్టల్ పప్పు, చారూ తప్ప ఇంకేమీ తినడానికి ఇష్టపడడు.

బతుకు మొదలుపెట్టిన పాకుడురాళ్ళను ఎప్పటికీ మరచిపోలేడు సుందర్రాజు. చిన్నప్పట్నించీ గడపిన 'కూలోడి కొడుకు' జీవితాన్ని ఆఫీసరుగా మారినా మరచిపోలేదు. ఒక్క మాటలో చెప్పాలంటే, తన మూలాల్ని ఎప్పటికీ మరచిపోలేని మనిషి సుందర్రాజు.

ఇదంతా ఏమిటి; పీనాసితనమా? పీనాసితనానికీ పొదుపుకీ తేడా

ఉంది. అవసరానికీ ఆడంబరానికీ కూడా చాల తేడా ఉందన్నది సుందర్రాజు అభిప్రాయం. నిజానికి కథలో శ్యాంబాబు చెప్పదలచింది కూడా ఇదే.

పుట్టినరోజు కోసం గాగ్రాచోళీ కొనుక్కోడానికి రెండువేల రూపాయలు కూతురడిగితే, మూడువేలిచ్చి, "కాలేజీలో యూనిఫామ్ తప్ప వేరేది వేసుకునే వీలులేదు కదా! బర్త్‌డే రోజు తర్వాత ఇక ఆ డ్రెస్ ఎప్పుడు వేసుకుంటా"వని అడుగుతూ, "పనికొచ్చేది ఏదైనా కొనుక్కో"మంటాడు. పెట్టే ఖర్చుకు తగిన ఫలితం ఉండాలనుకునే యుటిలిటేరియ'నిజం' ఒక్కటే సుందర్రాజుకు తెలిసింది. పనిమనిషికి నెలకి రెండొందలు ఇవ్వడం ఆడంబరమని భావిస్తాడు. భార్య పనిభారం తగ్గించడానికి నెలలో ఇరవై రోజులు తానే డిష్‌వాష్ చేసి, ఇల్లు తుడుస్తుంటాడు.

ఇంతా చేసి సేవింగ్స్‌లో డబ్బులు పెడతాడా అంటే అదీ లేదు (అదే భార్యకు కోపం). మరేం చేస్తాడు? విజయవాడ క్రీస్తురాజపురం రోడ్ నంబరు 26లో ఉండే అక్క కె. మరియమ్మకు (ఆమె ఇంటిపేరేమిటో, 'కె' అంటే కువైట్. మొత్తానికామె కువైట్ మరియమ్మ, ఇంజేటి కాదు). మూడువేలు, తెనాలి మారిస్ పేటలోని అప్పలస్వామి గుడికి ఎదురు సందులో ఉంటున్న సాల్మన్ రాజుకు రెండువేలు, బాలింతగా తినీతినక చాకిరి చేసిచేసీ ఆకలిజబ్బుతోనే పోయిన చెల్లి కీర్తన కూతురు 'నల్లబుల్లి' హాస్టల్, స్కూల్ ఖర్చులకు వెయ్యిరూపాయలు ప్రతినెలా పంపుతుంటాడు సుందర్రాజు. ఎందుకనీ?

కుటుంబ పోషణ కోసం జీవితాన్ని త్యాగం చేసి కువైట్ వెళ్ళిన అక్క మరియమ్మనూ... వంద డబ్బాల్లో కర్పూరం బిళ్ళలు సర్దితే రూపాయి, వంద అగ్గిపెట్టెలంటిస్తే ఇరవై ఐదు పైసలు చొప్పున వచ్చే కూలిలో 'బుజాలు కుంగే కష్టంలోంచి తన చేతుల్లోకి డబ్బులు జార్చిన సాల్మన్‌రాజునూ... "నీకోటి పెడతా ఇలా రారా" అని హాస్టల్ కిచెన్‌లోకి తీసుకుపోయి డేగిసాలో కాగిన పాలమీది మీగడ రేకును చీపురుపుల్లతో తీసి పెట్టే జ్ఞానానందాన్నీ... అంచులు చిరిగిపోయిన ఫేంటు, పురికొస ముడేసిన రబ్బరు చెప్పులతో ఊరి బయట కాలేజీకి నాలుగు మైళ్ళు నడుచుకుంటూ వచ్చి కట్టాల్సిన ఫీజు డబ్బులు తెచ్చిచ్చే 'బుజాలు కుదించుకుపోయిన పొడుగాటి మనిషి', చనిపోయిన నాన్ననీ... ఎవరిని, ఎవరిని మరచిపోగలడు తను? సాల్మన్‌రాజును తలచుకుంటూ కమ్మని కర్పూరం వాసన ముక్కుకు

తాకుతుందనుకుంటాడు సుందర్రాజు. ఆ సందర్భంలో పాఠకుడి మనసును తాకుతుంది సుందర్రాజు మానవత్వపు పరిమళం.

ఇన్ని కమిట్‌మెంట్స్‌తో ఊరకే దుబారా చెయ్యగలడా తను? అయినా చేసే వీలు మాత్రం ఉందా తనకి? జేబులోంచి జారిపడి గిరగిర తిరుగుతున్న రూపాయి బిళ్ళను గబుక్కున చేతుల్లోకి తీసుకుంటాడు సుందర్రాజు.

అందర్నీ తలచుకుంటూ, వాళ్ళతో మాట్లాడుతున్నట్టే చెప్పే సుందర్రాజు స్వగతాలు గుండెల్ని పిండేస్తాయి. "నాన్నా! నీకు నెయ్యేసిన ఇడ్లీలు తెలుసా... హల్వా పూరీలు తెలుసా... చికెన్ ఫ్రైలు, పీతల పులుసులు ఎన్నున్నాయి నాన్నా... నువ్వు బ్రతికిరా నాన్నా, అవన్నీ నీకు ఇప్పుడు తినిపిస్తాను....", ఆక్రోశిస్తాడు సుందర్రాజు. ఎప్పుడూ చింతకాయ పచ్చడ్ని మిరపకాయ రొట్టెతోపాటూ నమిలిన తండ్రిని గుర్తు చేసుకుంటూ!

"చెమటని రూపాయి చేసిన నీ చేతులిలా తేరా సాల్మన్. నీ చేతులపై నేను నడిస్తేనే ... ఈ ఉద్యోగమూ, కారూ, మేడా... నే చచ్చేదాకా తీర్చినా నీ రుణం తీరుతుందిరా!", పలవరిస్తాడు.

"ఒరే జ్ఞానీ! ... తిండిపైన నీ జ్ఞానానికి జోహార్‌రా... ఇవ్వాళ ఫైవ్ స్టార్ హొటల్లో బఫే ఉందిరా. ఇవ్వాళ నువ్వు నాకు దొరక్కూడదా... రాత్రికి నా క్వార్టర్స్ ముందు లాన్‌లో చికెన్ బిర్యానీ తింటూ నీవు పాడే పద్యాలు" వినాలంటాడు. ఈ అన్ని సందర్భాల్లోనూ కథకుడి గుండె దిగులు అక్షర ప్రవాహమై నేరుగా పాఠకుల గుండెల్లోకి ప్రవహిస్తుంది.

పెసరట్లు తిననంటున్న సుందర్రాజును కూతురు అడుగుతుంది, "నీకేమిష్టం నాన్నా?"అని. "...నాకయితే ఎప్పుడూ కోరినవన్నీ తినకుండా దాటిపోయిన మా అమ్మా నాన్నల మధ్యలో కూర్చుని గార్లూ, టిఫిన్లూ తినాలని... మా ఇంట్లో అందరూ సుఖంగా బతకాలని... ఆ కష్టాలు, దరిద్రాలూ, నేననుభవించిన జీవితం... మమతా... దాన్ని మర్చిపోవాలని నాకు లేదమ్మా!" అంటాడు. ఆర్తిగా! తల్లిదండ్రులు తమ జీవితంలో రుచి చూడని భోజ్యాలను, కాశీలో వదిలేసిన వాటిల్లా ముట్టుకోకపోడం ఒక నియమంగా పాటిస్తూ వస్తున్నాడన్న విషయం తెలిసి మన గుండె బరువౌతుంది.

డ్రెస్ కోసం తనకు ఇచ్చిన డబ్బులు తిరిగి ఇచ్చేస్తే, "ఏం చేస్తా?"వని అడుగుతుంది మమత. తడుముకోకుండా, "కీర్తన కూతురుకి యూనిఫాం

కుట్టిస్తా”నంటాడు, సుందర్రాజు. మమత తండ్రి మెడచుట్టూ చేతులేస్తుంది, తన బుగ్గని అతని బుగ్గకానిస్తూ. “మా అమ్మ, నాన్న, కీర్తన, అంతా తొందరపడి ఎందుకెళ్ళిపోయారమ్మా”, కన్నీళ్ళతో తన మమతల పంట మమత తలపై చేతులు వేసి సాలోచనగా అంటాడు సుందర్రాజు. కథ ముగుస్తుంది.

అప్పటివరకు గుండెల్లో సుడులు తిరుగుతున్న వేదన ఆఖరి వాక్యంతో ఎంత కఠిన మనసునైనా జలజలా కన్నీళ్ళు పెట్టిస్తుంది. నేనైతే రెండు మూడుసార్లు ఈ పరిస్థితికి లోనయ్యాను.

పాఠకుడు కథకుడితో మమేకమై, అతడి అనుభవాలలో తడిసి సహానుభూతి చెందాల్సిందే. కథ చదువుతున్నంత సేపూ అడుగడుగునా మన గుండె గొంతులో కొట్లాడుతూనే ఉంటుంది. సార్ద్రపూరితమైన వస్తువును సాంద్రతరమైన శిల్పంతో మేళవించి కథను అద్భుతంగా రక్తి కట్టించారు శ్యాంబాబు. ఇదే ఆయన మొదటి కథేమో కూడా. అయినా ఆయన కథనరీతికి ముంజేతి దర్పణంలా ఈ కథ ఒప్పారగలదని ఘంటాపథంగా చెప్పగలను. మంచి భావుకుడైనవాడు గాని రాయలేని కథతో సాహిత్యరంగంలో పదిలపడ్డారు ఇంజేటి శ్యాంబాబు.

(సర్కార్ ఎక్స్‌ప్రెస్, 20-07-2004, మంగళవారం)

కథకుడు : పి.వి. నరసింహారావు
కథ : గొల్ల రామవ్వ
ప్రచురణ : ఆదివారం వార్త,
2.1.2005

# తెలంగాణ యాసకు ఒరవడి పెట్టిన పి.వీ

"అవ్వా! అప్పుడిదేం చప్పుడే?"

"నీకెందుకు మొద్దు ముండా? గదేంది, గిదేంది– ఎప్పుడికి అడుగుడే! ఏదో మునిగిపోయి నట్టు!" అన్నీ నీకే కావాలె."

"... ... ..."

"ఏమనుకున్నావే మల్లీ! మా పాడుకాల మొచ్చిందే! ...మీరెట్ల బతుకుతరో ఏమో బిడ్డ! ఈ తురుకోల్లతోటి చావొచ్చింది... మొన్ననే నలుగుర్ని తుపాకినేసి చంపింద్రు. ఇప్పుడు గూడ ఏదో గపాంటి అగాయిత్యమే చేసిన్రేమో! ... ఏం పోగాలమో వీల్లకు! ..."

ఈ మాటలు ఏ సినిమాలోనో తెలంగాణ మాండలికంలోని సంభాషణలా అనిపిస్తున్నాయా?

గతవారం వార్త ఆదివారం అనుబంధం, (2–1–2005)లో పీ.వీ కథ 'గొల్ల రామవ్వ' వచ్చింది. ఏభై అయిదేళ్ళ క్రితం (1949) 'కాకతీయ' పత్రిక స్వాతంత్ర్య దిన సంచికలో అచ్చయిన ఆ

కథను చదువుతూ ఆనాటి తెలంగాణంలోని రాజకీయ సామాజికి నేపథ్యాన్ని ఆకళింపు చేసుకుంటూండగా, అనుకోకుండా దృష్టి కథలోని భాష మీదికి మళ్ళింది.

తెలంగాణ మాండలికాన్ని కథలో, కవిత్వంలో ఆ ప్రాంతపు కవులు, రచయితలు యథేచ్ఛగా వాడుతున్నారీనాడు. కానీ యాభై సంవత్సరాలకు పూర్వం పరిస్థితి వేరేగా ఉండేది. సాహిత్యంలో ప్రాంతీయ యాసను వాడాలంటే రచయితలు ఎంతో ఆలోచించేవారు. తెలంగాణా మాండలికం విషయానికొస్తే, 'ప్రజల మనిషి' నవలకు ముందుమాటను పరికించాలి. వట్టికోట ఆళ్వారుస్వామి 1952లో రాసి 1955లో ప్రచురించిన ప్రజల మనిషి నవలకు ముందుమాటలోని ముందరి వాక్యం – "ఈ నవలను భయంగానే బయటికి తెస్తున్నాను" అన్నది. ఆళ్వారుస్వామి భయానికి కారణం– అక్కడక్కడ సంభాషణల్లో తెలంగాణ భాషను రాయడం. ఇతివృత్తమూ, పాత్రలు తెలంగాణావి కావడం. అందువల్ల తన నవల పాఠకాదరణ పొందుతుందో లేదోనని ఆయన భయం. అలాగే, దాశరథి రంగాచార్యులు 'చిల్లర దేవుళ్ళు' నవలను రాసి 1964లో ప్రచురించడానికి ఎంతో తటపటాయించారు. చాలామందికి దాన్ని చదివి వినిపించి అభిప్రాయం తెలుసుకునేవారు. ఏ ప్రచురణకర్త ముందుకు రాలేదు. తర్వాత అయిదేళ్ళకి ఒక పత్రికలో ధారావాహికగా అచ్చై, తర్వాత పుస్తకరూపంలో వచ్చిందా నవల. తెలుగు నవల పుట్టి అప్పటికి ఎనిమిది దశాబ్దాలైనా, మాండలిక భాషను ఉపయోగించడానికి భయపడేవారు రచయితలు. స్వాతంత్ర్యానంతర కాలంలో కానీ మాండలిక ధోరణి బలపడలేదు. పోరంకి దక్షిణామూర్తి మూడు ప్రాంతాలకు చెందిన మాండలికాల్లోనూ మూడు నవలలు రాశారు. 'వెలుగు వెన్నెల' (గోదావరీ తీర మాండలికం), 'ముత్యాల పందిరి' (తెలంగాణ మాండలికం), 'రంగవల్లి (రాయలసీమ మాండలికం) నవలల్ని రాశారు. అదొక ప్రయోగంగా నిలిచింది.

అటువంటిది ఆ కాలంలోనే పి.వి. తన కథను మాండలికంలో రాయడం గొప్ప సాహసంగా చెప్పుకోవాలి. తెలంగాణ ప్రాంతం తొలితరం కథారచయిత అయిన పీ.వి. ఆ ప్రాంతీయ మాండలికాన్ని సాహిత్యంలో ప్రవేశపెట్టడానికి వెనుకాడలేదని 'గొల్ల రామవ్వ' కథ చదివితే తెలుస్తుంది. అయితే పి.వి. చేసిన మంచి పని ఏటంటే, సంభాషణలకు మాత్రమే తెలంగాణ మాండలికాన్ని, యాసను వాడి, మిగతా కథనం(తా) సామాన్య

శిష్ట వ్యావహారికంలో నడపడమే. దీనివల్ల కథను చదివే పాఠకుడే ప్రాంతం వాడైనా, విసువు చెందకుండా కథను ఆసాంతం చదివేలా తన రచనారీతిని మలచుకోగలిగారు పి.వి. ఈ రీతి రచన తర్వాత ఎందరికో మార్గదర్శక మైంది.

'చిల్లర దేవుళ్ళు'లో దాశరథి రంగాచార్య సంభాషణలను పాత్రోచిత తెలంగాణ భాషలో రాశారు. అదే ఒరవడిలో ఈమధ్య నవీన్ 'కాలరేఖలు' నవల కూడ తెలంగాణ మాండలిక సంభాషణలతోను, మిగతా కథనాన్ని వ్యావహారిక భాషలోను వెలువరించారు. ఈ విధంగా తెలుగు సాహిత్యంలో తెలంగాణ యాసకు ఒరవడి దిద్దిన సాహిత్యవేత్తగా పి.వి. నరసింహారావును చెప్పుకోవాలి. అలాగే నైజాం పోలీసుల తెలుగు, ఉర్దూ సమ్మిశ్రిత 'తౌశ్య తౌశ్య' భాషలోని మాండలికాన్ని సైతం ప్రతిభావంతంగా పట్టుకోగలిగారు పి.వి. "తల్పాకీ ఖోల్, తల్పా తీస్తాలేదూ, లే బిన్న! హరాం జాదీ! మాట్లాడొ? నాకీ తోక్కల్ తీస్తం లైర్! ఫౌరన్ తీ తల్పు! లేకుంటే తోడాయిస్తం సూడు"– ఇలా సాగుతుంది ఉర్దూ తెలుగుల మణిప్రవాళం.

కథలోకి వెళ్తే, స్థూలంగా విప్లవ భావాతిశయం గల ఇతివృత్తం 'గొల్ల రామవ్వ' కథ. ప్రాణాలను సైతం లెక్కచేయకుండా పోలీసులతో పోరాడిన ఒక గెరిల్లా వీరునికి గొల్లరామవ్వ తన ఇంట్లో రక్షణనిచ్చి పోలీసులకు చిక్కకుండా కాపాడ్డమే ఈ కథ సారాంశం.

ఇద్దరు పోలీసుల్ని చంపి, పరారీయై తనను తాను పోలీసుల కంట పడకుండా రక్షించుకోడానికి గొల్ల రామవ్వ ఇంట్లో ప్రవేశించిన కాంగ్రెస్ వాలంటీరుకు పూర్తి రక్షణ కల్పించడమే కాకుండా, నైతికబలం చేకూరే విధంగా అతని చర్యలను సమర్థించిన గొల్ల రామవ్వ – అతన్ని వెతుక్కుంటూ పోలీసులు వచ్చినప్పుడు, తన మాటలతో మాయచేసి, పోలీసుల్ని వెనక్కి మళ్ళిస్తుంది తెలివిగా. స్వాతంత్ర్యానంతర స్వేచ్ఛాభారతం లోనూ అస్వతంత్రమై దొంగల, రజాకార్ల, పోలీసుల దౌష్ట్యాలతో మగ్గిపోతున్న తెలంగాణను నైజాం దుష్టపాలన నుంచి విముక్తం చేసే ప్రజాపోరాటాన్ని చేపట్టిన యువకుడికి 'సాక్షాత్ భారతమాత'గా కనిపిస్తుంది, గొల్ల రావమ్మ.

గొల్ల రావమ్మ మాటల ప్రవాహం – అదీ, 'మహాప్రవాహం'వలె సాగిపోతున్న గొణుగుడు, సణుగుడులోనే చీవాట్లు, వినోదం; అందులోనే ఆజ్ఞలు – ముక్కు, మొగం తెలియని ఆగంతకుడి దగ్గర కూర్చుని అతని

శరీరంలో గుచ్చుకున్న జిట్టరేగు ముండ్లను తీయించి, గాయాలకు కాపు కాయించి, రౌతం మరకల్ని , మంటి ముద్దల్ని తుడిచి పారేసేలా చేస్తాయి పదిహేనేళ్ళ పడుచుపిల్ల, మనుమరాలు మల్లిచేత. ఆ ఆజ్ఞాధోరణే – పోలీసులొచ్చి దబదబ తలుపు బాదుతుంటే, ఆగంతక స్టేటు కాంగ్రెస్ వాలంటీరు యువకుణ్ణి, మల్లిని ఒకే మంచంపై, ఒకే దుప్పటి కింద భార్యా భర్తల్లా పరుండజేస్తాయి. మొత్తం కథ, కథలోని సన్నివేశాలు గొల్లరామి మాటల్లోనే అర్ధమవుతాయి. ఆమె సణుగుడు ప్రవాహమే కథలో గొప్ప మెలోడ్రామాను సృష్టించి ఉత్కంఠ కలిగిస్తుంది. ఆగంతకుని ప్రాణాలు కాపాడాలన్న ఒకే ఒక్క గొప్ప మానవత్వపు ధ్యాస కథనంలో పరిమళిస్తుంది.

అప్పటి తెలంగాణ ఉద్యమం సామాజిక చలనసూత్రాలను పట్టిస్తుంది గొల్లరావమ్మ కథ.

తెలంగాణా పోరాటం నేపథ్యంగా వచ్చిన సాహిత్యంలో సిద్ధాంతాలకు అనుగుణమైన ఇతివృత్తం, పాత్రచిత్రణ కనిపిస్తాయి. చాలా వరకు ఆ సాహిత్యాన్ని పార్టీతో ప్రత్యక్షంగానో, పరోక్షంగానో సంబంధమున్న వాళ్ళు రాశారు. పి.వి. కూడ అలాంటివారే అయినా, పార్టీ సిద్ధాంత రాద్ధాంతాల జోలికి పోకుండా, ప్రజల జీవనవిధానాన్ని, సాంఘికార్థిక మూలాలనుంచి వెలికి వచ్చినవారి వేదనల్ని ఈ కథలో చిత్రించారు. ఆ మేరకు అచ్చపు సాహిత్యకారునిగానే ఆయన ఈ కథను రాశారనిపిస్తుంది.

ఆగంతక యువకుడు, "నేను స్టేట్ కాంగ్రెస్ వాలంటియర్ని, నైజాం రాజుతోటి కాంగ్రెస్ పోరాడుతున్నది. ప్రజలు పోరాడుతున్నా"రని చెప్పినప్పుడు, యువకుడేదో 'రాజకీయ సిద్ధాంతబోధ' ప్రారంభిస్తాడా అనిపించిందని, రచయితగా పి.వి. తన అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తారు. అలా వ్యక్తం చెయ్యడం వెనుక, 'రాజకీయ సిద్ధాంతబోధ' చెయ్యడం సాహిత్య పరమార్థం కాదన్న విషయాన్ని విస్పష్టంగా చెప్పకనే చెప్పారు పి.వి. అందుకే, "మధ్యలోనే ముసలవ్వ అందుకున్నది..." అంటూ, తిరిగి కథలోకి పాఠకుణ్ణి వెంటనే నడిపిస్తారు పి.వి.

విశ్వనాథ వేయిపడగలను హిందీలోకి సహస్రఫణ్‌గా అనువదించారని అనుకోవడమే కాని, ఏభై సంవత్సరాల తర్వాత కూడ ఉత్కంఠభరితంగా చదివించగల శైలీశిల్పాలతో నేటి కథలకు తీసిపోని రీతిలో ఇంత మంచి కథలను పి.వి. రాశారని తెలీదు. వేయి పడగల అనువాదానికి కేంద్ర సాహిత్య అకాడెమీ అవార్డు అందుకున్న పి.వీ,

ఛందోబద్ధ కవిత్వమూ రాశారు. 'జయచంద్రా! హైందవ విధ్వంసకా!' అనే మకుటంతో విద్యార్థి దశలోనే ఎన్నో పద్యాలు రాశారు. 'ప్రేమ–ప్రణయం' పేర, ఊహాసుందరిని తలపోస్తూ భావకవితా ఖండకావ్య గానం చేశారు. హిందీ కవయిత్రి మహాదేవి వర్మ కవితలపై, ఛాయావాద తత్త్వంపై విశ్లేషణాత్మకమైన వ్యాసాలు రాశారు. అనేక హిందీ కృతుల్ని తెలుగులోకి అనువదించారు. 'మానావమానాలు' పేర ఒకటి, ఇటీవలనే 'ఇన్‌సైడర్' పేర ఆంగ్లంలో మరో ఆత్మకథనాత్మక నవల రాశారు. బెంగాల్ కరువును ప్రతిఫలిస్తూ, హిందూ–ముస్లిం మత కలహాలపైన (బ్లూ సిల్క్ శారీ) కథలు రాశారు. 'గేదరింగ్ పెటల్స్' పేర ఆంగ్ల కవితలెన్నో రాశారు.

రాజకీయాలలో సంశయాళువుగా పేరు తెచ్చుకున్న ఇన్‌సైడర్ పి.వీ పూర్తిగా సాహిత్యానికి పరిమితమై ఉంటే, గొప్ప కథకునిగా, రచయితగా ఉన్నతోన్నత శిఖరాలు అందుకునేవారే. అయితే, తెలుగు సాహిత్యాన్ని రెండుసార్లు జ్ఞానపీఠం ఎక్కించిన ఘనత పి.వి.కే దక్కుతుంది.

ప్రధానమంత్రిగా, ఆర్థిక సంస్కరణల సారథిగా మాత్రమే కాక, విలక్షణమైన సాహితీవేత్తగా, బహుభాషా కోవిదునిగా, పండితునిగా కూడా పి.వి. నరసింహారావు చరిత్రలో మిగిలిపోతారు.

(సర్కార్ ఎక్స్‌ప్రెస్, 11-01-2005, మంగళవారం)

కథకుడు : దాట్ల దేవదానం రాజు
కథ : నీలివల
ప్రచురణ : ప్రస్థానం

# ఆక్వా అధ్వాన వీరంగ వాస్తవికత – 'నీలివల'

కోస్తా ప్రాంతాల్లోని సారవంతమైన భూములన్నీ ఉప్పునీటి చెరువులుగా మారే సందర్భాన్ని చూసి చలించిపోయిన దాట్ల దేవదానం రాజు బడుగు రైతుల అశక్తతను గురించి లోగడ 'గుండె చెరువు'లయ్యే కథ రాశారు. తృప్తి తీరలేదాయనకు. ఆయన మనసును కలచివేసిన ఆ సందర్భాన్ని మరో ప్రత్యేక కోణంలో విస్తరింప జేసి 'నీలివల'గా పరచారిప్పుడు.

'మనిషి రోడ్డున పడ్డాడు' అనే సాదా వాక్యంతో మొదలైన కథ అసాధారణ రీతిలో సాగి పోతుంది. వాక్యం సాదాదే అయినా, ఆ వాక్యం తాలూకు విస్తృతార్థం కథ పొడుగునా కనిపిస్తుంది. సంపాదన కోసం ఎంత కష్టపడినా, కథ చివరికి కూడ ఆ మనిషి రోడ్డుమీదనే ఉంటాడు. ఆ మనిషి బంగార్రాజు.

చేస్తున్న ఫ్యాక్టరీ బంగారు కరచాలనంతో బంగార్రాజు రోడ్డున పడతాడు. జీవిక సాగడానికేం

చేయాలో తెలీక, ఊపిరందక గిలగిలా కొట్టుకుంటాడు, ఊపిరందని రొయ్యలా! అదిగో చివరికి ఆ ఆక్వారంగంలోకే దిగుతాడు. పేరుకు తగ్గట్టుగానే ఏదో చేసి ఎంతో సంపాదించేయాలనే యావ బాగా ఉన్నవాడు బంగార్రాజు. అయితే తెలివైనవాడు.

ముఖం పీక్కుపోయి, రంగు నల్లబడేలా రొయ్యల చెరువుతో కష్టపడతాడు. అయినా పడిన కష్టానికి తగ్గ ఫలితం రాదు. రోజురోజుకూ పడిపోతున్న ధరలతో మార్కెట్టును అందిపుచ్చుకున్నవాడే గొప్పవాడు కాగలడు. ధరలు చూస్తే దేశాలమధ్య సంబంధాలతో ముడిపడిపోతున్నయ్. ముఖ్యంగా అగ్రరాజ్యం ఉరిమినా, తుమ్మినా... ప్రకంపనలే! అలాంటి తరుణంలో అప్పులు తీరి మనిషిగా మిగలడమే గొప్పయింది.

ఆక్వారంగం ఒక వల. ఆ వలలో చిక్కుకోడానికి ఎన్నో ఎరలు. అలాంటి ఎర ఒకటి స్నేహితుల (?) ఆత్మీయమైన పిలుపు రూపంలో గోపీకృష్ణాబార్‌లో గోదారిలంక చెరువుల రూపంలో బంగార్రాజుకు గుచ్చుకుంటుంది. దాంతో ఉచ్చులో ఇంకా బిగుసుకుంటాడు. జీవితాన్ని ఒక గాడిలో పెట్టాలంటే మరోసారి అదృష్టాన్ని పరీక్షించుకోవాలి. తనకు వారసత్వపు వాటాగా రాబోయే ఎకరం పొలాన్ని బలవంతంగా తండ్రి దగగర్నుంచి లాక్కుని తెగనమ్మి ఆరెకరాల లంకభూమిని కిస్తుకు తీసుకుని మళ్ళీ ముఖం పీక్కుపోయేలా, రంగు నల్లబడేలా కష్టపడి – అన్నీ పోను అధమపక్షం నాలుగు ఎకరాలు మిగులుతాయనుకొంటుండగా, ఎక్స్‌పోర్టర్ మోసంతో మళ్ళీ రోడ్డుమీదనే మిగులుతాడు బంగార్రాజు.

గొప్ప ధైర్యవంతుడు బంగార్రాజు. పిరికితనం భరించలేడు. జీవితాన్నుంచి పారిపోలేదు. అతని జీవన సమరంలో అలుపుకు చోటు లేదు. తొడ కొట్టుకుంటూ పోడమే అతని స్వభావం. ఒరిస్సా సరిహద్దులో చెరువులు చవకగా దొరుకుతాయనే మరో ఎరకు చిక్కుకుంటాడు. చివరికి ఏమౌతాడో తెలీదు. కథ ముగుస్తుంది.

చెరువులోని చేపల్నీ రొయ్యల్నీ పట్టాలంటే వల విసరాలి. అలా రైతులకు వల విసరి, ఆకర్షించి పట్టేదే ఆక్వారంగం. దానిదో అధ్వాన వీరంగం. రైతు పెట్టుబడుల్ని భూమికిస్తు, సీడ్, ఫీడ్... టేస్టర్, ఎక్స్‌పోర్టర్ల రూపంలో మధ్య దళారీలు వివిధ దశల్లో, వివిధ స్థాయిల్లో కొల్లగొట్టే నీలివల ఆక్వారంగం. ఆ వలకి చిక్కిన రైతు గిలగిలా కొట్టుకుని బదుగై, గుడ్లు తేలేసి జీవచ్ఛవం కావాల్సిందే.

కథాసారాంశం ఎలాగున్నా, కథనరీతి వస్తువుకు గొప్ప విశిష్టతను చేకూర్చింది. ఒక సంఘటన నుంచి మరో సంఘటనకి, ఒక సందర్భం నుంచి మరో సందర్భానికి కథను పాత్రల సంభాషణలనుంచే అలవోకగా అల్లేసిన శిల్పం, కథ గమనానికి ప్రాణమై నిలుస్తుంది. దానికి తోడు ప్రాంతీయ వాస్తవికత కథాంశానికి నిజాయితీని జోడిస్తుంది. బంగార్రాజు నివాసం యానాం. రొయ్య చెరువుల పరిశీలనార్థం ఓ వారం రోజుల పాటు అతడు తిరిగింది తాళ్ళరేవు పరిసరాలు. మొదటిసారి భూమి కిస్తుకు తీసుకున్నది గాడిమొగ దగ్గర. రొయ్యపిల్లల్ని తెచ్చింది ఉప్పాడనుంచి. ఫీడు తెచ్చింది కోనపాకపేటనుంచి. ఈ విధంగా తూర్పుగోదావరి జిల్లాలోని ఆక్వారంగపు తీరుతెన్నులు ఈ కథలో వాస్తవ చిత్రీకరణతో సాగుతాయి.

కథనంలోని విశిష్టతను పట్టిచ్చే మరో వాస్తవికాంశం పరిభాష. సీడు, ఫీడు, కౌంటు, సేఫ్ లైన్, వెట్టింగ్ వంటి పారిభాషిక పదాలూ, ఆ తర్వాతనుండి పెరిగే ప్రతి గ్రాము లాభమే', 'రొయ్యల్ని చేటవేసి తూకాలు తూసి లెక్కలు కట్టాడు' వంటి వాక్యాలతో వస్తుగత వాతావరణం అడుగడుగునా అక్షరాక్షరంలోనూ ప్రతిఫలింపజేసి ఆ వాతావరణంలోకి పాఠకుణ్ణి చెయ్యిపట్టి లాక్కుపోతుంది భాష. ఒక్క మాటలో చెప్పాలంటే,.. ఆక్వారంగంలో మంచి అనుభవం ఉన్నట్టూ, ఆ రంగంలోని ఆటుపోట్లకు తట్టుకుని నిల్చిన విజేతలా కథను నడిపారు, దేవదానం రాజు. కథకుని వస్తు తాదాత్మ్యం ఎక్కడలేని వాస్తవికతనీ కథనానికి మప్పింది.

నానుడుల సందర్భోచిత ఉపయోగం ఒకవిధమైన నుడికారాన్ని, తెలుగుతనాన్ని సంతరించి పెట్టింది.

"...అన్నానికి అన్నం... సున్నానికి సున్నం? అనుకున్నంత కాసినా, రేటు తేడావల్ల అప్పులు తీరి మనిషి మిగిలాడు..."

"పిడుగులాంటి వార్త. ఊహించని మలుపు. కష్టార్జితాలు గాలివాటుకు కొట్టుకుపోవు అంటారు. అంతా అబద్ధమేనా?"

"చేతులు ముడుచుకుంటే నేల బావురుమంటుంది. రొయ్యలు విలాసంగా మీసాలు మెలేస్తున్నాయి...పారేసుకున్న చోటే వెతుక్కోవాలి"... ఈ విధంగా సాగిన కథనంతో ఆయా సామెతలు కథలోని భాగంగా అమరిపోవడం గమనిస్తే అబ్బురమనిపిస్తుంది. రొయ్యల సాగు తర్వాత మహర్దశ పట్టిన గోదావరి మధ్య మేట వేసిన లంక భూములు – ఒకనాడు "గోదారీత లంక మేత" నానుడిగా ఉండిన చందాన్ని వివరించిన తీరు

అద్భుతం. పశువుల పెంపకానికీ, అక్కడక్కడా వేరుశనగ పండించడానికి మాత్రమే ఉపయోగపడేవి ఆ భూములు. రోజూ నాటుపడవ ద్వారా లంకకు చేరాలి పశువుల్ని మేపడానికి. అందుకే 'గోదారీత...లంక మేత' అన్న నానుడి పుట్టుకొచ్చింది. దాన్ని అటుంచితే, 'రోజూ నాటుపడవ ద్వారా లంకలు చేరాలి' అన్న పశువుల మేత సందర్భాన్ని, లంక భూముల్లో రొయ్య చెరువులు సాగు చేస్తున్న బంగార్రాజుకు ఈ ప్రయాణం బలే పసందుగా వుంది" అంటూ కథనంలోని శిల్పపుష్టిని 'నీలివల' వేసి బాగా పట్టగలిగారు దేవదానంరాజు. పారిభాషికత, తెలుగు నుడికారంతో పాటు గోదావరి మండల పదపరీమళం మట్టి వాసనలా అక్కడక్కడ తగులుతుంది. ఉదాహరణకు 'మట్టి'ని 'బాడి' అనడం ఈ ప్రాంతం అలవాటు.

పాత్రల మానవ సహజ నైజం కథలో భాగంగా ఆవిష్కరించడం కూడా కథకు మంచి వాస్తవికతను తెచ్చిపెట్టింది. బంగార్రాజు దేనికోసం వచ్చాడో గ్రహించి కూడ లంకభూముల యజమాని రాముడు 'దేనికి?' అని అడగడం గొప్ప వ్యాపార నైజం. ముందుగానే బైట పడిపోడం బేరాలకు అనుకూలం కాదనే ఎరుకతో కూడిన డిప్లమసీ. అలాగే, ఎవడి దృష్టి ఎలాటిదో వాడికన్నీ అలాగే కనబడ్డం సహజం. లంకభూముల రొయ్య సేద్యం నిమిత్తం ఉభయసంధ్యల్లోనూ గోదారి మీద వెళ్ళి వచ్చే బంగార్రాజుకి కిరణాలు అలల మధ్య పసిడి నాణాల్ని మోసుకొస్తున్నట్లు అనిపిస్తుందనడం బంగార్రాజు మనస్తత్వానికి సరిపోయే చిత్రణ. అలాగే ఇతర పాత్రలు – బంగార్రాజు తల్లి, తండ్రి, భార్య, స్నేహితులు ఆయా సందర్భాల్లో మానవ నైజానికి అతి సన్నిహితంగా, సందర్భోచిత లౌక్యాలకు, లౌల్యాలకు ప్రతీకలుగా నిలుస్తాయి. అలాగే మానవ స్వభావానికి సంబంధించిన కొన్ని స్టేట్‌మెంట్లు సార్వత్రిక సత్యాల్లా భాసిస్తూ కథకుని అవగాహనను తెలుపుతాయి.

"...అసహనం అవధులు దాటినప్పుడే లోలోపలి స్వభావాలు బయటకు వస్తాయి..."

"గడ్డు సమయాల్లో మనసులలోని వెతుకులాట ఒక పట్టాన బయటపడదు. తిరిగి ఆశలు మొలకెత్తినప్పుడే బరువు తగ్గుతుంది"

"ఒక వలస మరో మెరుపు కోసమే" – ఇలాంటి వాక్యాలు చదువుతున్నప్పుడు కథకునిలోని కవి ముందుకు వచ్చి కనబడతాడు.

ప్రాంతీయ, భాషా, మాండలిక, వస్తు మనస్తత్వ వాస్తవికలతో

సమ్మిశ్రితమై, దాట్ల దేవదానంరాజు కథలు'లోకంటే (కొన్ని మినహా) చిక్కబడిన కథనశిల్పం 'నీలివల'లో చిక్కుకుని కనిపిస్తూ కథకుణ్ణి మరో మెట్టు ఎక్కిస్తుంది.

కాల్పనికత ఏ మాత్రమూ లేని సజీవ కఠోర వాస్తవికత దేవదానం రాజు కథనరీతికి పట్టుగొమ్మై ఆకర్షిస్తుంది. అందుకు ఆయనను అభినందించి తీరాలి.

(సర్కార్ ఎక్స్‌ప్రెస్, 25-01-2005, మంగళవారం)

---

... ప్రత్యేకించి ఒక కథమీద రాయాలనుకోవడం నాకెంతో ఆనందాన్నిచ్చింది. మీ విమర్శ గురించి చెప్పడానికేముంది?

**- దాట్ల దేవదానం రాజు, యానాం**

కథకులు : సి. సుజాత
డా॥ నాగినేని భాస్కరావు
కథలు : పులిరాజాకి ఎయిడ్స్ వస్తుందా?
వీడిన కొమ్మా! రావమ్మా!!
ప్రచురణ : ఆదివారం ఆంధ్రజ్యోతి
14.12.2003
ఆదివారం ప్రజాశక్తి
29.11.2004

# 'ఎయిడ్స్' కతలు రెండు

తెలుగు కథ వస్తు విస్తృతి బాగా పెరిగింది. ప్రేమ, విరహం, కామం, కోరికలనుంచి అనేకానేక సామాజిక రుగ్మతలపైకి దృష్టి ప్రసరిస్తోంది. వివిధ సామాజిక స్తరాల సాంస్కృతిక, ఆర్థిక నేపథ్యాలతోబాటు పర్యావరణ పరిశుభ్రత వంటి అంశాలపైనా చక్కని కథలు వస్తున్నాయి.

ప్రేమ, విరహం, కామం, కోరికలకు కొనసాగింపుగా వచ్చిన కొత్త వస్తువు అక్రమ కోరిక వల్ల కలిగే రుజాగ్రస్త మరణసదృశ పరిస్థితి. 1986లో మొదటిసారిగా చెన్నైలో డా॥ సునితి సాల్మన్, ఆమె శిష్యురాలు డా॥ సెల్లప్పన్ నిర్మల మొదటిసారిగా కొందరి వేశ్యల్లో హెచ్.ఐ.వి. వైరస్ కనుగొన్నప్పట్నించి మహమ్మారి వ్యాధి ఎయిడ్స్ మన అవగాహనకొచ్చింది. అప్పట్నించి ఎయిడ్స్ కూడ ఒక కొత్త కథావస్తువైంది.

ఎయిడ్స్ కథల్లో రెండు, నా దృష్టికి వచ్చినవి – సి. సుజాత రాసిన 'పులిరాజాకి ఎయిడ్స్ వస్తుందా?', డా॥ నాగినేని భాస్కరావు రాసిన

'వీడిన కొమ్మా!..రావమ్మా!' అనేవి. ఈ కథలు రెండూ నన్ను బాగా ఆకట్టుకున్నాయి.

మొదటి కథ ఆదివారం ఆంధ్రజ్యోతి (14 డిసెంబర్ 2003)లోను, రెండోది ఆదివారం ప్రజాశక్తి (29 నవంబర్ 2004)లోను వచ్చాయి. రెండు కథలూ డిసెంబర్ 1, ప్రపంచ ఎయిడ్స్ డే సందర్భంగా ఆయా సంవత్సరాల్లో ప్రచురింపబడినవే.

ఎయిడ్స్ వ్యాధిని వ్యాపింపజేసే పులిరాజు భాస్కర్, ఎయిడ్స్ వ్యాప్తిని నిరోధించే నడవడిక గల అపర ప్రవరాఖ్యుడు రమణారావు ఈ రెండు కథల్లోను నాయకులు. మొదటిది ఒక స్త్రీ రాసిన కథ. రెండోది ఒక పురుషుడు రాసిన కథ. అయినా రెండింటిలోను ఏకగ్రీవంగా ఆమోదింపబడిన విషయం మాత్రం ఎయిడ్స్ వ్యాధికి మగవాడి లైంగిక విశృంఖలత కారణమనే. అందువల్ల మగవాళ్ళు ఆ విషయాన్ని ఒక హెచ్చరికగా భావించి, తమ దాంపత్య జీవితాన్ని, లైంగిక సంబంధాన్ని క్రమబద్ధీకరించుకోవల్సిన అవసరాన్ని సూచిస్తున్నాయి ఈ రెండు కథలూ. ఎయిడ్స్‌కు సంబంధించిన మరే కథైనా ఈ విషయాన్నే ధృవీకరించి చెబుతుంది. కనుక నిజంగా ఇదొక 'నిజం'గా మనం అంగీకరించాల్సిందే.

తీపి మాటల వలలు, గోవా ట్రిప్పుల వంటి కలలూ పరచి రాగిణినో మరే సరాగిణినో బుట్టలో వేసుకునే పులిరాజు భాస్కర్‌కి ఇంట్లోని 'భాగ్యం' ఎంతమాత్రమూ అవసరం ఉండదు; రాదు. భార్య ఆడదని భాస్కర్ మరచిపోయి ఎంతో కాలమైంది. బంగారంలాంటి ఉద్యోగం మానేసి స్థలాలమ్మే సంబడానికి నీళ్ళులాగా ఖర్చు చేస్తూనే, వర్షంలా కురిపింపజేసుకుంటున్నాడు డబ్బు. ఎవరెవరో అమ్మాయిల్ని ఎక్కించుకుని కారులో ఊరేగుతుంటాడు. రియల్ ఎస్టేట్ బ్రోకరేజీల కోసం పార్టీలను పట్టాలి. అందుకోసం తాగిస్తాడు...తారుస్తాడు. బిజినెస్ ఎగ్జిక్యూటివ్‌లు, మార్కెటింగ్ మేనేజర్లు అంతా అమ్మాయిలే. పాపం అందర్నీ మాటల్తో పడగొట్టేస్తాడు. ఎవరికి వాళ్ళు భాస్కర్‌ని ఇంప్రెస్ చేశామనుకుని బుట్టలో పడిపోతారు. నశించిపోతారు.

నెలకో కొత్త ఫోను మారుస్తుంటాడు భాస్కర్. కొత్త నెంబర్, ఎవరికీ అందకుండా, మోసపోయిన పిచ్చి ముం... ఆఫీసుకు (భాస్కర్ రియల్ ఎస్టేట్ ఆఫీస్) ఆమడ దూరంలోనే ఆగిపోతుంది. ఏక్సెస్ దొరకదు. ఏ టైమైనా 'మీటింగ్‌లో ఉంటాడు బాస్'. అదే మీటింగో అందరికీ తెలిసిందే.

ఇదీ సుజాత కథలోని పులిరాజు భాస్కర్ దినచర్య.

రాత్రి రెండు గంటల తర్వాత బాగా తాగి, అలసిపోయిన మోముతో, నలిగిపోయిన బట్టలతో (ప్రతిరోజు) కారు దిగే "పులిరాజు'కి ఎయిడ్స్ వస్తుందా?" యాడ్‌వైపు చూస్తూ అనుకుంటుంది భాగ్య. "...వస్తుందా ఏమిటి? ... వచ్చి తీరుతుంది. ఈపాటికి వచ్చే ఉంటుం"దని తీర్మానించుకుంటుంది.

పులిరాజు తాగి ఆరోగ్యంగా ఉన్న అమ్మాయిల దగ్గరకు కండోమ్ తొడుక్కు పోయినా పరవాలేదు... భాస్కర్ లాంటి పులిరాజులకు రాగిణిలు దొరుకుతారు. పాపం ఇరవై ఏళ్ళది. చదువుకుని ఉద్యోగం చేసే చిన్నది. దానికి ఎయిడ్స్ ఎక్కడనుండి వస్తుంది? అసలు భయపడవలసిందే, అది. వాళ్ళు పొట్టకూటి కోసం ప్రతి వెధవ దగ్గర వొళ్ళు పరచే దిక్కుమాలిన ఆడవాళ్ళు. అచ్చం యాడ్‌లో కనిపించే మల్లెపూలు. మెరిసే చీర కట్టుకుని ఎవడేనా ఈ రాత్రికి కొనుక్కుని పది రూపాయలు ఇస్తాడేమోనని చూసే ఆడవాళ్ళు. వాళ్ళకు అంటించేదే పులిరాజాలు. భాస్కర్ వంటి పులిరాజాలకే ఎయిడ్స్. "డబ్బు మదంకొద్దీ తినీ, తాగి, ఆడపిల్లకు గాలం వేసి మోసం చేసే పులిరాజాలకే ఎయిడ్స్" అనే సందేశమిస్తుంది సుజాత కథ.

భాస్కర్‌కి పూర్తి భిన్న స్వభావం గలవాడు, 'వీడిన కొమ్మా ... రావమ్మా!' కథలోని రమణారావు. ఎప్పుడూ ప్రలోభపెట్టే కొలీగ్స్ మధ్యన ఉంటూ కూడ కడిగిన ముత్యంలా ఉంటాడు. "అరే భాయీ! ఛలో, ఛలో మజా కరేంగే" అనే ఖాదర్‌ని ఖాతరు చెయ్యడు. "బ్రదర్ ఇంట్లో కుదరక పోతే హొటల్లో టిఫిన్ చేస్తాం. భోజనం చేస్తాం. మిగతావీ అంతే"నంటూ, ఎప్పుడూ అమ్మాయిల గురించే చెప్పే శంకరం మాటలూ వినడు.

"స్వంత ఫ్లాటుకు సామానంతా పోగేసినాకే", తల్లిదండ్రులు తెచ్చిన ఎన్నో సంబంధాలను తిరస్కరించి, బీదింటి అమ్మాయి అణుకువగా ఉంటుందని ఏరి కోరి రమను చేసుకుంటాడు. కాని పరిస్థితి తారుమారు అవుతుంది. రమ వంట చేస్తుంది. ఇంటిని శుభ్రపరుస్తుంది. బట్టలుతుకుతుంది. అన్నం పెడుతుంది. కాని సంసారం చెయ్యదు. ఆరు నెలలైనా అదే తీరు. గట్టిగా అడిగితే ఏడుస్తుంది.

ఒకరోజు తాడో పేడో తేల్చుకోవాలని గట్టిగా నిలేసి అడిగితే, పెళ్ళి ముందు చెప్పలేదుకానీ, సంసారం తనకిష్టం లేదంటుంది. రమణారావుని విడాకులకు ప్రోత్సహిస్తుంది. రమణారావుకూ అదే సబబని

పిస్తుంది. పరస్పరం అంగీకారం కావడంతో త్వరలోనే విడాకులు మంజూరవుతాయి. ఆమెను పుట్టింటికి రైలు ఎక్కించి, ఇంటికొచ్చి చూస్తాడు. మంచం మీద దిండు కింద కవర్. చదివితే తెలుస్తుంది అసలు విషయం.

పెళ్ళికి ఆర్నెళ్ళ ముందు బలహీనంగా ఉన్న రమ ఒక ఆరెంపీ డాక్టర్ దగ్గర వైద్యం పొందుతూ ఒక ఎయిడ్స్ రోగి రక్తం తనకు తెలియకుండా ఎక్కించుకుంటుంది. ఫలితంగా ఎయిడ్స్ కారియర్ అవుతుంది. భర్తతో హైదరాబాద్ వచ్చాకా, అతనికి తెలీకుండా రక్తపరీక్ష చేయించుకుంటుంది. తను హెచ్.ఐ.వి. పాజిటివ్ అని తేలుతుంది. భర్తకి అన్యాయం చెయ్యలేక లోలోపల కుమిలిపోతూ, అతనంటే తనకు ఇష్టం లేదని, చిరాకు కల్పించి విడాకులు తీసుకుంటుంది.

అంతా తెలిసాకా, "పిచ్చిపిల్ల, దీనికి నేను భయపడతానని ఎలా అనుకుందో!"నని తలపోస్తూ "డాక్టర్ల సలహాతో తగు జాగ్రత్తలతో మరల ఆమెతోనే జీవితం'' అనుకుని తన భార్యను తెచ్చుకుందుకు బయలుదేరతాడు, రమణారావు. రమా, రమణారావుల జీవితం రమణీయం.

రెండు కథల్నీ తులనాత్మకంగా పరిశీలిస్తే ఒక విషయం అర్థమవుతుంది. దంపతుల్లో ఏ ఒక్కరికి ఎయిడ్స్ ఉన్నా, సంసారం నరకం కాక తప్పదు. ఏదో అభద్రత, న్యూనత వెంటాడుతూనే ఉంటుంది.

ఎయిడ్స్‌తో ముడిపడిన ముఖ్య సమస్య విడాకులు. విడాకుల గురించి కూడ ఈ రెండు కథలూ చర్చించాయి. నిజానికి అలా చర్చించక పోతే ఈ కథలు సమగ్రం అయ్యేవే కావు.

మొదటి కథలో భాగ్యకు "ఆ ఇంట్లోంచి బయటకు వచ్చెయి..." అని సలహా ఇస్తే, ఆమె అంటుంది, "...ఆ ఇల్లా ... అక్కడ నా కన్నపిల్లలు ఇద్దరున్నారు. మా అత్తగారు, మావయ్య, ఆడబిడ్డలు, వాళ్ళ పిల్లలు... నేను పెంచుకున్న పూలతోట... ఎలా వదిలేస్తాను... భాస్కర్ కోసం ఆ ఇంట్లో మనుష్యుల్నీ, ఇంటినీ ఎలా వదిలేస్తాను... మా అత్తగారికి కళ్ళు లేవు. నేనే ఆవిడకు ఆధారం..."

పెళ్ళైన తర్వాత, "నా భర్త... అత్తమామలు" అనుకునే ఈ సగటు భారతీయ స్త్రీత్వమే ఆమెచేత భాస్కర్‌కు విడాకులు ఇప్పించలేదు.

రెండో కథలో రమ విషయానికొస్తే, దాంపత్యానికెంత మాత్రమూ

పనికిరాననుకున్న తాను తన భర్త శాంతి సౌఖ్యాలకోసం, అతను మరో పెళ్ళి చేసుకునేందుకు ప్రోత్సహించడం కోసం సదరు సగటు భారతీయ స్త్రీత్వమే విడాకులు కోరుకుని ఆనందంగా స్వీకరిస్తుంది.

భారత స్త్రీ విడాకులు తనంత తానుగా కోరుకున్నా, వద్దనుకున్నా అది తన భర్తకోసం, అతని సౌఖ్యం కోసం మాత్రమే. మామూలు స్థితిలో ఆ ప్రసక్తే ఉండదు. భర్త చెడ్డవాడైనా, త్రాగుబోతైనా, తిరుగుబోతైనా సరే. భారత స్త్రీయొక్క ఈ భావనే ఇన్ని వందల ఏళ్ళుగా దాంపత్యాలను ఛిన్నాభిన్నం చేయకుండా నిలుపుకుంటూ వస్తోంది. అయితే ఇప్పుడు దీన్ని ఖండిస్తోంది స్త్రీవాదం. మగవాడి నిరంకుశత్వాన్ని త్రోసిరాజని బంధాన్ని తెంచుకుని వచ్చేయమంటోంది. అలా రాకూడదని నా భావం కాదుగాని, భారత స్త్రీ సంయమనం కోల్పోతే, “నీ పిల్లలు, నా పిల్లలు కలిసి మన పిల్లల్ని కొడుతున్నా”రనే మాట మన దేశంలోనూ వినాల్సి వస్తుంది. మగవాడు కూడ దాంపత్య మధురిమకు పరిమితం కావాలి. ఏ పిచ్చివేషాలూ వెయ్యకూడదు. సమాజాన్ని ఎయిడ్స్ రోగగ్రస్తం చెయ్యకూడదు.

ఈ రెండు కథల్లోను కథనబలం అంతగా లేకున్నా, బలమైన సందేశాలున్నాయి. తప్పని స్థితిలో వివాహేతర సంబంధానికి పాల్పడితే, ఆ సందర్భంలో “నీకు జబ్బులున్నాయా?” అని ఆడది మగాణ్ణి ప్రశ్నించి తెలుసుకోవాలంటుంది మొదటి కథ. “పోనీ జాగ్రత్త తీసుకుందామా” అని అడిగే కనీస చొరవైనా ఆమె చూపాలంటుంది.

అక్రమ వివాహేతర సంబంధాల పట్ల నిగ్రహం కలిగి ఉండాలన్నది ఆరోగ్యకరమైన సందేశం. తిరుగులేని ఈ సందేశాన్నిస్తుంది రెండో కథ. అంతే కాకుండా, ఏదో చిన్న క్లినిక్‌లో కాంపౌండరుగానో, ఆయాగానో పనిచేసిన అనుభవంతో ఆర్.ఎమ్.పి డాక్టరుగా అవతారమెత్తే క్వాక్స్‌కు దూరంగా ఉండాలని చెబుతుంది. పరీక్షించిన రక్తాన్ని, అన్ని విధాలా సురక్షితమైనదాన్ని మాత్రమే ఇతరులకు ఎక్కించాలన్నది అతి సామాన్యమైన సందేశమే అయినా, మహమ్మారి ఎయిడ్స్ త్వరితగతిని వ్యాపిస్తున్న ఈ సందర్భంలో అందరూ తెలుసుకోవలసిందీ, ఆచరించవలసిందీనూ.

అనురాగ దాంపత్యానికీ, ఆనందకరమైన జీవితానికీ కావలసింది లైంగిక స్వచ్ఛత...జీవన పవిత్రత. అవి ఉన్నవాడు రమణారావు. మగవాళ్ళందరికీ ఆదర్శప్రాయుడు కావాలి.

చేయని నేరానికి శిక్ష అనుభవించబోయిన నిర్దోషి, తన భార్య రమ హెచ్.ఐ.వి పాజిటివ్ అయినా, డాక్టర్ల సలహాతో, తగు జాగ్రత్తలతో ఆమెతోనే జీవనయానం సాగించాలనుకుంటాడు రమణారావు.

ఆ యానం...

క్రమశిక్షణ, మంచి ఆహారం అనే రైలు పట్టాలపై...

వైద్య సలహాలనే గ్రీన్ సిగ్నల్‌తో...

'ఎయిడ్స్‌కి దూరం... ఎయిడ్స్ రోగికి కాదు' అనే నినాదమే రైలు నడక శబ్దాల లయగా...

నవజీవన మాధుర్యంగా సాగుతుందని చక్కని సందేశమిస్తోంది రెండో కథ.

(సర్కార్ ఎక్స్‌ప్రెస్, 21-06-2005, మంగళవారం)

కథకుడు : మాకినీడి సూర్య భాస్కర్
కథ : హత్య చెయ్యనవసరంలేదు
ప్రచురణ : రమ్య భారతి త్రైమాసిక
నవంబర్ 2011–జనవరి 2012

# హత్య చెయ్యనవసరం లేదు

'ఎయిడ్స్ కతలు రెండు' వ్యాసాన్ని డిటిపి చేస్తుంటే, ఇప్పటికిప్పుడు ఎయిడ్స్‌పై వచ్చిన మరో కథను విశ్లేషించాలనిపిస్తోంది. బహుశా ముందు వ్యాసంలోని ముగింపులో ఇచ్చిన తులనాత్మక విశ్లేషణలోని అంశాలు కథకుడి ఆలోచనల్లో మాగి మాగి వెలువడిన కథనిపించింది. తాము చదివిన విషయాల ప్రభావం రచయితల మీద ఎలా ఉంటుందో ఈ కథ కొంతవరకు తెలుపుతుంది.

అంతేకాకుండా, ఏదైనా ఆలోచన మొదట్లో ఒక ముడిసరుకుగా ఉండవచ్చు. అదే ఆలోచన పదే పదే సాగినప్పుడు కొంచెం కొంచెంగా సంస్కరింప బడుతూ (రిఫైన్ అవుతూ) చివరికి అనుసరించ దగిన, ఆచరించదగిన ఒక సత్యంలా రూఢి అవుతుంది. సామాజిక చలనసూత్రాల్లో మార్పులు ఇటువంటి ఆలోచనాక్రమంలోంచే వస్తాయని పిస్తుంది. అలాంటి విషయమే ఇది. పెళ్ళికి ముందు

ఆడపిల్లలు కాబోయేవాడి ఆరోగ్య పరిస్థితి, ముఖ్యంగా హెచ్.ఐ.వి. పాజిటివ్/నెగెటివ్ విషయం తెలుసుకోవాలను కుంటున్నారు. మొదట్లో ఇది విడ్డూరమనిపించినా, ప్రస్తుతం అసహజం కాదనిపించే విషయమైంది. చట్టపరంగా కూడ ఇది తప్పనిసరి కాకపోయినా, వైయక్తికంగా ఇష్టమైతే, పెళ్ళికి ముందు ఎయిడ్స్ పరీక్షలు చేయించుకోడం మంచిదనే అభిప్రాయమే సర్వత్రా వినబడుతోంది. రేపో మాపో తప్పనిసరనే (మాండేటరీ) చట్టం రాకమానదు.

సాహిత్యం సమాజాన్ని ఏ విధంగా ప్రభావితం చేస్తుందో ఈ కథలు తెలియజేస్తాయి. అయితే సాహిత్యం సూచించే మార్పులు ఎక్కణ్ణుంచో రావు. సమాజంనుంచే వస్తాయి. సమాజాన్ని పరిశీలించి, రచయితలైనవారు దానికి ప్రత్యామ్నాయాలను కనుగొంటారు. వాటిని ఆ తర్వాత సామాజికులు అనుసరిస్తారు. ఈ విధంగా సమాజమూ సాహిత్యమూ పరస్పర ప్రభావకారకాలవుతాయి. ఇదే సాహిత్య ప్రయోజనం.

రమ్యభారతి నిర్వహించిన చతుర్ధ కథల పోటీలో ప్రథమస్థాయి సోమేపల్లి సాహితీపురస్కారం పొందిన కథ 'హత్య చెయ్యనవసరం లేదు'. కథకుడు మాకినీడి సూర్య భాస్కర్.

టూకీగా కథ – మనోహర్ చెడు తిరుగుళ్ళు తిరిగి ఎయిడ్స్ వ్యాధి పాలబడతాడు. మందులతోను, భార్య సపర్యతోను కోలుకుంటాడు. ఈలోపు మహమ్మారి భార్యకు సోకుతుంది. ఆడది కావడంవల్ల ఆమె వైద్యానికి ససేమిరా అంగీకరించదు. అత్తగారు కూడ ఆమెతోనే ఏకీభవిస్తుంది. ఫలితం, ఆమె అకాలంగా చనిపోతుంది.

మనోహర్‌ని చూడటానికి చిన్ననాటి ప్రాణ స్నేహితుడొస్తాడు. మళ్ళీ మనోహర్‌కి పెళ్ళి చేయాలనుకుంటున్నట్టు వింటాడు. ఒక హత్య ఇప్పటికే జరిగింది. మరొకటా! అంగీకరించలేకపోతాడు. "రెండో హత్య చెయ్యడానికి సిద్ధమైపోతున్నావు, నీ మనసెలా ఒప్పుకుంటోందిరా?" ప్రశ్నిస్తాడు. ఆ మాట విని మనోహర్ తల్లి గా నిష్ఠూరంగా అడుగుతుంది. తానూ ఇంకెంతో కాలం ఉండనని, ఆ తరువాత వాణ్ణి ఎవరు చూస్తారు బాబూ? అని ప్రశ్నిస్తుంది. తల్లి హృదయాన్నీ కాదనలేకపోతాడు. కానీ ఏదో చెప్పలేని బాధ మనసులో మెలిపెడుతుంది. అంతలో మంచి ఐడియా ఒకటొస్తుంది. మనోహర్‌కీ, అతని తల్లికీ విషయం చెప్పి, ఇద్దరి ఆమోదం పొందుతాడు.

తన ఆలోచన ప్రకారం, తన ఆఫీసులో రికార్డు అసిస్టెంట్‌గా పని చేస్తున్న అమ్మాయి తల్లిదండ్రుల్ని కలిసి, మనోహర్ గురించి చెబుతాడు. వారూ అంగీకరిస్తారు. లోగడ ఏదో జబ్బు చేసినప్పుడు రక్తం ఎక్కిస్తే, ఆమెకు అనుకోకుండా ఎయిడ్స్ వ్యాధి సోకుతుంది. ఆమెకీ పెళ్ళి కాదు.

ఉభయతారకంగా ఉన్న తన ఆలోచనను అమలుపరచి తృప్తి పడుతుండగా, మనోహర్ అంటాడు, “ఇక హత్య చెయ్యనవసరం లేదు కదా!” అని. “హత్య కాదు, హత్యలు” సవరిస్తాడు. ఎందుకంటే, పెళ్ళికి ముందు మనోహర్‌కి వాసెక్టమీ చేయిస్తాడు, ఎయిడ్స్ రోగంతో పిల్లలు పుట్టకూడదని. అదీ కథ.

ఎయిడ్స్ వంటి వ్యాధి ఆడవాళ్ళకు వస్తే కలిగే దారుణాన్ని ఈ కథలో చర్చించడమైంది. ముందే వస్తే, పెళ్ళి కాదు. తరువాత వస్తే, వైద్యం దొరకదు. తనకు తానుగా వైద్యానికి నిరాకరించడం మరీ దయనీయమైన పరిస్థితి.

ఎంత కాలం బతికితే అంతే కాలం బతుకుతారు. ఇద్దరు ఎయిడ్స్ రోగులను జత కలపడమే సరైన పరిష్కారంగా ఈ కథ సూచిస్తుంది.

ఇద్దరిలోనూ ముందుగా భార్య చనిపోతే, మళ్ళీ మగాడు వేరే ఎయిడ్స్ వ్యాధిగ్రస్తురాలను పెళ్ళి చేసుకోడానికి ఎటువంటి అనంగీకారమూ తెలుపకపోవచ్చు. కానీ అదే ముందుగా భర్త చనిపోతే, మళ్ళీ ఆడది వేరే ఎయిడ్స్ వ్యాధిగ్రస్తున్ని పెళ్ళి చేసుకోడానికి అంగీకరిస్తుందా?

ఏ విధంగానైనా ఎప్పుడూ ఆడదే శాపగ్రస్త!

కథకుడు : పద్మశ్రీ డా॥ కొలకలూరి ఇనాక్
కథ : రమ నా కూతురు
ప్రచురణ :

# మాతృస్వామ్యానికి ఇనాకుని కథా ఈనాము

'రమ తన కూతురు కాదం'టాడు రంగారావు. "నేను రసరాజ్యం కూతుర్ని" అంటుంది రమ. "రంగారావు నా భర్త', అంటుంది రసరాజ్యం – ఇదో ముక్కోణపు కేసు. సుప్రీం కోర్టులో వాదన కొస్తుంది. డా॥ కొలకలూరి ఇనాక్ కథ, 'రమ నా కూతురు', గొప్ప ఉత్కంఠతో నడుస్తుంది.

రసరాజ్యం ఎవరో తనకు తెలీదంటాడు రంగారావు. "అప్పటికీ, ఇప్పటికీ, ఎప్పటికీ రంగారావే నా భర్త" అంటుంది రసరాజ్యం.

"రసరాజ్యం తన భార్య కాదని, సంబంధం లేదని, అక్రమ సంబంధం కూడ లేదని, తన స్వచ్ఛతను, పవిత్రతను, పెద్దమనిషి పరువు ప్రతిష్ఠలను కాపాడా"లని కోర్టును ఆశ్రయిస్తాడు, రంగారావు.

"రమ నా కూతురు", ఒప్పుకుంటుంది రసరాజ్యం. "రమ నా కూతురు కాదు", తిరస్కరిస్తాడు రంగారావు. అయితే పూర్తిగా

రంగారావుని పోలి ఉండే రమ కనుముక్కు, ముఖం తీరు, అవయవ నిర్మాణం, తలకట్టు, పోలికలు, అచ్చు గుద్దినట్లుండే రంగు, రూపం – ఇద్దరినీ ఒక్కచోట చూస్తే ఎవ్వరైనా వాళ్ళు తండ్రీ కూతురు అనే అనకుంటారు. కాదంటే నమ్మరు. న్యాయమూర్తులు కూడ నమ్మే స్థితిలో ఉండరు (లేరు).

రమను అడిగితే, "నా తల్లి రసరాజ్యం అన్నది ఎంతైనా 'వాస్తవం" అంటుంది. తండ్రి రంగారావని తన తల్లి రసరాజ్యం చెప్పింది కనుక, తన తండ్రి రంగారావన్నది 'విశ్వాసం" అని కోర్టుకు విన్నవించుకుంటుంది.

ఇవీ కేసు పూర్వాపరాలు. ముద్దాయిలు ముమ్మరి వాదనలకీ ఆధార భూతమైన ముక్కోణపు వివాదం.

ప్రతి కేసుకూ సాంఘిక, ఆర్థిక కారణాలుంటాయి. ఈ కేసుకు బలమైన సాంంఘిక కారణం, రంగారావు క్షత్రియుడైతే రసరాజ్యం మాదిగ కులానికి చెందిన యువతి. ఎస్.సి.

అయితే చిత్రం, ఈ కేసును కోర్టులో ముగ్గురూ దాఖలు చేయలేదు. కానీ అనుకోని పరిస్థితుల్లో చిత్రంగా ఈ కేసు కోర్టుకు వస్తుంది.

స్వతంత్ర భారతదేశంలో పుట్టిన స్వేచ్ఛాజీవి రమ, 'ఎస్.సి, మాదిగ' అయినప్పటికీ (తల్లి రసరాజ్యం స్కూల్లో అలాగే నమోదు చేయిస్తుంది) ఏ విధమైన రిజర్వేషన్ రాయితీలు పొందకుండానే స్కూలు, కళాశాల, యూనివర్సిటీ ఫీజులు కట్టి (ఆర్థికంగా మంచి స్థితిలోనే ఉన్న కారణంగా) స్వశక్తితో, చాకచక్యంతో చదువుకుని ఆంధ్ర విశ్వవిద్యాలయంలో లా విభాగంలో లెక్చరర్‌గా చేరుతుంది. తర్వాత రీడర్, ప్రొఫెసర్ అవుతుంది. మంచి ఉపన్యాసకురాలిగా, విశేష అధ్యయనశీలిగా, మేధావిగా రాజ్యాంగ నిష్ణాతగా ప్రపంచ ఖ్యాతి పొందుతుంది. దాంతో ఒక రాజకీయ పక్షం ఆమెను ఎన్నికల్లో పోటీ చేయమని బలవంతం చేస్తుంది. ఆమె తిరస్కరిస్తే, ఇంటా బయటా ఒత్తిడి పెరుగుతుంది. రాజ్యాంగం బోధించే మనిషి, దాని పనితీరు పరికించటానికి ప్రయత్నించడం తప్పు కాదంటే, సరేనని ఎస్.సి రిజర్వ్‌డ్ నియోజకవర్గం నుంచి పెద్ద మెజారిటీతో గెలుస్తుంది.

"ఆమె ఎస్.సి. కాదని, దొంగ సర్టిఫికెట్టుతో పోటీ చేసి గెలిచి, తన గెలుపునకు గండి కొట్టిందని, ఆమె గెలుపు చెల్లదని, తన గెలుపును ప్రకటించాలనీ" కోర్టును ఆశ్రయిస్తూ, పార్లమెంటరీ నియోజకవర్గం ఎన్నికల్లో ఓడిపోయిన సమీప ప్రత్యర్థి కేసు వేయడంతో – ఈ ముక్కోణపు వాదవివాదాలు కోర్టులో చెలరేగాయి.

ఇనాకుని కథాంశమిది. ఈ నేపథ్యంతో సాంఘికంగా భిన్న అంతస్తులకు చెందినా, ఆర్థికంగా, హోదాపరంగా అభిన్నమైన రమ, రంగారావుల జాత్యాభిజాత్యాల వాదవివాదాలతో హిందూ సమాజంలో తరతరాలుగా పాతుకుపోయిన కులం గురించి, దాని ప్రభావం గురించి వివిధ కోణాలలో రసవత్తరమైన కథనచర్చ కొనసాగించారు, ఇనాక్. ఆయన కథన విధానం చాలా ఆశ్చర్యపరుస్తుంది. కోర్టులు, జ్యుడిషియరీకి సంబంధించిన అపార పరిజ్ఞానం లేకపోతే ఈ కథను ఇంత చక్కగా రక్తి కట్టేలా రాయడం కుదరదు. 'కమిటెడ్ జ్యూరిష్టు'గా తనను తాను నిరూపించుకున్నారు ఇనాక్.

ఈ కథలో వర్ణ వ్యవస్థనీ, దానిలోని అసంగత్వాన్ని, పితృస్వామ్య వ్యవస్థనీ, దాని పాశవికతనీ తూర్పారబడుతూ మాతృస్వామ్యానికి పట్టం కట్టారు ఇనాక్. అందుకే, "రమ నా కూతురు కాదు" అన్న రంగారావు స్టేట్‌మెంటును కాక, "రమ నా కూతురు" అన్న రసరాజ్యం స్టేట్‌మెంటునే కథకు శీర్షికగా ఉంచారు. అలాగే క్షేత్ర బీజాల ప్రాధాన్యతను కూడా ఈ కథలో చర్చించారు. సంతానపరంగా ఆలోచించినప్పుడు తల్లిదండ్రులేమిటో తర్కబద్ధంగా చర్చించారు. వెరసి, కులపరంగా తలెత్తే సమస్యలను సామాజిక రాజకీయార్థిక కోణాల్లో అత్యద్భుతంగా విశ్లేషించారు ఇనాక్.

కథలో రెండు కేసుల్ని ప్రవేశపెట్టారు. తన తల్లి రసరాజ్యమని, ఆమె ఎస్.సి కనుక తాను కూడా ఎస్.సి కి చెందుతానన్నది రమ వాదనైతే, రమ తన కూతురు కాదని రంగారావు వాదన. ఈ రెండు కేసుల్నీ కలిపి కోర్టు తీర్పు రూపంలో ఇనాక్ తన న్యాయాన్ని చెప్పారు.

తండ్రి కులమే కూతురి కులమవుతుందని కోర్టు అంటే, "భార్యనో, ఉంపుడుగత్తెనో, కడుపు చేసి వదిలేసి పోయి, పుట్టిన బిడ్డని చూడని పెంచని పోషించని పెళ్ళి చేయని కట్నకానుకలివ్వని మనిషెవరో తెలియనివాడు కూడా తండ్రేనా?", ఘాటుగా ప్రశ్నిస్తుంది రమ.

అలాగే, రంగారావు రసరాజ్యం భర్త కాదని డి.ఎన్.ఏ టెస్ట్ రిపోర్టులతో కోర్టు నమ్మబలికితే, "ఇంత దేశం, ఇన్ని కోర్టులు, ఇందరు మేధావులు, ఇంత న్యాయం, ఇంత నీతి, ధర్మం, ప్రేమ, అనురాగం, ఆదరణ, ఆత్మీయత, అర్పణ, సమర్పణ, మైత్రి, సహజీవనం, సౌభాగ్యం, సౌశీల్యం, త్యాగం, నిరీక్షణ, కాలిపోతున్న గుండె, మసిగా నుసిగా దహించుకు పోయిన దేహం, దాన్ని పట్టుకుని ప్రాకులాడిన గుండె–

కొట్టుకోలేక తల గోడకేసి కొట్టుకున్న గుండె – గుండె – గుండె ఉన్న దేశం – నా భర్తను నా భర్తని చెప్పలేక, ఒప్పుకోలేక, అంగీకరించలేక, ప్రకటించలేకపోడం సిగ్గుచేటు. ఇంతకంటే దారిద్ర్యం, దౌర్భాగ్యం, దౌష్ట్యం ఏముంటాయి? ఎందుకుంటాయి? ఎక్కడుంటాయి? – ఆక్రోశిస్తుంది రసరాజ్యం.

రమ ప్రశ్నగానీ, రసరాజ్యం ఆక్రోశం గానీ కోర్టుకు పట్టవు.

తల్లి చెబితేనే బిడ్డకి తండ్రెవరో తెలుస్తుంది. ఆఖరికి సమాజానికి కూడా. అందుకే 'తల్లి వాస్తవం' అనీ, 'తండ్రి విశ్వాసం' అనీ ప్రతిపాదిస్తూ, "భారతదేశంలో ఇంతదాకా పుట్టి పెరిగి పాలించి గతించి పాలింపబడి అంతరించిపోయిన అన్ని సంస్కృతుల నాగరికతల వ్యవస్థల వ్యక్తుల్ని కన్న తల్లులు నాకు తెలుసు. తండ్రులు నాకు తెలీదు. ఆ తల్లులు వాస్తవం, "వీడు నీ తండ్రి అంటే సంతానం విశ్వసించింది. సమాజం విశ్వసించింది. సంస్కృతి విశ్వసించింది. అందుకే–

"తల్లి వాస్తవం – తండ్రి విశ్వాసం

తల్లి స్పష్టం – తండ్రి అస్పష్టం

తల్లి ప్రత్యక్షం – తండ్రి పరోక్షం

తల్లి ముఖ్యం – తండ్రి అముఖ్యం

తల్లి నిజం – తండ్రి కల్పన... బిడ్డ అస్తిత్వం వాస్తవం మీద ఆధారపడి ఉండాలి. కల్పనమీద కాదు, నమ్మకం మీద కాదు" అని రమ వాదిస్తే దాన్ని 'అరాచకవాదం' అంది కోర్టు.

కళ్ళు కానని అంధయుగంలో దిక్కుమాలిన పెళ్ళి పేరంటం లేని పిచ్చి సన్నాసులు బీజప్రాధాన్యం చెప్పినంత మాత్రాన, క్షేత్ర ప్రాధాన్యం గాలికి కొట్టుకుపోతుందా? ఒకనాడెప్పుడో, ఎవరికో, ఎందుకో ఉద్దేశించిన తండ్రి ముఖ్యమనే ముక్క నేడు కూడా పట్టుకు వేలాడే కోర్టుకు సాంఘిక న్యాయం తెలుసా? మానవ ప్రాధాన్యం తెలుసా? సమాజ స్థితీ గతీ అర్థమవుతున్నాయా? – ఈ ప్రశ్నలన్నిటినీ రమతో కోర్టును అడిగించారు ఇనాక్. రమ తర్కబద్ధమైన వాదం కోర్టునే పప్పులో కాదు, తప్పులో కాలు వేయిస్తుంది. స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యం ఉండకూడదనీ, స్త్రీకి కట్నకానుకలు ఇవ్వచ్చుననీ సాక్షాత్తు కోర్టే అంటే, పాఠకుడిగా విస్తుబోడం మన వంతు అవుతుంది.

ఆర్థికంగా స్వేచ్ఛ లేకున్నా... అందం, అంతస్తు లేకున్నా

అహంకారంతో సంతానానికి తన కులాన్నీ గోత్రాన్నీ వంశాన్నీ మతాన్నీ మగాడు వారసత్వంగా ఇవ్వలేని పరిస్థితిని ప్రశ్నిస్తుందీ కథ.

"పోషించగల మగవాడు పదిమంది ఆడవాళ్లను ఉంచుకున్నట్టే, పోషించగల స్త్రీ అనేకుల్ని మగవాళ్ళను ఉంచుకున్నప్పుడు, "ఊరు పేరు లేని ఆ ఉంపుడుగాళ్ళలో ఎవడు ఏ బిడ్డకు తండ్రో ఎలా తెలుస్తుం"దంటూ, స్త్రీ పక్షం చేరి ప్రశ్నిస్తారు ఇనాక్.

సమాజం ఎప్పుడూ మారుతూ ఉండేది కాబట్టే, మారే సమాజానికి తగినట్లుగా న్యాయం, ధర్మం, శాసనాలు మారాలని, అలా మారకుండా ఉంటే ప్రాచీన సమాజ ప్రతినిధులుగానే మిగిలిపోతామని, అభివృద్ధి చెందిన ఆదర్శ మానవులం కాలేమని ఈ కథలో హెచ్చరించారు ఇనాక్.

నిజమేమిటో తెలిసీ, న్యాయం చెప్పలేని పరిస్థితి కోర్టుది. దానికి అంత:సాక్ష్యం అవసరం లేదు. బాహ్యానికి కనబడేదో వినబడేదో సాక్ష్యం రూపంలో కావాలి. ఏది న్యాయమో, ఏది అన్యాయమో కోర్టు అంతరంగానికీ అర్థమవుతుంది. కానీ తీర్పు ఇవ్వలేని గుడ్డిది కోర్టు.

కోర్టు ఇచ్చే అసంబద్ధ తీర్పుల్ని చూడలేకే కళ్ళకు గంతలు కట్టుకుంది న్యాయ దేవత!

(సర్కార్ ఎక్స్‌ప్రెస్, 23-08-2005, మంగళవారం)

కథకులు : కాశీభట్ల వేణుగోపాల్
కర్ణా వేంకట రామారావు
కథలు : బృంద
చిన్ని మువ్వలు
ప్రచురణ : ఆదివారం వార్త, 25.9.2005
ఆంధ్రప్రదేశ్, అక్టోబర్, 2005

# ఒకే సందర్భం, భిన్న సంఘటనలు – అభిన్న పరిష్కారం

కాశీభట్ల వేణుగోపాల్ కథ 'బృంద' (ఆదివారం వార్త 19,25 సెప్టెంబర్ 2005), కర్ణా వేంకట రామారావు కథ 'చిన్ని మువ్వలు' (ఆంధ్ర ప్రదేశ్, అక్టోబర్ 2005)–రెండూ ఒకే సందర్భం నేపథ్యంగా వచ్చిన కథలు. భిన్న సంఘటనలతో నడచి, చివరికి అభిన్న పరిష్కారంతో పూర్తయ్యాయి.

ఒకే సందర్భంలో మనుషులు వాళ్ళ వాళ్ళ స్థాయినిబట్టి, సంస్కారాన్ని బట్టి ఎలా ప్రవర్తిస్తారో విడమరచి చెప్పిన కథలు ఈ రెండూ. అందుకే తులనాత్మకంగా అధ్యయనం చెయ్యాలనిపించింది. ఆ ప్రయత్నమే ఈ వ్యాసం.

కాశీభట్ల కథలో 'బృంద' పన్నెండేళ్ళ మొరాన్. మూడో ఏడు తర్వాత ఎన్‌సెఫలైటిస్ సోకి మృత్యుముఖంలోకి వెళ్ళి, రెండోసారి జన్మించిన అమ్మాయి. వచ్చిన మాటనీ, నడకనీ కోల్పోయి మళ్ళీ అతికష్టం మీద పద్దెనిమిది నెలల తర్వాత

వాటిని సాధించుకున్నా, "పన్నెండేళ్ళొచ్చినా ఇంకా అయిదేళ్ళ పాపే బృంద".

రామారావు కథలో 'గౌరి' ఈడొచ్చిన పిల్ల. తిండికి, బట్టకి, గోరెదు బంగారానికి, అన్నిటికీ మూలమైన డబ్బుకి కరువుతో, అందమైన బట్టలు వస్తువులు వేసుకోవాలనే తీరని కోరికతో అలమటించే అమ్మాయి.

బృంద, తబుస్సుం అక్కాచెల్లెళ్ళు. పాతికేళ్ళు పైబడ్డాకా రెండో పెళ్ళివాడికివ్వబడ్డ పెద్దదీ, గౌరి అక్కచెల్లెళ్ళు. అక్క చెల్లెలిద్దర్లోనూ బృంద పెద్దదైతే, గౌరి చిన్నది. పెద్దదైనా బృంద పన్నెండేళ్ళమ్మాయి, గౌరి ఈడొచ్చిన పిల్ల. వీరిద్దరి కథలూ బృంద, చిన్ని మువ్వలు.

బృంద, గౌరి – ఇద్దరూ తండ్రిని కోల్పోయిన పిల్లలే. తల్లిచాటు పెరుగుతున్నవారు. బృంద తల్లి 'మా' (పేరు కథలో లేదు, తల్లిని బృంద పిలిచే 'మా'తోనే వ్యవహరిద్దాం), గౌరి తల్లి సీతాలు. మా గ్రాడ్యుయేట్ కావడంతో 'కాంపన్సేటరీ గ్రౌండ్స్' కింద భర్త పని చేసిన ఫ్యాక్టరీలోనే చిన్నపాటి ఉద్యోగంతో కుటుంబాన్ని పోషిస్తూంటుంది. ఉన్న కాస్త భూమితో (కొండ్రా) నేలతల్లిని నమ్ముకుని బ్రతుకును వెళ్ళదీస్తున్న దీనురాలు సీతాలు.

సందర్భం ఒకటే కావడంతో కథలు రెండూ ఒకేలా ప్రారంభమౌతాయి. గోడకు వేలాడ్తోన్న ఫయ్యూం (భర్త) ఫొటోతో సంభాషిస్తూ, "...ఎందుకెళ్ళిపోయావ్ ఫయ్యూ... నన్నొంటర్ని చేసి... ఎట్లా లాగనీ జీవితాన్ని?" అని స్వగతిస్తుంది మా. అలాగే సీతాలు కూడా భర్త నర్సింహులు ఫొటోకేసి చూస్తూ, "కడుపున పుట్టిన బిడ్డలిద్దర్నీ నాకప్పగించి పోయావు. ఇన్నాళ్ళూ ఒంటరిగా ఎలాగో ఈ సంసారాన్నీడ్చుకొచ్చాను. ఇక నావల్ల కాదయ్యా!" అంటుంది. భర్తలిద్దరూ వాళ్ళకి జీవితంలో మిగిల్చి పోయిన ఒంటరి పోరును గురించి దు:ఖిస్తూ, బతుకు భారంగా సాగిస్తూన్న అభాగినులు మా, సీతాలులు. చదువుకున్నా, చదువుకోకపోయినా, ఒకే విధమైన సందర్భంలో మనిషి స్పందన ఒకే విధంగా ఉంటుందన్న విషయం ఈ కథల్లోని కొన్ని సంఘటనలతో రుజువౌతుంది. ఫొటోల్లోని భర్తలతో స్వీట్ నథింగ్స్ పంచుకుంటారిద్దరూ. 'కళావతి' వాయిస్తూ వాయిస్తూ చటుక్కున ఆపేసి మోగిస్తున్న వేణువును ఎగరేసి పట్టుకుంటూ, " ఈ రాతి బల్లను మనకోసం ప్రకృతి ఎన్ని కోట్ల సంవత్సరాలు కష్టపడి చేసిందో కదా!..." అనే భర్త ఫయ్యూం ఉద్విగ్నపు వెచ్చదనాన్ని మా గుర్తు చేసుకుంటే, 'పెళ్ళైన కొత్తల్లో తాగొచ్చిన భర్తతో, ""ఇలాగైతే నేను పుట్టింటికెళ్ళిపోతా"నని బెదిరించే సీతాలుతో, "ఒసే! సీతాలూ! ఏడమాకే" అనే భర్త మాటల్ని పదే

పదే గుర్తు చేసుకుంటూంటుంది సీతాలు.

అభాగినుల నిస్సహాయత ఒకేలా ప్రతిఫలిస్తుందన్న విషయాన్ని కూడా ఈ రెండు కథలూ ప్రతిపాదిస్తాయి. ఒకసారి బృంద గురించి మాట్లాడాలని స్కూలు కరెస్పాండెంటు కబురంపితే వెళ్తుంది మా. ఆమెతో మాట్లాడుతుండగా 'బైటినించీ గట్టిగా బృంద ఏడుపు వినిపిస్తుంది. వరండాలో క్రోటన్ పువ్వులు రేకులు రేకులుగా తెంపబడి వెదజల్లబడి ఉంటాయి. ఓ టీచరు చీరకంటిన బుదదని కడుక్కుంటూ ఉంటుంది. స్తంభానికానుకుని కూచుని బృంద ఏడుస్తూ ఉంటుంది. ఆ దృశ్యం చూస్తూనే అర్ధమవుతుంది, బృంద పువ్వుల్ని తెంపితే టీచర్ కొట్టిందని. బృంద దగ్గరకెళ్ళి చెయ్యి పట్టి ఈడుస్తూ 'లే' అని అరుస్తుంది మా. "నేనేం కాదు మా... నేను కాదు మా" అని బృంద ఎంత ఏడ్చి మొత్తుకున్నా విన్పించుకోకుండా, విచక్షణ కోల్పోయి నిస్సహాయంగా బృందని వంగదీసి దబదబా వీపుమీద చరుస్తుంది, 'లే యూస్‌లెస్ గాళ్ లే' అని అరుస్తూ మా.

అలాగే, "అక్కడంతా అందంగా బట్టలు, వస్తువులు వేసుకొస్తారు. కానీ అందరిలో నేనే ఇలా దరిద్రంగా వెళ్ళాలి" అని విసుక్కుంటున్న గౌరితో ఏదో సర్ది సీతాలు చెప్పబోతున్నా, "ఛీ... ఫో అమ్మా... కాళ్ళకు పట్టీలైనా లేకుండా నేనా పేరంటానికెళ్ళను" అని ఖరాఖండిగా చెప్పేసి, రోడ్డెక్కి , "ఎందుకొచ్చిన బతుకులమ్మా. తిండికి కరువు. బట్టకి కరువు. గోరెడు బంగారానికి కరువు. అన్నిటికీ మూలం ఆ డబ్బుకి కరువు. ఈ కరువుతో బతకడంకంటె చావడం నయం. ఈ అన్నిటికీ తోడు అప్పులోళ్ళ బెదిరింపులు, ఆకలి చూపులు" అంటూ ఆవేశంగా ఊగిపోతున్న గౌరితో, "ఒసే, నీకేవన్నా పిచ్చెక్కిందా ... వీధి ఎక్కి అరుస్తున్నావ్? రా, లోపలికి" అంటూ చేయిపట్టి ఇంట్లోకి లాక్కొచ్చి నిస్సహాయంగా గౌరి రెండు చెంపలూ వాయిస్తుంది సీతాలు.

ఈ సంఘటనల తరువాత తల్లులిద్దరూ నిష్కారణంగా కూతుళ్ళను కొట్టినందుకు కుమిలిపోతారు.

తరువాతనుంచీ గమనాన్ని బట్టి కథల్లో భిన్న సంఘటనలు చోటు చేసుకుంటాయి. కాస్త పెద్ద కాన్వాసు తీసుకోడంవల్ల (రెండు వారాలు వరుసగా అచ్చయిన కథ బృంద), కాశీభట్ల విభిన్న సంఘటనలను కల్పించి వాస్తవ జీవితానికి చిత్రిక పట్టారు. రిటైరైన పొరుగింటి హెడ్మాష్టరు ముసుగులో అమాయకపు బృందపై దాడి చేయబోయిన మగ మృగపు

మద తృష్ణ... తీసుకుపొమ్మన్న స్కూలులోనే బృందను ఉంచుకునేలా చేసేందుకు, "మనం మన జీవితాల్లో చాలా చాలా పన్లు మనకిష్టం లేకపోయినా, మనం యిష్టపడేవాళ్ళ కోసం, మనం ప్రేమించేవాళ్ళ కోసం చేయక తప్ప"దని భావించి, ఇష్టం లేకపోయినా కొలీగ్ ప్రభాకర్ గాడితో పళ్ళికిలిస్తూ మాట్లాడి, తాను వేసుకున్న బట్టలగురించి వాడి కామెంట్ విని లోపల విసుక్కుంటూనే పైకి థాంక్స్ చెప్పి ఎలాగో గుట్టుగా తన పనిని నిర్వర్తించుకోడం... ఎదురింటిని కొని బాగు చేయించుకుని దిగిన రచయిత విశ్వనాథ్ స్నేహ హస్తంలో బృందని ఏ సంకోచమూ లేకుండా వదలడం వంటి సంఘటనలు సహజ వాస్తవికంగా సాగుతాయి. తన నడుం కింది భాగాన్ని కసిగా చూస్తున్న ప్రభాకర్‌గాడిని గమనించి, "ఆఖరికీ జనం ఆడతనాన్ని యావత్తూ ఓ బెత్తెడు శరీర భాగానికి కుదించేసారు... ఛ్ఛ" అనుకునేంత నగ్న వాస్తవికతతో సంఘటనల క్రమాన్ని నడిపిస్తూ కథనాన్ని రక్తి కట్టించారు కాశీభట్ల.

రచయితలిద్దరూ వారి పరిశీలనలను పోటీపడి మరీ చిత్రించారు. ఆత్మహత్య చేసుకోవాలని నిర్ణయించుకుని పురుగుల మందును తాగబోతూ, "వద్దమ్మా వద్దు. మువ్వల పట్టీల కోసం పేచీ పెట్టనమ్మా..." అని నిద్దట్లో కలవరిస్తున్న కూతురు గౌరి పక్కన కూచుని ఒక్కసారి ఆర్తితో ముంగురులు సవరిస్తుంది సీతాలు. గౌరి తన కాళ్ళను సీతాలు పొట్టపైన వేసుకుని వెచ్చగా పడుకుంటుంది. "ఇది చిన్నప్పట్నించీ ఇంతే!" అనుకుంటూ, నెమ్మదిగా వాటిని తొలగించబోతుంటే... తల్లి మెడ చుట్టూ చేతులు పోనిచ్చి లుంగచుట్టుకు పడుకుంటుంది గౌరి. ఈ పాశమే కదా మనుషుల్ని కట్టి పడేసేది అనుకోకుండా ఉండలేం.

ఏదో పీడకలొచ్చి అర్ధరాత్రి అర్ధంతరంగా మెలకువ వచ్చేసరికి, "మీదనున్న బృంద కాలు పక్కకు తొలగించి మంచం దిగి ఓ రెండు గ్లాసులు నీళ్ళు తాగి... అప్రయత్నంగా ఫయ్యూం ఫొటోవంక చూసి పడుకుంటుంది మా.

నిద్దట్లో పిల్లలు కాళ్ళు మీద వెయ్యడమనే అతి సామాన్యమైన సంఘటనని రచయితలిద్దరూ కథల్లో ఉపయోగించడం కాకతాళీయమా? తరచి ఆలోచిస్తే కాదనిపిస్తుంది. పిల్లల భయమో, అభద్రతాభావమో, ఏదో నిద్రపోతున్న సమయంలో పక్కనున్న పెద్దలమీద కాళ్ళు వేయిస్తుంది. ఇదొక సైక'లాజికల్' బిహేవియర్. సమయ సందర్భానికి ఉచితంగా

రచయిత లిద్దరూ ఓకే సంఘటనని కల్పించడం, వారి పరిశీలనాశక్తికి అద్దం పడుతుంది.

కానీ, ఆశ్చర్యం! ఈ చిన్న సంఘటన తర్వాతే ఆయా కథల గమనం మలుపు తిరుగుతుంది.

ఓ పదిరోజులు ఆఫీసుకు తనతోపాటు బృందను తీసుకురాక తప్పదనే అబద్ధపు సంజాయిషీ ఫలితంగా కొలీగ్ రజని బృంద స్థితినీ, మా దు:స్థితినీ గమనించి, ప్రభాకర్ సాయం తీసుకుంటే సమస్య పరిష్కారం కాగలదని సూచించడం... ఆ ప్రకారం కథ సుఖాంతం దిశగా సాగడం జరుగుతుంది.

గౌరి మెడచుట్టూ చేతుల్ని లుంగచుట్టి పడుకోవడంతో, నెమ్మదిగా ఒదుగుతూ అలా నిద్రలోకి జారుకుంటుంది సీతాలు. నిద్దట్లో కల. చంకలో చేట, బుట్ట పెట్టుకుని నూర్పులు జరుగుతున్న పంటచేలుకు పోయి 'కాసిన్ని' గింజలకోసం అడుక్కుంటుంది సీతాలు. ఓ చిన్న రైతు కడ కళ్ళంలోంచి రెండు దోసిళ్ళు సీతాలు బుట్టలో పోస్తాడు. దూరంగా చెట్టుకింద కూచుని, కళ్ళలో ఒత్తులు వేసుకుని వాటిని బాగుచేసుకుంటుంది. "తనకు స్వంతమైన రెండు దోసిళ్ళ గింజలు తనదగ్గరున్నాయన్న సంతోషంతో ఆ కలలోనే, 'చిన్ని మువ్వలు... చిన్ని మువ్వలు' అంటూ మురిసిపోతూ ఇల్లు చేరిన సీతాలు వాటిని చాపలో వేసి ఆరబెట్టి కాపలా కూర్చుంటుంది. "చిన్న మువ్వలు... చిన్న మువ్వలు – చేసేనమ్మ సిరుల సందడి..." అని పాట పాడుతూంటే, చాపలో ధాన్యం పుట్లు పుట్లుగా పెరుగుతుంది. పాటతో ఖంగుమంటున్న సీతాలు గొంతుకు గౌరికి మెలకువ వస్తుంది. "మన ఇల్లంతా బంగారమేనే! మన కష్టాలన్నీ గట్టెక్కాయి. నీకు బోలెడు నగలు. కట్నం ఇచ్చి పెళ్ళి చేయిత్తా"నంటుంటే, తల్లికి పిచ్చెక్కిందేమోనని దిగులుగా దిక్కులు చూస్తున్న గౌరికి టేబిల్ మీద విషం సీసా కనిపిస్తుంది. తన తల్లి ఆత్మహత్య చేసుకోవాలనుకుందని తెలిసి గౌరి భయంతో కంపించిపోతూ, పిచ్చిపిచ్చిగా తల్లిని రక్కుతూ, గిచ్చుతూ, "వద్దమ్మా వద్దు, నాకోసం నువ్వు చచ్చిపోవద్దు... కావాలంటే ఇద్దరం కలిసే చచ్చిపోదామమ్మా!" అని బావురుమంటుంటే, ఎంతకీ కూతురును సముదాయించలేని సీతాలు విషం సీసా నేలకేసి కొడుతుంది. సీసా బద్దలై నేలపాలైన విషం ఓడిపోయిన మృత్యువులా ఉంటుంది.

కానీ, చెప్పలేనంత ఏవగింపు కలిగించే వ్యక్తిని పళ్ళికిలిస్తూ,

ఒగలుపోతూ (మా పోయిందో లేదో తెలీదుగానీ, సర్వసాధారణంగా నిస్సహాయ పరిస్థితిలో జరిగే దుస్థితి) సహాయం కోరడం నిజంగా ఆత్మహత్యాసదృశమే కదా! అలాగే, అభిమానాన్ని చంపుకుని ఒకళ్ళ ముందు చేయి చాచడమూ ఆత్మహత్యా సదృశమే!

అయితే, ఆత్మహత్యకు ప్రేరేపించే బలహీనమైన ఆ ఒక్క క్షణంలో నిలదొక్కుకుంటే, సంబాళించుకుంటే... పిరికితో పరారీ కాకుండా సమస్యను సమయస్ఫూర్తితో ఎదుర్కొంటే – తరువాత జీవితం అమృత మయమవుతుందనే సత్యాన్ని 'అభిన్న పరిష్కారం'గా సూచించిన ఈ రెండు కథలూ కష్టాలతో కృంగుతున్న మానవజీవితానికి మంచి సందేశాలు.

(సర్కార్ ఎక్స్‌ప్రెస్, 08–11–2005, మంగళవారం)

---

(సర్కార్ ఎక్స్‌ప్రెస్ ఎడిటర్ ఈ వ్యాసప్రతిని కాశీభట్లకు మాత్రమే పంపగలిగారు. రామారావుగారికి ఫోను నంబర్ లేని కారణంగా, చిరునామా దొరకక పంపలేకపోయారు. అందువల్ల కాశీభట్ల మాత్రమే ప్రతిస్పందించగలిగారు.)

... మీ తులనాత్మక పరిశీలన అత్యద్భుతంగా సాగింది. చాలా లోతుల్లోకి వెళ్ళారు. కథల్లోని కీలక అంశాలను, పరిస్థితులను, సందర్భాలను పోల్చి చూడాలనిపించడమే ఈ వ్యాసం ఇంత చక్కగా రావడానికి కారణం.

అయితే ఆశ్చర్యం! ఈ రెండు కథలూ వస్తుసాదృశ్యంతో ఇలా ఇంచుమించు ఒకేసారి పత్రికల్లో రావడం...

నాకు రామారావుగారి కథ దొరకలేదు. వీలైతే పంపించండి...

**– కాశీభట్ల వేణుగోపాల్, కర్నూలు**

కథకుడు : డా॥ పాపినేని శివశంకర్
కథ : చివరి పిచ్చిక
ప్రచురణ : ఆదివారం ఆంధ్రజ్యోతి

# చివరి పిచ్చిక చిరంతన వేదనకు చిత్రిక పట్టిన శివశంకర్

డా॥ పాపినేని శివశంకర్ విశిష్ట భావుకుడు. కవిగా, కథకునిగా, విమర్శకునిగా ఒక ప్రత్యేకతను సంతరించుకున్న రచయిత. జాతి అంతరించి పోతున్న సమయంలో మిగిలి ఉన్న 'చివరి పిచ్చిక' చిరంతన వేదనకు చిత్రిక పట్టారు – అదే పేరుతో రాసిన కథలో.

పిచ్చుక గురించి తలచుకోగానే అందరికీ గుర్తొచ్చేది చిన్నప్పుడు గోరుముద్దలు తింటూ విన్న అమ్మ చెప్పిన కథ – కాకమ్మ, పిచ్చుకమ్మల కథల, పిడకల గూళ్ళ కథ. పెద్ద గాలివాన, కూలిపోయిన పిడకల గూడు, కర్రలగూటి నిరాదరణ, చిన్న గొయ్యి – చిన్న మెత్తు బంగారం, చిన్న తేలు కుట్టడం, పెద్ద గొయ్యి – పెద్ద బంగారం, పెద్ద తేలు కుట్టడం – పిండారబోసిన వెన్నెల వేళల్లో ఆరుబయట నులక మంచం మీద నిద్రలోకి ఒదిగిపోతూ విన్న కథ. తరువాత నిద్రలో ఎన్నెన్నో చిన్నారుల వెచ్చని కలలకు స్వాగతం పలికిన కథ.

ఈ కథ చెప్పి, అసలు 'చివరి పిచ్చిక' కథలోకి వెళుతూ కథకుడంటారు, "నిజంలాంటి అబద్ధమైన కథ. కాకమ్మలు ఎప్పుడైనా తలుపులు తీస్తాయి; తలుపులు వేసుకునేది రెండు చేతుల జీవులేనని!

రెండు చేతుల జీవుల స్వార్థ ప్రయోజనానికి బలయ్యే వేనవేల జీవజాలాల వేదనకు పట్టిన అద్దం ఈ కథ – 'చివరి పిచ్చిక' మనోగతం.

"గూడులేని పిట్ట బతుకు ఎంత భయంకరమో మా అమ్మ చావుతో తెలిసొచ్చింది" అనే చివరి పిచ్చిక స్వగతంతో 'కాకమ్మ–చిలకమ్మ' పిట్టకథ తర్వాత అసలు కథ ప్రారంభమవుతుంది. చివరి పిచ్చిక ఒంటిగా ఉన్నప్పుడైతే చెట్టూ, చావిళ్ళూ, లోగిళ్ళూ – అన్నీ దానికి గూళ్ళే. పికిలితో జత కట్టాకనే దానికో గూడు అవసరమవుతుంది, గుడ్లు పొదగడం కోసం, పిల్లల రక్షణ కోసం.

పిచ్చుకల గూటి నిర్మాణానికీ నియమాలుంటాయి. దూరంగా ఏ వాగు ఒడ్డునో కాకుండా, పంటలకి పంటలు చేరే లోగిళ్ళకీ దగ్గర్లో ఉండాలి, గూడు కట్టుకునే స్థలం. ఎండ పడని తావు, వానజల్లు పడని తావు ఎన్నుకోవాలి. తర్వాత మెత్త మెత్తటి గడ్డి పీచులు ఏరేరి తెచ్చుకోవాలి. ఏ చూరులోనో, గోడ సందులోనో గూడు కట్టుకోవాలి. కానీ ఇతర జీవుల నుంచి ప్రమాదం రావచ్చు. వేరే ప్రాణులనుంచి ప్రమాదం ఉండని చోటు ఒకటుంది. అదే బావి. బావిలో గూడు కట్టాలంటే ముందటేడు అరవడి ఎంతవరకు ఉందో చూసుకోవాలి. లోపల వేడిని పసిగట్టగలగాలి. పసి కందులు దొర్లి నీళ్ళల్లో పడకుండా కనుగలిగి ఉండగలగాలి. గూడు నిర్మాణంలో ఇంత సైన్సుంది. ఇదంతా మగ పిచ్చుకలు చదువుకుని తీరాలి. ఎందుకంటే, గూడు కట్టే తెలివిబట్టే ఆడ పిచ్చికలు మచ్చిక అవుతాయి.

తల్లి దగ్గర ఈ విషయాలన్నీ తెలుసుకుంటుంది 'చివరి పిచ్చిక'. అది పాపం మగ పిచ్చిక. ఓ పెద్ద పూరింట్లో వాసాలకి, పూరికి నడుంగున అక్కడక్కడ ఉన్న సందుల్లో మంచి సందు ఎంచుకుని తన మొదటి గూడు నిర్మిస్తుంది చివరి పిచ్చిక. అప్పటికి పికిలి మూడుగుడ్ల కడుపుగత్తె. పికిలికెంతో నచ్చుతుంది గూడు. మూడు గుడ్లను పెంచుతుంది. రెండు గుడ్లే పిల్లలవుతాయి, బులిబుల్లి ముక్కుల్తో వచ్చీరాని రెక్కల్తో ముదురు ఎరుపు రంగులో ముద్దుగారుతూ!

ఒకరోజు పిచిక దంపతులు మేతకెళ్ళి వచ్చేసరికి, 'రెండు చేతుల ప్రాణి' పెద్ద కర్రతో గూడును కుళ్ళబొడిచి అవతల పారేస్తుంది, మనిషి

పూరిల్లు డాబాగా మారుతున్న నేపథ్యంలో. మనిషి ఇంట్లో పిచ్చికలకు గూళ్ళు కట్టుకునే స్థలం అభావం అయిపోయింది. డాబా ఇళ్ళు బాగా పెరిగాయి. పిచ్చికకు మనిషితో సహజీవనం పోయింది.

'కసిరి విసిరే' రెండు చేతుల ప్రాణుల నడుమ, వెంటబడే పెద్ద పక్షుల నడుమ, తలలు విసిరే వేటగాళ్ళ నడుమ... ఈ విపరీత ప్రపంచంలో బుల్లి పిచికమ్మల చావు గురించి ఎవరికి పట్టింది? అందుకే అవి కనుమరుగయ్యాయి.

కనుమరుగౌతూ అవుతూ, మనిషితో సహజీవనం మానుకుని, అతనికి కొంచెం దూరంగా, వేరే ప్రాణులనుంచి ప్రమాదం లేకుండా ఉండే స్థలం వెదుక్కుంది పాపం, పిచ్చిక. 'బావిలో గూడు'ను స్థిరవాసం చేసుకొంది. అరవడిలోని వెచ్చదనం అన్నీ చూసుకొని, లోతైన 'బావిలో గూడు' కట్టుకుంటుంది, చివరి పిచ్చిక. పికిలి మళ్ళీ పిల్లల్ని కంటుంది. అంతా సంతోషంగా గడుస్తోందనుకుంటూండగా, ఆ ఏడు వానల్లేక బావిలో నీళ్ళెండిపోతాయి. అంతే బావి తాగాడి విరిగి పడుతుంది. బావి కంపం (పిచ్చుకల భూకంపం అనవచ్చేమో!) వస్తుంది. బావిగల ఇంటి రెండు చేతుల ప్రాణులు తమ గొంతునెండించిన ఎండిన బావిని పూడ్చి మరేదో నిర్మాణానికి పూనుకుంటాయి. పిచ్చిక దంపతులు పైకెగిరి తప్పించుకున్నా, రెక్కలు రాని పిల్లలు మాత్రం అక్కడే సజీవసమాధి అయిపోతాయి.

కాలం ఎంత తొందరగానో మారిపోతుంది. పిచ్చుకలకు ఆహారం దొరకని కాలం దాపురిస్తుంది. వాగుల్లో చిన్నచిన్న చేపలే తప్ప పురుగులు దొరకడంలేదు. వెనకటి గింజల పైర్లు పోయి ఏవేవో రెండు చేతుల మధ్య మురిపెంగా సాకపడుతున్న చిత్రవిచిత్రమైన పంటలతోనే నిండి పోతున్నాయి పొలాలన్నీ. "బంగారు కాలం దాటిపోయింది పికిలీ!" అంటూ చివరి పిచ్చిక నిట్టూర్చితే, "మనకు తెలీకుండా మన ముందునుంచే ఆ బంగారు కాలం ఎట్లా దాటిపోయింది?", ప్రశ్నిస్తుంది తెలివితక్కువ పికిలి. అదే గమ్మత్తు. ఎప్పుడో తన తల్లి చెప్పిన మాటలు గుర్తుకొస్తాయి చివరి పిచ్చిక్కి. పికిలితో చెబుతుంది అమ్మ చెప్పిన మాటల్ని – "చిన్నా! సృష్టిలో చేతులున్నది ఒక్క ప్రాణికే. అది తన స్వార్థం కోసం ఏ పనైనా చేస్తుంది. చెట్లు నరుకుతుంది. పిట్టల్నీ మృగాల్నీ వేటాడి తింటుంది. చెట్లను బలవంతాన కాపు కాయిస్తుంది. మచ్చిక చేసి మోసగించి, జంతువుల్ని

తాళ్ళతో కట్టి పనులు చేయించుకుంటుంది. భూమ్మీద సంపదంతా తనకే చెందాలని దాని ఆరాటం. ఏదో ఒకనాటికి ఈ చేతుల జీవివల్లనే మన జాతి అంతరిస్తుందని నా భయం". తన తల్లి భయం నిజమయ్యే క్షణాలు దగ్గర పడ్డాయని తెలుస్తుంది చివరి పిచ్చిక్కి.

అందుకే, రెండు చేతుల ప్రాణుల దగ్గరలో ఉండకూడదని గట్టిగా నిర్ణయం చేసుకుని ఊరి వెలుపల వాగు ఒడ్డున తుమ్మల్లో కంచెల్లో ఒక గుబురులో గూడు కడతాయి పికిలీ, చివరి పిచ్చికా. ఎలాగో రోజులు గడుస్తున్నాయి. "మేతకోసం చాలా దవ్వు తిరగాలి" పాపం. అలా ఉంటూండగా ఒక పొద్దు తుమ్మచెట్టు ప్రేమగా హెచ్చరిస్తుంది – "చిన్నారి పిచ్చికా! చిన్నారి పిచ్చికా!! ఋతువుల్లో మార్పు గమనించావా? నేను చాలా ఎత్తైనదాన్ని. నూరు మానుల దూరం చూడగలను. నా చూపు అందినంత దాకా ఎక్కడా పిచ్చిక జాడ కనిపించడంలేదు. ఒకప్పుడు ఎన్నెన్ని గుంపులు నామీద వాలేవో! నువ్వే నీ జాతిలో చివరిదానివనుకుంటా, జాగర్త. నీ జాతిని నాశనం కానీకు."

తుమ్మ హెచ్చరిక విని భయంతో వణికిపోతుంది చివరి పిచ్చిక. చూడబోతే తామిద్దరే మిగిలి ఉన్న పిచ్చికలేమో! ఎలా? ఎలా తన సంతానాన్ని రక్షించుకుని వృద్ధిపరచుకోవాలి?" – తన ముందున్న పెద్ద సవాలైంది చివరి పిచ్చిక్కి.

అంతల్లో పికిలి మళ్ళీ గుడ్లకొస్తుంది.

ఎంతెంత దూరం తిరుగుతున్నా మేత దొరకడంలేదు. నీటి జాడ అగుపడడంలేదు. దాహం...దాహం. పత్తి, మిరప తోటల్లో ఏవో ద్రావకాలు చల్లగా నిశ్చలంగా పడిపోయిన పురుగులు తప్ప ఇంకేమీ కనబడకపోతే, ఆబగా రెండు మూడు పురుగుల్ని తిని, ఇంకో నాలుగైదింటిని ముక్కుతో కరిచి తెస్తుంది. పికిలి ఆకలీ తీరుతుంది. దాని ఆకలితో పాటు జీవితమూ తీరిపోతుంది. మొండి ప్రాణంతో చివరాఖరి పిచ్చిక జీవచ్ఛవంలా మిగుల్తుంది. తన కుడి ఎడమల ఆహ్లాదం కలిగించే రివురివ్వుల, కిచకిచల పలకరింతల్నీ, పులకరింతల్నీ కోల్పోయింది.

"ఎక్కడ నెలకి మూడు వానలు మట్టిని ముద్దాడతాయో... ఎక్కడ అడవులు, బీళ్ళు అనంతంగా విస్తరిస్తాయో... ఎక్కడ పొలాల్లో విషం లేని గింజలు మొలుస్తాయో...ఎక్కడ వేలవేల పిచ్చికల, పికిలి పిట్టల, కాటిక పిట్టల రెట్టల్తో నేల పునీతమౌతుందో... ఎక్కడ భయంకరమైన రెండు

చేతుల ప్రాణులకు తావులేదో ఆ సార్థకలోకానికి", 'పిచికల స్వేచ్ఛాస్వర్గానికి' చివరి పిచ్చిక ఎగిరిపోయే రోజు రానేవస్తుంది. ఆ రోజు అది మానవజాతిని శపిస్తుంది. తీరని వేదనలోంచే శాపాలు పుడతాయి. "పిచ్చికలకు చోటులేని ఈ ప్రపంచం ఒకనాటికి ఎడారిగా మిగిలిపోవుగాక! దయలేని రెండు చేతుల జాతి సమస్తాన్ని ధ్వంసం చేస్తూ చివరికి తనే ధ్వంసమగు గాక! ఇది ఈ చివరి పిచ్చిక శాపం." ... 'పిచ్చిక విసురుతున్న బ్రహ్మాస్త్రం' అంటూ మనుష్యజాతిని శపిస్తుంది చివరాఖరి పిచ్చిక.

ఈ బ్రహ్మాస్త్రం నుంచి మనిషి తప్పించుకోలేడు, తనను తాను మానవతకు గూడుగా మలచుకోనంతవరకు!

+++

మనిషి గురించి 'చివరి పిచ్చిక' పడిన భయం ఎంత దారుణమైంది? అయితే అదే భయాన్ని – ఒక మనిషి గురించిన భయాన్ని మరో మనిషి కూడా పొందుతున్నాడు. డబ్బున్నవాడంటే పేదవాడికి భయం. అధికారమున్న వాడంటే సామాన్యుడికి భయం. బలవంతుడంటే బలహీనుడికి భయం. తెలుపోడంటే నలుపోడికి భయం.

చివరి పిచ్చిక భయం దారుణమైతే, మనిషి పడుతున్న భయం దారుణాతి దారుణం. చరిత్ర తిరగేస్తే, ఇలాంటి భయాలెన్నో! వెలి భయం... బలి భయం... ఆకలి భయం!

చీకటి కొట్టాల్లో, దారుణ ఘెట్టాల్లో శతాబ్దాలపాటూ బంధాల్లో మగ్గిన భయం... దస్యుడిగా, నల్లవాడిగా, నిగ్గరుగా తరతరాలుగా అణగారిన భయం... ఆ భయంతో జీవితం కంటే ఇంకా ఇంకా ఎక్కువైన దానిగురించి పోరాటం.

నైజాలు మార్చుకొన్న భయాలూ, రూపాలు మార్చుకొన్న పోరాటాలూ! ఇదే ఇదే, తిరగేస్తే చరిత్రంతా! వలస పాలనలూ, స్వాతంత్ర్య పోరాటాలూ... నయావలస వాదాలూ...???

ఇంతేనా? చరిత్ర పురరావృతమేనా??

మనిషిలో మనిషితనం, మంచితనం, మానవత్వం అడుగంటి నప్పుడు జరిగింది కానీ, జరుగుతున్నది కానీ, జరుగబోయేది గానీ ఇంతకన్నా మరేమిటి?

స్వార్థం కోసం మనిషి ప్రకృతినీ, ప్రకృతిలోని సమతౌల్యాన్ని దెబ్బతీస్తే, వనరుల దోపిడీ కోసం రాజకీయపు ఎత్తులు వేస్తూ, యుద్ధ

తంత్రం నడుపుతూ పోతే – మనిషంటే మనిషికి భయమే కలుగుతుంది.

ఎక్కిన కొమ్మనే నరుక్కుంటున్నాడు మనిషి, అత్యంత మేధావిగా మారుతూ! అదీ వైపరీత్యం.

+++

మానవ మనుగడకే ముప్పు తెస్తున్న పర్యావరణ విధ్వంసాన్ని పిచ్చుకజాతి విలుప్తానికి ముడిపెట్టి రాసిన కథ 'చివరి పిచ్చిక'. ఈ కథలో పిచ్చికల భాషకు సంబంధించిన పారిభాషికతను బలే గమ్మత్తుగా సృష్టించారు శివశంకర్. నీళ్ళు పోసుకుని మూడు నెలలైందన్న విషయాన్ని పిచ్చుక ఎలా చెప్పింది? "పికిలి మూడుగుడ్ల కడుపుగత్తె" అని. అలాగే మనిషి 'రెండు చేతుల ప్రాణి' అనడం వాటికోణం నుంచి ఆలోచించి చెప్పడమే. అలాగే చెట్టు భాష – 'నూరు మానుల దూరం' అనడం కూడా. వీటికి తోడు నడుంగవ, గలస, అరవడి, తొగాడి వంటి గ్రామ్యభాషా పద పరిమళం అలరిస్తుందీ కథలో.

అయితే, మగపిచ్చుకను 'చివరి పిచ్చిక' అనడం మనిషికే చేతనైన పురుషాహంకారం. మగపిచ్చుకతో పాటు ఆడపిచ్చుక పికిలి కూడా ఉంది కథలో. నిజానికి కథ ఆ రెండింటికీ చెందింది. అవి రెండూ కలిసి జమిలిగా అనుభవించిన కష్టాలు, కన్నీళ్ల కమామిషు. అయినా, పాపినేని మగపిచ్చుకనే **'చివరి పిచ్చుక'** అనడం, పురుషాహంకార చిహ్నమే. (ఈ అహంకారం నశిస్తే కాని మానవ సమాజానికి చిన్నమెత్తు మంచి కూడ జరగదు) ఎందుకంటే కథ చివర్లో కొంచెం ముందుగా చనిపోయేంత వరకు, పికిలి 'చివరి పిచ్చిక'తో కలిసే ఉంది. అలాంటప్పుడు 'చివరి పిచ్చుకలు' అనాలి. పురుషాధిక్య భావం పిచ్చుకలకు లేదు. నిజానికి చివరి పిచ్చికైన మగ పిచ్చిక్కి కూడా లేదు. అందుకే, తుమ్మ హెచ్చరికతో వణికిపోయిన చివరి పిచ్చిక, "చూడబోతే తామిద్దరే మిగిలి ఉన్న పిచ్చికలేమో!"నని స్వగతంగా అనుకొంటుంది.

పర్యావరణ స్పృహను సృజనాత్మకంగా మలుస్తూ, మనిషి నిష్కారణ, నిష్కారుణ్య స్వార్థాన్ని ఎండగడుతూ 'చివరి పిచ్చిక' కథ రాసిన పాపినేని ఎంతైనా అభినందనీయులు. ఈ మధ్య కాలంలో చదివిన కథలన్నిటిలోకీ నన్ను చాల ఎక్కువగా కదిలించిన కథ ఇది. అందుకు ప్రత్యేకంగా నా వ్యక్తిగత అభినందనలు కూడ తెలుపుకుంటున్నాను.

(సర్కార్ ఎక్స్‌ప్రెస్, 18-07-2006, మంగళవారం)

కథకుడు : శశిశ్రీ
కథ : నది కె పాల్
ప్రచురణ : సాహిత్యనేత్రం
జనవరి 2007

# వ్యావసాయిక కఠినవాస్తవికతకు అద్దం పట్టిన కథ

వ్యవసాయం ఓ పెద్ద జూదం. కనబడని విధి పాచికలు రైతు బదుగు జీవితంతో ఆడుకుంటాయి. ప్రకృతిలో భాగంగా జీవనాన్ని మలచుకుని ఆరుగాలమూ కష్టపడే రైతన్న బతుకును ఆ ప్రకృతే బుగ్గిపాలు చేస్తుండడం విచారాల్లోకల్లా విచారం. ప్రకృతికి అప్పుడప్పుడు కరుణ లేకపోతే పోయే, ప్రభుత్వానికి రైతుపట్ల ఎప్పుడూ కరుణలేశం కూడ లేకుండా పోతోంది. పారతంత్ర్యమో, ప్రపంచీకరణమో... పేరేదైతేనేం, రైతు నిఘంటువులో అన్నింటికి ఒకటే అర్థం, 'దోచుకో బడ్డం' లేదా 'పీడించబడ్డం'.

రైతు బ్రతుకెప్పుడూ ఏటికి ఎదురీతే. ఆ ఎదురీతలోనే బ్రతుకు ముగిసిపోతుంది. ఈ కఠిన వాస్తవికతకు అద్దం పట్టిన కథ శశిశ్రీ 'నది కె పాల్'. విచక్షణాయుతమైన 'సాహిత్యనేత్రం' కలిగిన కథకులు శశిశ్రీ. నిబద్ధత కలిగిన సాహితీవిలువలకు పట్టం కట్టే సంపాదకులుగా సుపరిచితులు. సాహిత్యనేత్రం జనవరి 2007 సంచికలో వచ్చిందీ కథ.

మొదీన్ బాష ఆయన కొడుకు చాంద్ బాష బ్రిడ్జిపై నడుస్తూ పోతున్నారు. అది 'సిద్దోటం దోస తోటల్లోకి తీసుకుపోతుంది. పెన్నానది ఇసుక పఱ్ఱల్లో ఏడాదికో సారి లక్ష ఎకరాల్లో సాగయ్యే 'పేదోళ్ళ సేద్యం'... 'ఏటి ఇసుక సేద్యం", ఈ దోసపంట. ఎక్కువగా దళితులు, మొదీన్‌బాష లాంటి సాయిబులు చేపట్టే సేద్యం.

"ఏందిరా అబ్బీ! నిన్నటికి ఈ రోజుకి ఏట్లో ప్రవాహం పెరిగినట్లుందేం. మైలవరం నించి నీళ్ళేమైనా కిందికి వదిలినారో ఏమో కదా!?", కొడుకుతో ఆందోళనగా, భయంగా, అనుమానంగా అంటాడు మొదీన్. జలకళ తగ్గినా, పెరిగినా అది రైతుకు కళవళమే. అందునా ఆ రోజు బుసబుసలాడుతున్న దోసతోటకు కోత రోజేమో మొదీన్‌బాష మరీ కలవరపాటుగా ఉన్నాడు. డబల్ కూలీ అడిగిన కూలీలకు కాస్తంత తగ్గించి కొంచెం ఎక్కువైనా ఎలాగో బేరం కుదుర్చుకున్నాడు. దోసకాయల కోత సాగుతుంటుంది. పక్క తోటలో రంతు గోపాల్ ఏసోబుకు ఒప్పందం ప్రకారం పావలా వంతు డబ్బులు ఇచ్చి తనవద్దకు వస్తుంటే, "పడిన కష్టానికి తొలిఫలితం చేతికి దక్కబోతుందనే సంతోషంతో" గాలిలో తేలిపోతాడు మొదీన్.

"తారు డ్రమ్ములో ముంచి పైకి తీసినట్టున్న అతను వ్యాపారంలో లాభాలు కళ్ళ జూస్తుండడంతో నల్ల వజ్రంగా మెరిసిపోతున్నాడు" అంటూ, ఒక్క వాక్యంలో హోల్‌సేల్ కాంట్రాక్టరు, మధ్యదళారీ అయిన రంతు గోపాల్‌ని వర్ణిస్తారు. ఈ ఒక్క వాక్యంలోనే అతని స్థితిని, ముఖ్యంగా స్వభావాన్ని పాఠకులకు చెప్పకనే చెబుతారు. తెచ్చిన డబ్బులైపోయా యంటూ మొండి చెయ్యి చూపుతాడు గోపాల్. "ధూ దీనెమ్మ! అందరికీ డబ్బులిచ్చి తీరా మా సాయిబుల తోటలకాడికి వచ్చేటప్పటికి దుడ్లు అయిపోయినాయంట! అధవ చిక్కిన నా కొడుకులం! వీళ్ళు ఎట్ల ఆడిస్తే అట్లల్లా ఆడాల్సి వచ్చింది. ధూ...ధూ", అని కడుపులో దేవినట్లయి మనసులో తిట్టుకుంటాడు మొదీన్. కథలో అతని పాత్రకి అది సహజమైనా, అతననుకునే ఆ మాటల్లో మైనారిటీ సేద్యగాళ్ళ పట్ల దళారీలు చూపే వివక్ష మనకి అర్థమవుతుంది.

ఈ విధంగా ఒకదాని వెంట ఒకటిగా సంఘటనలు వస్తూ అవే కథను నడిపిస్తాయి. పనిబెట్టుకుని కథకుడు చెబుతున్నట్లుగా అనిపించదు. నిజంగా ఇది మంచి కథనశైలి. ఆ తరువాత వచ్చిన అనేక సంఘటనలు కథను నెమ్మదిగా ముగింపుకు నడిపిస్తాయి. వియ్యంకుడు ఫకర్‌దీన్ రాక, తన కోడలు రమీజాని రెండేళ్ళ తర్వాత ఇప్పుడు వచ్చి తీసుకెళ్తానంటూ.

కూతురు కాపురం చక్కబడుతుందన్న సంతోషం ఒకవైపున్నా, మరోవైపు సందేహం. దుబాయెళ్ళిన అల్లుడు ఖాదర్ హుస్సేన్ వస్తున్నాడని. "అర్జెంటుగా అమ్మిని పంపేయమని వస్తే", ఒక్కసారే అది సాధ్యమయ్యే పనేనా? అమ్మి నగలు కుదువపెట్టే రెండేళ్ళనుంచీ దోససేద్యం చేస్తున్నది. అమ్మిని అత్తింటికి పంపాలంటే ఒక్కసారే నగలన్నీ ఎట్ల వస్తాయి?

"దానిది ఏముందిలే నాయినా! ఈ దోసచెట్లు సీజన్ అయితే నగలు యిడిపించి చీరెసారె కూడా పెట్తాం అంటే పోల్యా" అంటూ సమస్యకు కుర్రతనపు సర్దుబాటును సూచిస్తాడు కొడుకు చాంద్‌బాష. "నీవు చెప్పినంత సులువు కాదులేరా అబ్బీ! బిడ్డ నగలు కుదువపెట్టుకోవడానికి సిగ్గులేదా? సంసారానికి పంపాలని మనసులో వుండి వుంటే ఇట్ల పాలుపడతారా ఎవరైనా అంటే... ఈ తలతీసి ఎక్కడ పెట్టుకోవాలి?" పెద్దరికపు బాధతో కుమిలిపోతాడు మొదీన్. ఎవరో అనుకోవడమేమిటి? "పైకి అనకపోయినా కూతురే అనుకుంటుంది మనసులో, 'అక్కడ అత్తింటివాళ్ళు దౌర్జన్యంగా నగలు లాక్కోవాలని చూస్తే, ఇక్కడ పుట్టింటివాళ్ళు ఆప్యాయంగా లాక్కున్నారు" అని. ఏదైతేనేం, మధ్యలో ఆడకూతురు దోపిడికి గురవుతుంది, మధ్యతరగతి, క్రింది కుటుంబాల్లో! అందుకే మన పూర్వీకులు ఎట్టి పరిస్థితుల్లోనైనా స్త్రీధనాన్ని వినియోగించుకోకూడదనే గట్టి కట్టడి చేశారు. అయినా పరిస్థితులు ఆ కట్టడికి గట్లు తెంచుతూనే ఉంటాయి.

ఏమైనా, నోరు మూసుక్కూర్చోకుండా, నగలు తెచ్చి పెట్టండని అడిగేయక తప్పదని, ఆ విధంగా కఠినంగా మారకపోతే తన కాపురం నిలబడదనీ నిర్ణయించుకున్న రమీజా, వూర్లో సాయిబుల చిన్న చితక తకరార్లు తీర్చే మసీదు ఇమామ్ సయ్యద్ సాబును వెంటేసుకుని వచ్చిన తండ్రిని 'ఈ పెద్దాయన' అని వ్యంగ్యంగా భావించగలుగుతుంది. మనసులోనే అయినా, ఇదంతా అనివార్యమైన సంఘర్షణే. ఎవరికి వారి ఆలోచన సరైనదేననిపిస్తుంది. కాని ఇతరులకి ఎబ్బెట్టుగా తోస్తుంది. ఆర్థిక ఇబ్బందుల నేపథ్యంలో కుటుంబ సభ్యులమధ్య అడుగడుగునా తల ఎత్తే సున్నితమైన జీవనసంఘర్షణని అత్యంత ప్రతిభావంతంగా చిత్రించారు ఈ కథలో శశిశ్రీ.

వియ్యంకులిద్దరూ ఇమామ్‌తో కలిసి భోజనం చేస్తుండగా ఎప్పుడో తెల్లవారు జామున పోయిన కరెంటు వున్నపళంగా వచ్చి ఆకాశవాణి రూపంలో దుర్వార్త పలుకుతుంది, "పైతట్టు భారీవర్షాలు రావడంతో మైలవరం ప్రాజెక్టు వరదగేట్లు తెరిచి పెన్నలోకి వరదజలాలు వదిలా"రంటూ.

కథాగమనంలో ఇదో పెద్దమలుపు. వార్త వింటూనే, ఎంగిలి చేత్తోనే బ్రిడ్జిదిక్కు పరుగుదీస్తాడు మొదీన్. వెనుక అనుసరిస్తారు కొడుకు చాంద్‌బాషా, వియ్యంకుడు ఫకర్‌దీన్.

ఉధృతంగా ప్రవహిస్తున్న ఎర్రమట్టి నీళ్ళలో కాపలా కోసం వేసిన నేల గుడిసెలు, కంప నురుగులై తేలిపోతూ కనిపిస్తాయి. ఇంకెక్కడి దోస తోట. కాపు చేతికి వస్తూ వస్తూ పోయిందేమిరా... రేయ్... దోసకాయలు కొట్టుకొని పోతున్నాయిరా..." అంటూ పిచ్చిగా అరుస్తూ బ్రిడ్జిపైకి ఎగిసి వస్తున్న వరదనీటిలోకి పరుగు తీస్తాడు మొదీన్. కాదు, కాదు రైతు.

నీళ్ళు పెరిగిపోతూనే ఉంటాయి. మొదీన్ ఆ వరద నీటిలో పోతూనే ఉంటాడు. రైతు బతుకెప్పుడూ ఎదురీతే, చచ్చేంతవరకూ. ఈ వ్యావసాయిక కఠిన వాస్తవికత మారేదెప్పుడో? రైతు బ్రతుకు పచ్చగుండేదెప్పుడో? ఎప్పటికీ సమాధానం లేనిదిగా మిగిలిపోతున్న ప్రశ్న.

ముస్లిం మైనారిటీ అస్తిత్వవాద సాహిత్యంలో ఈ కథ ఒక మైలు రాయిగా నిలిచిపోతుంది. ఎందుకంటే ఈ కథ మైనారిటీల్లో మైనారిటీ అయిన దిగువ తరగతి ముస్లిం జీవితాన్ని, అందలి సంఘర్షణని, స్థూలంగానైనా, జీవద్వంతంగా చిత్రీకరించింది. అయితే ఆ స్థాయిలో వారి సామాజిక ఆర్థిక నేపథ్యంతోపాటు మత సాంస్కృతిక నైతిక నేపథ్యాన్ని కూడ రేఖామాత్రంగానైనా స్పృశించి ఉంటే ఇంకొంత సమగ్రమయ్యేది.

భాషాపరంగా రాయలసీమ మాండలికాన్ని పరిమళింపజేస్తుందీ కథ. పదిహైదు, కొరవ, వక్కాకులు, గెవ్వెరువు, తకరార్లు, వున్నిలేబ్బా, మర్చిపోగాకు వంటి పదాలు కథకుని అయిడెంటిటీని పట్టిస్తాయి. పూర్తిగా వీరమాండలికంతోగాని, అధికంగా ఉర్దూపదాలు కూరేసిగాని కథను అల్లకపోవడంవల్ల వెంటనే చదవడానికీ, చదువుతూనే అర్థం చేసుకోడానికీ పాఠకుడికి సావకాశమిస్తుందీ కథ. ఎంతగా అంటే–

ఈ కథను చదివిన రెండు మూడు రోజుల తర్వాత పుచ్చకాయ (కర్బూజ), దోసకాయ ('కలింగిరి' అంటే దోసా?) రెండూ తినడం తటస్థించింది. తింటున్నంతసేపూ ఇది 'సిద్దోటం కాయేమో' అనిపించింది. భ్రమ కాకపోతే పెన్నేట్లో కొట్టుకుపోయిన దోసకాయ ఎలా నావరకు వస్తుంది? ఎంతో అర్థవంతంగా ఉన్న కరుణాకర్ గీసిన చిత్రంలో బ్రిడ్జిమీద చాంద్‌బాషతో పాటు, ఫకర్‌దీన్ లేకపోటం లోపం.

(సర్కార్ ఎక్స్‌ప్రెస్, 06-03-2007 మంగళవారం)

కథకుడు : రాజా సమీర్ నందన్
కథ : చిన్నూ ప్రపంచంలోకి...
ప్రచురణ : చినుకు
సెప్టెంబర్, 2008

# చిన్నూల ప్రపంచాల్లోకి జర తొంగి చూడండోయ్!

జీవితం ఏమిటి?

భౌతిక సుఖలాలస కోసం త్యాగం చెయ్యడమా??

సుఖంగా ఉండాలని డబ్బులు సంపాదించడం మొదలుపెట్టి, అదో వ్యసనంగా ముదిరి... డబ్బులకోసం సుఖాలనీ, ఆఖరికి సంసారాన్నీ, పిల్లల్ని కూడ వదిలేసుకోడమేనా???

ఇంతేనా జీవితం! ఇంతకు మించి మరేమీ లేదా?

ఈ కీలకమైన ప్రశ్నలకు జవాబులు నలభై అయదు వేల రూపాయల లేజ్‌ఛాయ్ కుర్చీలో కూలబడితే దొరకదు.

ప్యాకేజీలు, వేగవంతం కావడం... కీపింగ్ ఇన్ ఫాస్ట్ ట్రాక్! రెండు పూటలా వంట వండిపెట్టి వెళ్ళడానికి వంటావిడ, ఏమన్నా పనులు చేసి పెట్టడానికి కమ్యూనిటీ వర్కర్, ఇంటినిండా రకరకాల గాడ్జెట్స్, లేటెస్ట్ ఫెసిలిటీస్, సెంట్రలైజ్డ్

ఏ.సి, ఇంట్లో తక్కువ, ఆఫీసులో ఎక్కువ అయిన సందర్భం జవాబివ్వదు.

దారుణమైన ఈ పరిస్థితిని వివరిస్తూ, ప్రశ్నలకు జవాబులు దొరికే 'చిన్నూ ప్రపంచంలోకి...' పాఠకుణ్ణి తీసుకువెడతారు రాజా సమీరనందన్. ఈ కథ సెప్టెంబర్ 2008 చినుకు సంచికలో వచ్చింది.

మనం ముద్దుముద్దుగా పిలుచుకునే చిన్నూలో, బన్నూలో, మున్నాలో ప్రతి ఇంట్లోనూ ఉంటారు. వారి ప్రపంచాల్లోకి ఒక్కసారి తొంగి చూస్తే జవాబు దొరుకుతుందని తెలియజెప్పే కథ – 'చిన్నూల, బన్నూల, మున్నాల ప్రపంచాల్లోకి' ఒక్కసారి తొంగి చూడమని తల్లిదండ్రుల్ని అభ్యర్థిస్తుంది... ఆదేశిస్తుంది.

రెండు పెద్ద పెద్ద ఎం.ఎన్.సి.లలో మేనేజర్లుగా చేస్తున్న మీరా, శ్వేత దంపతులు. ఒకరు హెచ్.ఆర్. హెడ్ అయతే, మరొకరు ఫైనాన్స్ హెడ్. క్యాంపస్ ఇంటర్వ్యూల్లో సెలక్టై, చదువు పూర్తికాగానే ఉద్యోగాల్లో చేరిపోయి, చిన్నవయసులో పెద్ద జీతాలతో, "ఎటూ తీసుకువెళ్ళని, ఎక్కడకూ అక్కరకు రాని జీవితాలు" గడిపే నవదంపతులు. ఎప్పుడో ఒకరాత్రి వేళ మెలకువ వచ్చి ఒకరి పక్కన మరొకరు ఉంటే మాట్లాడుకోడం; అలా మాట్లాడుకోటానికి రెండేసి వారాలు, కొండొకచో, అవసరమైతే నెలలు కూడా పట్టేంత బిజీ జీవితాలు గడిపే నవదంపతులు.

ప్రణాళికాబద్ధమైన జీవితాలు. అడుగడుగునా ఆలోచించుకుంటూ, ఎప్పటికప్పుడు పెరుగుతున్న అవసరాల కోసం జీతం పెంచుకునేందుకు అవసరమయ్యే చర్యలు తీసుకుంటూ, చకచక మెట్లెక్కేస్తూ ... అందరికీ ఆదర్శమయ్యే ... అసూయ కలిగించే అందమైన జీవితాలు వారివి. అయితే దాన్ని సాధించడానికి వారు చేసిందేమిటి?

ఇద్దరిదీ కలిపినా, పదిలక్షల చిల్లర మాత్రమే ఉన్న ప్యాకేజీ సరిపోవాలంటే, ఎం.బి.ఏ వైపు దండయాత్ర చేసి, ఇద్దరిదీ కలిపి అరవై లక్షల ప్యాకేజీకి పెంచాలని ... పనిగంటలు పెంచుకుని...ఇరవై నాలుగు గంటల్లో ముప్పై గంటలు పనిచేస్తూ, ఇరవైమంది చేసే పనిని అయిదుగురి చేత చేయిస్తూ ...మనవడో, మనవరాలో కావాలని పెద్దలు అల్లరి చేస్తేనే గాని ఆ విషయం గుర్తుకురానంత గజి'బిజీ'లో తాము సరిగా మాట్లాడుకునే రెండు మూడు నెలలు అవుతోందని గమనించి...ప్రతినెలా ఖచ్చితంగా ఒక సెలవురోజు కలిసి గడపాలని తీర్మానించుకుని...గుర్తుకు వచ్చిన విషయాన్ని అమలుపరిస్తే ఇంకో కొత్త వ్యక్తి వస్తే డబ్బు ఇంకా అవసరమని

హుటాహుటిన కంపెనీలు మారిపోయి కోటి రూపాయలకు దగ్గరగా ఇద్దరి ఉమ్మడి ప్యాకేజీని తీసుకెళ్ళి ...దీనికి అంతుందా?

శరణ్ ఉరఫ్ చిన్నూగాడు ఆరంగేట్రం చేసిన రెండు నెలలకి వాణ్ణి అమ్మమ్మ, బామ్మ, తాతయ్యలకి అలవాటు చేసేసి, ప్రత్యేకంగా వాణ్ణి చూసుకునేందుకు పన్నెండేళ్ళ శైలజని కుదిర్చేసి, తిరిగి ఆఫీసుదారి పట్టేసి... ఆన్‌లైన్ ఎసైన్‘మెంటల్’తో శ్వేత ఇంగ్లండు వెళ్ళి, కొన్ని నెలలు ఇద్దరూ దూరంగా ... ఇద్దరూ కలిసి చిన్నూకి ఎప్పటికీ దూరంగా...

ఎందుకు? ఎవరికోసం? దేనికోసం?

జీవించలేని జీవితాలు జీవిస్తూ... ఎవరి ఉద్ధరింపు కోసం?

ఒకరోజు ఆఫీసులో ఉండగా, ఫోన్ చేసి, “నీతో మాట్లాడా”లని శ్వేత అంటే, ఆ మాట్లాడుకోడానికి కూడా రెండువారాల తర్వాతగానీ... అదీ, కాకతాళీయంగా కాని వీలుకాని సందర్భానికి మురిసిపోవాలో, అలసిపోవాలో తెలీని సందిగ్ధ స్థితి కలుగుతుంది పాఠకుడికి.

జీవితాల్లో మార్పు అనివార్యం... మొట్టమొదటగా మార్పు వచ్చింది శ్వేతలో.

క్రమవిరుద్ధంగా ఆఫీసుకు సెలవు పెట్టి ఇంట్లో ఉండిపోడం... కనీసం పద్దెనిమిది గంటల ఆఫీసు సమయాన్ని క్రమంగా ఎనిమిది గంటలకు కుదించుకోడం... ఈ మార్పుకు కారణం చిన్నూగాడికి వచ్చిన జ్వరం. మూడు వారాలపాటు నూట రెండుకు తగ్గని జ్వరం. అయినా ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలో చెప్పి చిన్నూని శైలజకే వదిలేస్తారు శ్వేత, మీరా.

ఓ రోజు అనుకోకుండా ఫ్లైట్ కాన్సిల్ అయి శ్వేత పెందరాళే సాయంత్రం పూట ఇంటికొచ్చేసరికి జ్వరంతో అలానే పడుకున్న పడున్న చిన్నూ కళ్ళు తెరిచేసరికి పక్కనే కూర్చున్న శ్వేత కనిపించేసరికి, “ఎప్పుడు వచ్చావు? మళ్ళీ వెళ్ళిపోతావా?” అన్నవి ఆదుర్దాగా వాడు వేసిన ప్రశ్నలు.

వెళ్ళనని చెప్పి ఆ రాత్రికి వాడి పక్కలోనే పడుకున్న శ్వేత, ఏ అర్ధ రాత్రో ఎందుకో మెలకువ వచ్చి చూస్తే, నోట్లో వేలు వేసుకుని తదేకంగా తననే చూస్తున్న చిన్నూ. “ఏమయ్యిందిరా?” అంటే, “నిన్ను చూసి చాలా రోజులు అయ్యింది. మళ్ళీ రేపు పొద్దున్న వెళ్ళిపోతావు. అందుకే అలా చూస్తున్నా”నన్న వాడి జవాబుతో నోటి మాటరాదు శ్వేతకి. మర్నాడు ఉదయం ఆఫీసుకు ఫోన్ చేసి శెలవు తీసుకుంటుంది శ్వేత. ఆ రోజంతా తనతోనే అమ్మ ఉంటుందన్న విషయం తెలిసినప్పుడు చిన్నూ మొహంలో

ఒకటే ఆనందం. వాడి ఆనందాన్ని చూసిన శ్వేతకు కన్నీళ్ళు ఆగవు, ఏదో తెలీని ఒక దు:ఖంతో. ఓ పాఠకుడిగా నా కళ్ళలోనూ నీళ్ళు తిరిగాయి ఈ సందర్భంలో.

"వెంటనే ఒక వారం శెలవు పెట్టేసా, ఏమన్నా ఇష్యూస్ ఉంటే ఫోన్‌లోనే రిసాల్వ్ చేస్తా"నని శ్వేత చెబుతూంటే, మీరా కళ్ళమ్మట కూడా ఆగని కన్నీళ్ళు. నా కళ్ళల్లో తిరిగిన నీరు చుక్కల రూపం తీసుకుని జారింది. ఈ కథ మనసుకు బాగా హత్తుకోడానికి కారణం ఇదేననిపించింది. కథకుడిగా రాజా సమీరనందన్ విజయవంతమైంది ఇక్కడే. కథానాయకుడు 'మీరా' కావడం యాదృచ్ఛికం కాదనీ, బహుశా ఇది కథకుడి సొంత అనుభవమే కావచ్చుననిపిస్తుంది.

చిన్నప్పుడు ఎప్పుడో విన్న ఆవు...పులి కథతో ఈ కథాకథనంలో నాటకీయతను సృష్టించగలిగాడు కథకుడు. మీటింగు కోసం బొంబాయి వెళ్ళాల్సి ఉన్నా, ఫ్లైట్ కాన్సిల్ కావడంవల్లనే ఓ సాయంత్రం అనుకోకుండా ఇంటికొచ్చిన మీరాకి కొడుకు చిన్నూ ఆవు బొమ్మ వేస్తూ కనిపిస్తాడు. తన చిన్నప్పుడెప్పుడో ఇంటి పక్క పశువుల కొట్టం దగ్గర తీయించుకున్న ఫోటో లోని ఆవుని చూస్తూ చిన్నూ బొమ్మ గీస్తుంటే, చిన్నప్పుడు ఆవు-పులి కథ విన్నప్పుడు వెక్కి వెక్కి ఏడ్చిన విషయం గుర్తొస్తుంది మీరాకి. అమాంతం చిన్నూగాడ్ని వాటేసుకుంటాడు.

చిన్నూ జ్వరం గురించి, తను శెలవు పెట్టడం గురించి, వాడి ఆనందం, నిద్రపోకుండా తననే చూడ్డం - ఈ విషయాలన్నీ శ్వేత మీరాకి చెబుతూ, కొన్నేళ్ళపాటు తాను ఉద్యోగం మానేద్దామను కుంటున్నానన్నప్పుడు, వెంటనే "డోంట్ బి ఫూలిష్" అని అన్నా, తర్వాత శ్వేత నిర్ణయానికి ఆమోదముద్ర వేస్తాడు మీరా. శ్వేత తనకంటె తెలివైనదని జ్ఞానవంతురాలనీ ఎప్పుడూ అనుకుంటూండే మీరా, వేసిన ఆమోదముద్రతో తాను కూడ తెలివైనవాడినని నిరూపించుకుంటాడు. "నా ఫుల్ సపోర్ట్ నీకే. నీకు మనకి ఏ లోటూ లేకుండా చూసుకునే బాధ్యత నాది" అని ప్రామిస్ చేస్తూ.

ఆవు-పులి కథ విశ్లేషణతో ముగుస్తుంది కథ. దూడకి పాలు ఇచ్చి వస్తానని ఆవు పులిని బతిమాలడం విని తట్టుకోలేక ఏడ్చిన సున్నిత మనస్కుడు మీరా, "మళ్ళీ దూడకి అమ్మ ఎక్కడినుంచి వస్తుంది, పాలు ఎవరు ఇస్తా"రనుకుంటాడు. అయితే తనకి తెలీకుండానే ఉద్యోగం, డబ్బు

సంపాదన, వస్తు సేకరణ వ్యామోహాల్లో పడి తనలోనే ఒక పులిని తయారు చేసుకున్నా ననుకుంటాడు మీరా. కోట్లు వేలల్లా, నెలలు రోజుల్లా మార్చేసిన తనలోని పులిని, ఆవులాంటి తన నిజ స్వభావాన్ని సజావుగా అలానే విడిచిపెట్టమని అర్థిస్తాడు. మరునాడు ఆఫీసుకు సెలవు పెట్టాలని నిర్ణయించుకుంటాడు.

కార్పొరేటు కంపెనీల యాజమాన్యాలకీ, అదే భావజాలంలో కొట్టుమిట్టులాడే ఆ కంపెనీల్లోని ఉద్యోగులకు బహుశా ఇష్టం అవ్వని ఈ కథ, తమదైన జీవితాన్ని అచ్చంగా తమకోసం జీవించాలనుకునేవారికి నచ్చి తీరుతుంది. ముఖ్యంగా చిన్నూల ప్రపంచాల్లోకి తల్లిదండ్రుల్ని జర తొంగి చూడమనే మంచి సందేశాన్నిస్తూ రాసిన కథకుడు రాజా సమీర నందన్ అభినందనీయులు.

(2009 మే, మల్లెతీగ మాసపత్రిక)

కథకుడు : దగ్గుమాటి పద్మాకర్
కథ : ఈస్తటిక్ స్పేస్
ప్రచురణ: ఆదివారం ఆంధ్రజ్యోతి
**10.5.2009**

# హృదయమో ఈస్తటిక్ స్పేస్ స్టేషన్ కావాలి

**ఈ**స్తటిక్ స్పేస్!

ఆడ, మగ ప్రతివారిలోను అవశ్యంగా ఉండాల్సిన ఒక శృంగార రసైక భావన. వ్యతిరేక సెక్సులమధ్య శారీరక, మానసిక సంబంధాల్లో ఉండాల్సిన సౌందర్య రసాత్మకత.

అది లేకపోవడంవల్లనే అయిదేళ్ళ పిల్లల్ని కూడ రేప్‌చేసి పడేసేంతగా మనుషుల్లో క్రూర ప్రవృత్తి నెలకొంటోంది. ప్రేమ ముసుగులో యాసిడ్ దాడులవంటి ఉన్మాద పైశాచిక వికృత చర్యలు చోటు చేసుకుంటున్నాయి. అలాగే ఉపాధ్యాయులు, లెక్చరర్లు విద్యార్థినులను కోరుకోడం, వేదించడం వంటి సంఘటనలూ జరుగుతున్నాయి. పరస్పర అంగీకారం లేకుండా శృంగారం జరుపుకోని జంతుజాతుల కంటె మనిషి నికృష్టుడైపోతున్నాడు. ఎందుకు?

మనుషులకు సాంస్కృతిక విలువల్ని పిల్లల స్థాయినుంచీ నేర్పకపోడంవల్లనే. మంచి

విలువలతో కూడిన కథల్ని సిలబస్‌లో పెట్టి హైస్కూల్ స్థాయినుంచి ఈ విలువల్ని నేర్పకపోడంవల్లనే ఇదంతా ఇలా జరుగుతున్నది. పైగా ప్రపంచీకరణ అంతర్జాతీయ తంత్రమే కానీండి, మరేదైనా కానీండి – చిన్నప్పట్నించీ ఎయిడ్స్ ప్రచారం ఒకటి. కోరికని అదుపులో ఉంచుకునే సంస్కారాన్ని నేర్పాలి చదువు. దాన్ని గాలికి వదిలేసి, "కండోమ్ వేసుకుని స్పెర్మ్‌ని బ్లాక్ చేయడమే పరిష్కార"మంటూ, నిగ్రహాన్ని సర్వనాశనం చేసే ఒక కుతంత్రం యథేచ్ఛగా ప్రభుత్వపాలసీగా జరిగిపోతూ ఉండడంవల్ల కలుగుతున్న అనర్థం – సెక్స్ అనేది చాలా అతిసహజమైన ఒక విషయంగా లేలేత బుర్రల్లోకి బలమైన అభిప్రాయంగా పాతుకుపోతున్నది. దీనికి సాయం, వ్యాపార ప్రకటనలు. "వందలకొద్దీ ఆడాళ్ళ శరీరాల నునుపు, వంపులు ప్రకటనల్లో పదేపదే కనబడుతుండటంతో శరీరాల రాపిడికి ఎవరైనా ఒకటేనన్న యావ, ఆఖరికి ఇంటలెక్చువల్స్‌కీ సహజమైపోయింది. పిల్లల పుస్తకాల బ్యాగుల్లో కండోమ్ ఉంచుకోవాలని జరుగుతున్న ప్రచారం ఎటువంటిది? వివాహేతర లైంగిక కలయికల్ని నిరోధించడానికి సంస్కారానికి మించిన కండోమ్ ఉంటుందా?

స్పేస్‌లో స్టేషను నిర్మించి నివాసం ఉండబోతున్న మనిషి, తనలో దాగి ఉన్న ఈస్తటిక్ స్పేస్ విలువని గుర్తించలేకపోతున్నాడు. శృంగార అనుభవాలను నెమరువేసుకోలేక, దానిని నేర్చుకోలేక పశువుకంటె హీనాతి హీనం అయిపోతున్నాడు మనిషి.

మనుషుల శారీరక మానసిక సంబంధాల్లోని సౌందర్య రసాత్మకతని సౌందర్యాత్మకంగా ఆవిష్కరించిన కథ దగ్గుమాటి పద్మాకర్ రాసిన 'ఈస్తటిక్ స్పేస్'. 10 మే, 2009 ఆంధ్రజ్యోతి ఆదివారం అనుబంధంలో వచ్చిందీ కథ.

లలిత, రవిబాబు ఒకే కాలేజీలో సహాధ్యాపకులు. విద్యార్థిదశలో లెఫ్ట్ ఉద్యమాల్లో పనిచేసిన అనుభవాలు, సాహిత్యం పట్ల ఆసక్తి వంటి ఉమ్మడి ఆదాన ప్రదాన విషయాలతో ఇద్దరూ మంచి స్నేహితులవుతారు. వారి పరిచయానికి ముందే భర్తను కోల్పోయిన లలితకు , భార్య అకస్మాత్తుగా చనిపోడంతో ఆ విషయంలోనూ సముడవుతాడు రవిబాబు. రవిబాబు భార్య పోవడానికి ముందులానే ఆ తరువాత కూడ వాళ్ళిద్దరూ సాయంత్రం పూటలు హోటల్‌కు వెళ్ళి భోజనంచేసి ఎవరిళ్ళకు వాళ్ళు వెళ్ళడం చేస్తూనే వచ్చారు – ఎప్పుడూ అలవాటైనదే. వాళ్ళు కలిసి

గడిపిన ప్రతిసందర్భంలోను ఏదో సాహిత్య చర్చో, సామాజిక విశ్లేషణో,రాజకీయాలో, సినీమాలో చర్చకు వచ్చేవికాని, ఎప్పుడూ వాళ్ళ విషయం గురించి మాట్లాడుకున్నదే లేదు.

అలాంటి నేపథ్యంలో ఒకరోజు లలిత ఇంట్లో రవిబాబు వెలిబుచ్చిన కోరిక ఆమెను స్థాణువును చేస్తుంది. రవిబాబుకు అలా అడిగేంత చనువును తానే ఇచ్చిందా? లేకపోతే తనే అతి చొరవ తీసు కున్నాడా? అదీ కాకపోతే అది అతనికి క్షణికంగా కలిగిన బుద్ధా? తర్కించు కుంటూ లలిత అచేతనంగా ఉండిపోతే, భయపడిన రవిబాబు ఆమెను భుజాలు పట్టుకుని కుదుపుతాడు. ఈ లోకంలోకి వచ్చిన లలిత, అతని చేతిని విదిలించివేస్తూ అతని చెంప వాయిస్తుంది. రవిబాబు తనను కుదపడాన్ని మరింత చొరవ తీసుకోడంగా భావిస్తుందామె. అదికాదనీ, పొందిన షాక్‌నుంచి ఆమెను బయట పడేసేటందుకే తానలా ప్రవర్తించానని సంజాయిషీ ఇస్తాడు రవిబాబు. ఆమె అదేమీ పట్టించుకోకుండా, కోపంతో ఊగిపోతూ, “నాలో ఏం కోరుకుంటున్నావు నువ్వు? ఇడియట్! ఈ శరీరాన్నే కదా! అసలు నీ ఉద్దేశ్యం ఏమిటి? నా బాధ తీర్చాలనా? నీ బాధ తీర్చుకోవాలనా? ప్రతి బాధనీ తీర్చేసుకో వలసిందేనా? మొయ్యలేవా? బాధ నీ శరీరానికా? నీ మనసుకా? కంట్రోల్ లేదా?” అంటూ అతన్ని బలవంతంగా వెళ్ళగొడుతుంది.

అయితే – మరుసటి రోజు రవిబాబు చూపిన ఆపేక్షకు తనలో ఏమీ మిగుల్చుకోవాలనిపించని ఒకానొక బలహీనమైన క్షణంలో తనను తాను అర్పించుకుంటుంది లలిత. అంతా అయ్యాకా ఇద్దరూ తర్కించుకుంటారు.

ఎక్కడో తనలో గూడు కట్టుకున్న ఒంటరితనంనుంచి ఏర్పడ్డ ఆమె సానుకూలతలోంచే అదలా జరిగిపోయిందిగానీ, యావ కాదంటాడు రవిబాబు. సంస్కారవంతమైన స్నేహితులుగా మిగిలిపోదామంటాడు. బదులుగా లలిత అంటుంది– ఆ క్షణంలో తాను ఇచ్చిన ముద్దు అతను చూపిన ఆపేక్షకు గిఫ్ట్‌గా మాత్రమే ఇచ్చాననీ, అతని ప్రతిచర్యకు అడ్డు చెప్పకపోవడాన్ని సానుకూలతగా భావించిన రవిబాబును దూషిస్తూ, “ఎంతైనా నువ్వూ మగాడివేగా! నువ్వలా అనుకుంటే నాకు నష్టమేం లేదుగాని, నేనంటే నీకు గౌరవం పోతుందంతే. అప్పుడు స్నేహమూ పోతుం”దంటుంది. జ్ఞానోదయమైనవాడిలా తన తలమీద రెండు

మొట్టికాయలు వేసుకుని, "అర్ధమైంది...అర్ధమైంది" అంటాడు తల తిప్పుతూ రవిబాబు. చిన్నగా నవ్వుతూ, "దట్స్ గుడ్" అంటుంది లలిత.

తరువాత వాళ్ళిద్దరూ మళ్ళీ శారీరకంగా కలుసుకున్నారా? శారీరకేతరమైన సంబంధాన్ని మించింది వాళ్ళిద్దరి మధ్యా ఏమీ లేదా? అలాంటి ప్రేమపూర్వకమైన సమాగమ మేదైనా వారిమధ్య తరువాత జరిగిందా? – ఇన్ని ప్రశ్నలు పాఠకుడి మెదడులో పురుగులై దొలుస్తుంటే– "కొన్ని సంగమాలు కంటి చూపుతో ముగుస్తాయి... ఇంకొన్ని కరచాలనంతోనో, కౌగిలింతతోనో ముగియవచ్చు... మరికొన్ని శరీరంలోని అణువణువు ఈస్తటిక్ స్పేస్ లోపల ఐక్యం కావడంతో ముగుస్తుంటాయి. అది వాళ్ళిద్దరికీ మాత్రమే సంబంధించిన వ్యవహార"మన్న ముగింపుకు పెళ్ళి చేసుకోవాలా వద్దా అన్నది కూడా వాళ్ళిద్దరికీ మాత్రమే సంబంధించిన వ్యవహారమన్న ముక్తాయింపునిస్తారు కథకుడు దగ్గుమాటి పద్మాకర్. తన పాత్ర మానసౌన్నత్యాలను వివరించే మరికొన్ని సంఘటనలతో కథను ఆద్యంతం రక్తి కట్టించారు. రెండు పాత్రలపట్లా పాఠకుడికి సాఫ్ట్ కార్నర్ ఏర్పడుతుంది. అలా శిల్ప చాతుర్యంతో చక్కగా కథనాన్ని నడిపారు.

స్త్రీ పురుష సహబాంధవ్య పరంగా మానవ ప్రస్థానం చాలా దూరం ప్రయాణించింది. ఈ ప్రయాణంలో అనేకానేక సంఘటనలు దొర్లాయి. వాటిని అనుభవంలోకి తెచ్చుకోడం, వాటి తీవ్రతకి కలత చెందడం, కన్నీరవడం, హృదయం తడి కావడం వంటి ఉద్విగ్నతలకు లోను కానటు వంటి ఒకానొక సందర్భంలో ఉన్నాడు మనిషి ఈ రోజు. కనుల ఎదుట జరిగేదాన్నంతా లోపలికంటా స్వీకరించడానికి, స్వీకరించినదానితో సంఘర్షించడానికి, ఆ సంఘర్షణనుండి ఆ జీవన సమయాల్ని అంచనా వేయడానికి, విశ్లేషించడానికి మధ్య మనిషి తననుంచి తానే విడిపోతున్న దశ ఇది – తనని తానే ప్రేమించుకోలేని దశ. హృదయగతమైన ఒక శూన్యం. ఈ శూన్యంనుంచి విడివడడం కోసం... తనను తాను విముక్తం చేసుకోడం కోసం సౌకుమార్యమైన సౌందర్యంతో జీవన పయనాన్ని కలగంటూ, దానికి సాధనంగా స్త్రీని ఒక పనిముట్టుగా చేసుకున్నాడు.

"స్త్రీకి కూడ శరీరముంది. దానికి వ్యాయామం ఇవ్వాలి" అన్నారు చలం. అలాగే స్త్రీకి కూడ ఒక హృదయముంది. ఆ హృదయానికీ అనుభవాలుంటాయి. అనుభూతులుంటాయి. ఆ స్పందనల్నీ పరిగణనలోకి తీసుకోవాలన్న ఇంగితాన్ని మరచాడు మనిషి. తన కన్నీళ్ళను కరుణతో,

ప్రేమతో తుడిచే దయార్ద్రపూరితమైన చేతుల ముఖాల్ని చూసే చూపులు ఎలాగుంటాయి? ఒక్కోసారి స్త్రీలపట్ల కరుణను చూపుతున్నా...గుర్తుకు వచ్చినపుడు వారి సాధికారత గురించి మాట్లాడుతున్నా... అంతర్లీనంగా స్త్రీపట్ల శృంగార భావనకే మొగ్గు చూపుతున్నాడు మనిషి. స్త్రీని ఒక అవయవంగా చూసే చూపునుండి విముక్తుడు కాలేదింకా!

స్త్రీల దు:ఖాల్నీ సంతోషాల్నీ... వారి అనుభవాల్నీ అనుభూతుల్నీ.... సర్వమైన భావప్రభావాల్నీ రొమాంటిసిజం అద్దంలోంచే చూస్తున్నాడు. అలా చూడటంనించే స్త్రీపట్ల ఉన్న కరుణాహ్లాద మనోవృత్తి కాస్తా శరీర వాంఛగా మారుతూ మనిషినో భ్రష్టజీవిగా చేస్తోంది. పశువుకన్నా కనిష్టంగా మారుస్తోంది.

దీనినుంచి తప్పించుకోడం కోసమే మనిషి తన హృదయాన్ని ఒక ఈస్తటిక్ స్పేస్ స్టేషన్‌గా మార్చుకోవాలి, అంటున్నారు పద్మాకర్.

ఈస్తటిక్ స్పేస్ అనే భావన మనసులను, తద్వారా ఆ మనసులు కలిగిన మనుషుల్ని సున్నితపరుస్తుంది. అందువల్ల ఈ భావన గురించి కొంచెం నాకు తెలిసున్నది చర్చించి ఈ వ్యాసం ముగిస్తాను.

ప్రాపంచిక మౌలికధర్మం సౌందర్యగతమని ఆల్ఫ్రెడ్ నార్త్ వైట్‌మాన్, గ్రెగొరీ బేట్సన్, జేమ్స్ హిల్మాన్, మార్టిన్ ఫాస్, డొనాల్డ్ మినికాట్ వంటి తత్త్వవేత్తల అభిప్రాయం. స్పేస్ అంటే అంతరాళం. ఈస్తటిక్ స్పేస్ అంటే స్థూలంగా సౌదర్యాంతరాళం అనుకోవచ్చు. అదే సౌందర్యం కోసం అంతరాళం.

అందమైన వస్తువో, మనిషో, ప్రకృతో లేదా మనిషి ప్రకృతో మన కళ్ళెదుట పడ్డప్పుడు, ఓసారి అలా ఆగి కాస్తంత గమనించి దానికో మెచ్చుకోలు పడేసి అప్పుడు మన సౌందర్యాంతరాళంలోకి ప్రవేశిస్తాం. దీన్నే మనసుపై ముద్రవేయడం అనొచ్చు. అంటే అది మనసులో స్థిరమై నాటుకుపోతుందన్న మాట. కిమ్ హెర్మన్సన్, తన పుస్తకం 'Getting Messy : A Guide to Taking Risks and Opening the Imagination'లో ఇదంతా చర్చించాడు. Embodying Beauty : Twentieth-century American Women Writers' Aesthetics అనే పుస్తకంలో ఈస్తటిక్ స్పేస్ మీద వచ్చిన రెండు కథల చర్చ ఉంది. 'అమెరికా! అమెరికా!', 'ఏ కంపారిజన్' అనేవి ఆ రెండు కథలు.

'అమెరికా! అమెరికా!'లో ఓ పబ్లిక్ స్కూల్లో చదువుకుంటోన్న ఓ

టీనేజీ అమ్మాయి జీవనశకలం ఇతివృత్తం. ఆమె దృష్టికోణాన్ని లైంగికాసక్తుల నేపథ్యంలో చర్చిస్తుంది. పిచ్చిపట్టిన టీనేజీ వ్యావహారిక సత్తావాదిగా ఆమె ప్రవర్తిస్తుంది. 'Athing of Beauty is Joyous 'అన్నారు కీట్స్. ఈ సౌందర్య సమీకరణాన్ని ఆ అమ్మాయి 'Beauty is Truth / Truth, Beauty 'గా పునర్నిర్వచిస్తుంది.

అయితే, పద్మాకర్ ఈస్తటిక్ స్పేస్ భావనను ఒక పాజిటివ్ దృక్కోణంలోంచి చూసి కథ రాయడం ముదావహం.

(ఆగస్ట్ 2009, మల్లెపందిరి)

కథకులు : అవసరాల రామకృష్ణారావు
కాటూరి రవీంద్ర త్రివిక్రమ్
కథలు : ఎవరితోనన్నా లేచిపోరాదూ?!
ఎవరితో లేచిపోనూ?
ప్రచురణ : చినుకు, జూన్ 2000

# జానకి విముక్తి కోసం సావిత్రి కనుగొన్న యుక్తివిలాసం

"ప్రపంచ సాహిత్యంలో లేఖాసాహిత్యానికి ఒక ప్రత్యేకమైన స్థానం ఉంది. సంప్రదాయ సాహిత్యంలో కంటె లేఖాసాహిత్యంలోనే గొప్ప కథలు వెలువడ్డాయి" అంటూ, సుమారు 35 సం॥ క్రితం, అంటే క్రిందటి శతాబ్ది 70ల్లో జ్యోతి మాస పత్రిక దీపావళి ప్రత్యేక సంచికలో వచ్చిన అవసరాల రామకృష్ణారావు కథ 'ఎవరితోనన్నా లేచిపోరాదూ?'ను పునఃప్రచురించింది, జూన్ 2000 సంచికలో చినుకు సాహిత్య మాసపత్రిక.

మంచి కథ, ఆణిముత్యాలు వంటి శీర్షికలతో ఒకప్పటి కథల్ని ప్రచురించడం పత్రికలకు ఆనవాయితీయే అయినా, ఈ కథ ప్రచురణ విషయంలో మరో విశేషాంశం ఏమిటంటే, అప్పట్లో ఎందరినో కదిలించిన అవసరాలవారి కథను చదివి, కొనసాగింపుగా కలాన్ని కదిలించి మరో కథకులు కాటూరి రవీంద్ర త్రివిక్రమ్ రాసిన కథ, 'ఎవరితో లేచిపోనూ?'

అన్నదానిని కూడ కలిపి ప్రచురించడం. కాటూరివారి కథ విద్యుల్లత మాస పత్రికలో ప్రచురింపబడింది. ఎప్పుడు ప్రచురింపబడిందో వివరాలు ఇవ్వలేదుగాని, కాటూరివారి కథ అవసరాలవారి కథలోని ఆలోచనకు కొనసాగింపుగా పదునుదేరింది. లేచిపోక తప్పనిసరి పరిస్థితుల్లో స్త్రీ ప్రస్థానంలో పరిణామం కాలానుగుణంగా మారిన వైనాన్ని ఈ రెండు కథల్లో చూస్తాం. 7వ దశకంలోని (70వ దశకం అనడం తప్పు) అవసరాలవారి 'జానకి' ఆ ఆలోచనే చేయలేకపోతే, కాటూరివారి జానకి చేయగల్గుతుంది. ప్రియ స్నేహితురాలి అవసరాన్ని అవసరాలవారి సావిత్రి గుర్తించగల్గింది. బహుశా కాటూరివారి సావిత్రి తనే పెద్దరికం వహించి, జానకీ రాముల్ని ఒకటి చేసే చొరవ తీసుకోవచ్చు. ఈ విధంగా పరిణామ దృక్పథంలో (బహుశా అప్పట్లోనే రాసినా) ఒక అడుగు ముందుకు వేయించారు స్త్రీచేత కాటూరివారు.

ఒక తరం అందించిన ఆలోచనని అందుకొని దానికి కొనసాగింపుగా ప్రస్థానించడంలోనే మానవ ప్రగతి నిక్షిప్తమౌతుంది. ఒక తరమంటే దాదాపుగా ఇరవై ఏళ్ళు. అవసరాలవారి కథను చదివిన అనతి కాలంలోనే ఆలోచనను ఓ తరపు నిడివికి కొనసాగించడమే కాటూరివారి ప్రయోగ వైచిత్రి. ఏముందీ?! ఒక కథను చదివిన తర్వాత కొనసాగింపుగా మరో కథను రాయడమే కదా జరిగింది అనిపించవచ్చు స్థూలదృష్టికి. కాని అలా రాయాలంటే రచయిత ఆ కథనీ, కథలోని పాత్రల మనస్తత్వాన్నీ నరనరాల్లోను జీర్ణించుకోవాలి. ఆయా సందర్భాల్లో ఆయా పాత్రలు ప్రవర్తించగల, ప్రదర్శించగల తీరుల్ని ఆకళింపు చేసికోవాలి. అప్పుడుగానీ అటువంటి ప్రయోగం విజయవంతం కాదు. పైగా మొదటి రచయిత శైలినీ, శిల్పాన్ని, రచనాక్రమాన్ని తనదిగా చేసుకుని రాయకపోతే, రక్తి కట్టదు. ఫలితంగా ప్రయోజనం మొదటికే బెడిసికొడుతుంది. అయితే ఈ విషయంలో కాటూరివారు పూర్తిగా విజయవంతమయ్యారు.

జానకి, సావిత్రి ప్రాణ స్నేహితురాళ్ళు. దాదాపు పదిమంది సభ్యులున్న కుటుంబ భారాన్ని యావత్తూ తన భుజాలపై మోస్తూ పెళ్ళి ఆలోచనే లేకుండా మోడువారిపోయిన వృద్ధకన్యాత్వ జీవితం జానకిది. కుటుంబ నిర్వహణ క్రమంలో తనకెదురైన బాధల్నీ, మనస్తాపాల్నీ ఎవరికైనా వివరించి చెప్పుకుందుకు ఆ కుటుంబంలో ఒక్క వ్యక్తిని కూడ పొందలేని శాపగ్రస్తురాలు ఆమె. అందుకే తన బాధలను వివరిస్తూ ఏకైక ప్రాణ

స్నేహితురాలు సావిత్రికి ఉత్తరాలు రాస్తుంటుంది జానకి. అలా రాసుకోడంలోనే ఏదో కొంత ఊరట పొందుతుంటుంది. ప్రత్యుత్తరాలుగా నాలుగు ఉపశమన వాక్యాలు రాస్తుంటుంది సావిత్రి. అయితే జానకి పరిస్థితి చివరికి మరీ దయనీయమైపోయిన సందర్భంలో జానకికి సావిత్రి రాసిన సుదీర్ఘమైన లేఖ అవసరాలవారి 'ఎవరితోనైనా లేచిపోరాదూ!' కథ. పోయిన శతాబ్ది డెబ్భైల్లో బహుశా ఎవరినైనా లేచిపొమ్మని చెప్పడం బరితెగించడమే కావచ్చు. అటువంటి సాహసం చేశారు అవసరాల. అయితే జానకి పరిస్థితి అలాంటిది. కుటుంబ నిర్వహణలోనే... చెల్లెళ్ళనీ, తమ్ముళ్ళనీ ఉద్ధరించి వారికో పదిలమైన స్థానాల్ని కల్పించడంలోనే కర్పూరమై కరిగిపోయినా, వారినుంచి ప్రతిఫలంగా ఏమీ పొందని... కనీసం సాను భూతికైనా నోచుకోని శాపగ్రస్తయై జీవితంలో కరడుగట్టిన ఒంటరితనమే తోడుగా మోడువారిపోయిన విధివంచితురాలు. ఆమె దయనీయమైన పరిస్థితినుంచి విముక్తి కోరుతూ, అటువంటి జానకికి 'ఎవరితోనైనా లేచి పోరాదూ?!' అని సూచిస్తుంది సావిత్రి. ఈ సూచన సావిత్రి ఆలోచన నుంచి అకస్మాత్తుగా ఊడిపడింది కాదు. ప్రాణనెచ్చెలి జీవితం ఎందుకూ కొరగానిదైపోయిన నేపథ్యంలో, ఆమెకు తనేమీ చేయలేకపోతున్నాననే గుండెకోత కలిగించిన ఒకానొక తీవ్రమైన మథననుంచి పుట్టుకొచ్చిన ఆలోచన ఇది.

అటువంటి విప్లవాత్మకమైన సూచనను జానకికి ఇవ్వడానికి సావిత్రి సంసిద్ధమైన క్రమాన్ని అద్భుతంగా చిత్రించారు అవసరాల రామకృష్ణారావు. జానకి ఎన్నో ఉత్తరాలు రాసింది సావిత్రికి. వాటికి అప్పట్లో తనకు తోచినట్లు ఊరడింపుగా ప్రత్యుత్తరాలిచ్చేది సావిత్రి. అయితే జానకినుంచి 'నిన్ననే' అందిన ఉత్తరం సావిత్రిని కుదురుగా ఉండనీయదు. నిద్రకు వెలిని చేస్తుంది. అయితే నిజానికి సావిత్రి ఎన్నో రోజులనుంచీ ఆలోచిస్తూనే ఉంటుంది, జానక్కి ఏదోక మార్గం చూపించాలని. ఆ పరిస్థితుల్లో తనే ఉంటే ఏం చేస్తానా అని కొట్టుకుపోతుంది. అంతకుముందే ఎన్నోసార్లు తన ఉత్తరాల్లో జానకి తనగురించి తానే ఆలోచించుకోవాలని చెబుతుంది సావిత్రి. అయితే, జానకి ఓ పేద్ద త్యాగమయిగా తనను తానే అనుకుంటూ మూర్ఖంగా అలానే ఉండిపోతుంటే, విసువు చెంది ఆమెకు ఉత్తరాలు రాయడం కూడ మానేసిన పట్టుదల, ఒక్కసారిగా పటాపంచలై ఈ "ఉత్తరంలోనైనా తన మనసుని పూర్తిగా నిష్కర్షగా చెప్పగలిగే శక్తినిమ్మని భగవంతుని ప్రార్థిస్తూ"... ...

ప్రత్యుత్తరమిస్తుంది. జవాబు రాయడానికి ముందుగా పాత ఉత్తరాల కట్ట నుంచి జానకి ఉత్తరాలు తీసి చదివి, వాటిలో చాలా ముఖ్యమైన మూడు ఉత్తరాలను ఎంపిక చేసుకుని, వాటిలో జానకి రాసిన విషయాలను గుర్తుచేస్తూ, ఒక క్రమగతమైన తార్కిక ఆలోచనగా తన అభిప్రాయాన్ని జానక్కి తెలుపుతుంది సావిత్రి.

ప్రాణ స్నేహితురాలిగా సావిత్రి పాత్రను అద్భుతంగా చిత్రించారు అవసరాలవారు. మనుషులు కష్టమైనా, సుఖమైనా తమ ధోరణుల్లో తాము పోతూ ఉంటారు. కష్టాలకోసమే తాను పుట్టినట్టూ, పరంపరగా కష్టాలను అనుభవిస్తూ అదే లోకంగా కొట్టుకుపోడం జానకి పాత్రలో చూస్తాం. సుఖాలైనా సరే, భోగలాలసతో సాధ్యమైనంత ఆనందాన్ని, కొత్తకొత్త అనుభవాన్ని పొందాలనే ఆరాటంలో జీవితాన్ని విచ్చలవిడిగా అనైతికం చేసుకునేవాళ్ళూ ఉంటారు. ఈ రెండు స్థితులూ పరస్పర విరుద్ధాలు. మొదటి స్థితిలో మనిషి తనగురించి తాను లేశమైనా ఆలోచించుకోకుండా గానుగెద్దులా, శ్లేష్మంలో పడ్డ ఈగలా, అదే ధోరణిలో కొట్టుకుపోతూ ఉంటాడు. పైగా తాను చేస్తున్న దానికి కనీస బాధ్యతని పేరు తగిలించి ఒక త్యాగమయిగా, అనురాగమయిగా ఆత్మానందం పొందుతూ తనదైన జీవితాన్ని హరించేసుకుంటాడు. ఈ స్థితినే జానకి పాత్రద్వారా చిత్రించారు అవసరాల.

ఇక రెండో పద్ధతిలో మనిషి వేరెవ్వరి కోసమూ ఆలోచించకుండా కేవలం తన సుఖం, తన సౌఖ్యం, తన ఆనందం, తన సంతోషాల గురించే ఆలోచిస్తూ, దానికి ఇతరుల సుఖసౌఖ్యాల్నీ, ఆనంద సంతోషాల్నీ బలి చేసైనాసరే, సాధించుకోజూస్తాడు. ఈ అంశం కథలో లేకపోయినా, చెప్పడమెందుకంటే, ఈ రెండు స్థితులూ అవాంఛనీయాలే. ఇటువంటి స్థితుల్లో నిజమైన స్నేహం – ఆ పరిస్థితిని తనదిగా భావించి, అందులోని కష్టనష్టాల్ని తనవిగా మమేకమై వ్యథ చెంది ఆర్తితో సక్రమ మార్గంలో పెట్టడానికి ప్రయత్నం చేస్తుంది. ఆ పనినే సావిత్రి ఎంతో నేర్పుతో చాక చక్యంగా చేయగల్గుతుంది.

ఉత్తరాల్లో జానకి చెప్పుకున్న తన దయనీయ గాథలనే ఉటంకిస్తూ, అప్పటివరకు సాగిన జానకి జీవితక్రమాన్ని అద్భుతంగా విశ్లేషిస్తుంది సావిత్రి. జానకి వాళ్ళింట్లో అందరూ స్వార్థపరులంటుంది. వాళ్ళందరికీ జానకి డబ్బు కావాలి. ఆమె సేవలు కావాలి. కాని ఎవరికీ ఆమె గురించి,

ఆమె జీవితం గురించి పట్టదు.

ఇక జానకి విషయానికొస్తే, కుటుంబంలో ప్రతి ఒక్కరూ ఆమెగురించి ఒక 'మంచిమాట' అనుకోవాలి. ఆమె ఎంత నిస్వార్థ త్యాగో గుర్తించాలి. ఆడపిల్లయినా బరువుబాధ్యతల్ని (ఇప్పటి దృష్టితో దయచేసి ఎవరూ ఆలోచించవద్దని మనవి) స్వీకరించి ఆత్మార్పణ చేసుకుందనే మన్నన కావాలి. ఇవన్నీ కోరుకునే జానకి కూడ ఒక రకంగా స్వార్థపరురాలే అంటుంది. ఆ స్వార్థంలోనే తనను తాను కర్పూరంలా హరించుకుంటూ, కూడని బాధ్యతని నెత్తిన వేసుకుని, తగని హోదాని స్వీకరించి ఇంటిల్లిపాదినీ బద్ధకస్తులుగా, సోమరిపోతులుగా జానకే చేసిం దంటుంది. ఇదంతా జానకి తాను చేసుకున్న 'ఆత్మవంచన' ఫలితమేనంటుంది. తన త్యాగాల్ని గుర్తించారనుకున్న తండ్రీ, చిన మేనత్తా చనిపోయాకా, ఇంకెవరూ ఆ ప్రయత్నం చేయకపోగా నిరాశ చెంది ఆఖరికి తన త్యాగాల్ని స్నేహితురాలైనా గుర్తించాలని కోరుకుంటూ, జానకి తనకు ఉత్తరాలు రాసిందని అభియోగిస్తుంది సావిత్రి. ఇలా "ప్రతిఫలం ఆశించేది త్యాగం కాదుగనుక, సాధారణమైన బలహీనతలున్న సామాన్యమైన స్త్రీగానే" జానకిని తాను గుర్తిస్తున్నానంటూ కుండ బద్ధలుకొడుతుంది. ప్రాణ స్నేహతురాలైన తనకు పంచిపెట్టాల్సింది దు:ఖం ఒకటేనా అని ప్రశ్నిస్తుంది. నిత్యమూ "నన్నెవరూ గుర్తించడంలే"దనుకుంటూ చింతిస్తూ కళలేని మొహంతో పిల్లలకు పాఠాలు చెప్పే అర్హతను (జానకి సైన్స్‌టీచర్‌గా ఉద్యోగిస్తుంటుంది) కోల్పోయావంటుంది.

చివరకు తన మనసునెంతో కట్టుదిట్టం చేసుకుని ఇన్ని కఠినమైన మాటలు (నిజం నిప్పులానే ఉంటుందంటూ) రాశాననీ, "మనస్సుకి తృప్తి లేని మానవమాత్రుడు మానసిక భ్రమలో పడి, ఎవరికో కాదు–తనకి తానే–ఎంత అపకారం చేసుకుంటాడో రుజువు చెయ్యడం" ఇప్పటికైనా మానుకొమ్మని హెచ్చరిస్తూ, వీలయినంత తొందరలో ఎవరినైనా పెళ్ళి చేసుకొమ్మని, సుఖించి తృప్తిపడి, ఆ తర్వాత ఎవరి గురించైనా ఆలోచించమని హితవు చెబుతుంది సావిత్రి. ఒకవేళ పెళ్ళివయసు దాటి పోయిందని అనుకుంటే, మరో పద్ధతి ఉందంటూ, "పెళ్ళయిన వాళ్ళందరూ బాగుపడనూలేదు, లేచిపోయిన వాళ్ళంతా చెడిపోనూలేదు. ఏమంటావ్?" ఆలోచించంటూ పరోక్షంగా యోగ్యుడైన ఎవరితోనైనా లేచిపొమ్మని జానక్కి సలహా ఇస్తుంది సావిత్రి.

ఇదీ అవసరాలవారి కథ. కథ పూర్తయ్యేసరికి జానకి ఎవరితోనైనా లేచిపోవాలనుకోదు. అసలా ఆలోచనే ఆమెకు ఉండదు. ఆమెకా ఆలోచనని కలిగించారు కాటూరి రవీంద్ర త్రివిక్రమ్, కొనసాగింపుగా రాసిన 'ఎవరితో లేచిపోనూ?' కథలో.

ఉత్తరం చదివిన జానకి అపరాధ భావనతో కుమిలిపోతూ తన అవివేకాన్ని, అసమర్థతని అర్థం చేసుకుంటుంది. సావిత్రి ఉత్తరంలోని ముగింపు ప్రశ్న, తోకమీది పాములా ఆమె ముందు నిల్చుంటుంది. తనకు తానుగా, తనగురించి తానుగా ఆలోచించడం నేర్చుకుంటుంది జానకి. జీవితంలో తనకెదురైన రెండు మూడు కేసుల్ని అవలోకించుకుంటుంది. తమ ఇంటిపక్కనే ఉన్న ఓ మధ్యతరగతి కుటుంబంలోని ముగ్గురాడపిల్లల్లో పెద్దపిల్ల ఎవరితోనో లేచిపోయి, మూడ్నెళ్ళకి చిరిగిపోయిన విస్తరిలా ఇంటికొస్తే... తల్లిదండ్రుల ఆదరణకు నోచుకోక మర్నాటి ఉదయం రైలు కిందపడి తునాతునకలవుతుంది. లేచిపోయే జీవితాలు తునాతునకలు అవుతాయనే అంటుంది జానకి, "లేచిపోయిన వాళ్ళంతా చెడిపోలేదన్నావు. నిజమే కావచ్చు. అలాగని అంతా బాగున్నారని కూడా అనుకోలేం" అంటుంది.

దురదృష్టజీవి జానకి. ఆమెకన్నీ గొప్ప కేసులు తగులుతాయి. బదిలీమీద తన పాఠశాలకు వచ్చిన ఇంగ్లీష్ టీచర్ "కాస్త ఎక్కువగా చొరవ చూపి", "మీకభ్యంతరం లేకపోతే మిమ్మల్ని పెళ్ళి చేసుకుంటా"నంటాడు. తీరా ఆరా తీస్తే, అతనికప్పటికే పెళ్ళయి ఇద్దరు పిల్లలున్నారు. "ఇలా ఉన్నారు మనుషుల్లో తోడేళ్ళు" అంటుంది జానకి. మరో కేసు– భార్య చనిపోయి రెండో పెళ్ళికి సిద్ధమైన ఇన్సూరెన్స్ ఉద్యోగి ఒకడు తారసపడితే, రెండో పెళ్ళివాడికైనా సిద్ధపడ్డ తనకు తెలిసిన విషయం, సదరు ఇన్సూరెన్స్ ఉద్యోగి తాగుణ్ణీ వ్యభిచారాన్నీ ఇన్స్యూర్ చేసుకున్నాడని. ఇలా అందరికీ ఇంటూలు పెట్టుకుంటూపోడం తన అభిమతం కాదని, మరీ ఇటీవలనే ఎదురైన మరో కేసుగురించి చెబుతుంది. ఎదురింట్లో అద్దెకు దిగిన, తనకంటే ఐదేళ్ళు చిన్నవాడైన శ్రీరామ చంద్రమూర్తి. జానకి జీవితంలో 'మొదటి ప్రేమలేఖ'ను అందిస్తాడు. లేఖ సారాంశం – "రాముడికన్నా జానకి పెద్దది. ఇద్దరూ ఆదర్శ దంపతులైనారు. మీకిష్టమైతే మనం కూడా కావచ్చు"నంటాడు. (పేర్లు కూడ బలే కలిశాయి మరి) మళ్ళీ మళ్ళీ సావిత్రి ఇచ్చిన 'స్నేహ సందేశం' చదువుకుంటున్న జానకి అనివార్యంగా

ద్వైదీభావంలో పడుతుంది. "ఏం చెయ్యమంటావు?" అని సావిత్రికే ఉత్తరం రాసి అడుగుతుంది. కథ ముగుస్తుంది.

జానకి కష్టాలు చదువుతుంటే త్రేతాయుగంలో అష్టకష్టాలు పడ్డ ఆ జానకే గుర్తొస్తుంది. అటువంటి జానకికి 'శ్రీరామచంద్రుడు' తారసపడ్డం కాకతాళీయం కాకపోవచ్చు, బహుశా. విధి దరిజేర్చిన జీవన సహచరుడు కావచ్చు. ఈ విధంగా ఆశావహంగా కథను ముగిస్తూ, జానకి ఆలోచనలకు రెక్కలు పొదువుతారు రవీంద్ర త్రివిక్రమ్. జానకి భావితరం ఆలోచనను అందిపుచ్చుకుని, అప్పటివరకు గాలివాటున కొట్టుకుపోయిన తన జీవితంలో ఒక దృఢమైన, తనదైన అడుగు వేసి ఉంటుందని భావించవచ్చు.

వృద్ధకన్యలు సమాజంలో అక్కడక్కడా తారసపడుతుంటారు. జీవితంలో వారు పొందే కష్టాలు, చేదైన అనుభవాలు ఎలా ఉంటాయో తెలియజేస్తూ, అన్నీ బాగుండి యోగ్యుడెవడైనా తారసపడితే 'లేచిపోవచ్చు'నని అవసరాలవారు ప్రతిపాదిస్తే, దాన్ని ఖరారు చేశారు రవీంద్ర. వృద్ధకన్యాత్వ నేపథ్యంలో వచ్చిన ఈ రెండు కథలూ, ఆ సమస్యకు అనివార్యమైన పరిష్కారాన్ని సూచించాయనే చెప్పాలి. వృద్ధకన్య జానకి విముక్తి కోసం సావిత్రి కనుగొన్న యుక్తివిలాసం ఈ కథల సారాంశం.

ఒక కథకి మరో కథను ప్రయోగ వైచిత్రిగా రాసిన రవీంద్ర త్రివిక్రమ్ ప్రయత్నం శ్లాఘనీయం. రెండు కథల్నీ ఒకేచోట ప్రచురించి పాఠకుల ఆలోచనకు తావు కల్పించిన 'చినుకు'కు అభినందనలు.

(సర్కార్ ఎక్స్‌ప్రెస్, 11-09-2006, మంగళవారం)

కథకుడు : యస్వీ. కృష్ణ
కథ : కడలి కెరటం
ప్రచురణ : స్వాతి మాసపత్రిక
మే 2009

# స్వయంగా రాసుకున్న రచనెప్పుడూ కన్న బిడ్డే!

ఏప్రిల్ 23న 1964లో షేక్స్పియర్ ఇంగ్లండులో పుట్టాడు. ఆయన పుట్టినరోజున 'వరల్డ్ బుక్ అండ్ కాపీరైట్స్ డే'గా యునెస్కో ప్రకటించింది. రచయితలు తమ రచనలు చౌర్యం కాకుండా చూసుకునేందుకు ఏర్పడ్డదే కాపీరైట్ చట్టం. భావ వ్యక్తీకరణ స్వేచ్ఛకు కాపీరైట్ ఒక రక్షణ. రచయిత తాను సృష్టించిన సృజనాత్మక రచనను రక్షించుకుని, ఆర్థిక ప్రయోజనాన్ని పొందే అవకాశం ఈ కాపీరైట్‌వల్ల వస్తుంది.

ఇంటర్నెట్ విస్తరిస్తోన్న ఈ రోజుల్లో కాపీరైట్‌కు చట్ట ప్రాధాన్యంతో పాటు, దాని అవసరం కూడ బాగా ఏర్పడింది. ఏ భాషలోని రచన్నైనా ఇంటర్నెట్లో చదివే అవకాశం కలిగిన ఈనాడు మేధోసంపదకు రక్షణ కవచాన్ని ఏర్పరుస్తుందీ చట్టం. ఒక రచయిత రాసిన పుస్తకంలోంచి ఏ భాగాన్ని అతని అనుమతి లేకుండా మరోచోట ఏ సందర్భంగానూ

వాడరాదనే నియమాన్ని కల్పిస్తుంది కాపీరైట్.

ఒక మంచి కోసం ఏర్పడిన చట్టాన్ని స్వార్థపర శక్తులు తమకు అనుకూలంగా మలచుకుని లబ్ధి పొందడం మానవనైజ వికృతికి పరాకాష్ఠ. 'ఏన్ అన్ఎకనాలెడ్జ్‌డ్ లెజిస్లేటర్ ఆఫ్ ది వరల్డ్'గా కీర్తింపబడుతూ, సమాజానికి దిశానిర్దేశం చేసే రచయిత, అదే సమాజంలోని కొన్ని స్వార్థపర శక్తుల చేతుల్లో ఎంత దారుణంగా మేథోచౌర్యానికి గురి కాబడుతున్నాడో అద్భుతంగా చిత్రీకరించిన కథ యస్వీ కృష్ణ రచించిన 'కడలి కెరటం'– స్వాతి మాసపత్రిక మే 2009 సంచికలో ప్రచురింపబడింది.

సృజనశక్తి రచయిత. సృష్టించడమే అతనికి తెలుస్తుంది. సృష్టించిన దానిని పాఠకునికి చేరవేయలేని బడుగుజీవి అయితే, ఆ 'చేరవేసే' బాధ్యత తీసుకుంటాడు ప్రచురణకర్త. రచయిత తన రచనల్ని పత్రికల్లో ప్రచురణార్థం పంపడం దగ్గర్నుంచి సంపుటీకరించేవరకు ఓ రకమైన మేథోపరమైన దోపిడీకి గురవుతూనే ఉంటాడు. రచనల్ని ప్రచురించే చాల పత్రికలు, పెద్ద పత్రికలు సైతం, రెమ్యూనరేషన్ ఇవ్వడంలేదు. కనీసం తపాలా ఖర్చులకైనా చెల్లిస్తే బావుంటుందనుకుంటాడు రచయిత. దానిక్కూడా నోచుకోడు. ప్రసవవేదన పడి ఎలాగో రచనను వెలువరించాడనుకుంటే దాన్ని ఒక పత్రిక్కి పంపిస్తే వెంటనే అది ప్రచురింపబడుతుందనుకోడానికి వీలు లేదు. కొంతకాలం చూసి, మళ్ళీ మరో పత్రిక్కి పంపాలి. అప్పుడైనా ప్రచురింపబడొచ్చు, లేకపోనూవచ్చు. పున: పున: వివిధ పత్రికలకి ప్రయత్నించాలి. అలా పత్రికల్లో ప్రచురింపబడిన కథల్లో, కవితలో ఒక పుస్తకంగా తీసుకురావాలంటే ఎవరోక పబ్లిషర్‌ను వెతుక్కోవాలి. రాయల్టీ విషయంలో పేచీలు, తగాదాలు తప్పనిసరే అవుతాయి. కొండొకచో ప్రచురింపబడ్డమే మహద్భాగ్యంగా భావించాలి. ఇవన్నీ పడలేకనే ప్రస్తుతం రచయితలు తమ పుస్తకాలు తామే సొంత నిధులతో ప్రచురించు కుంటున్నారు. తీరా ప్రచురించుకున్నాకా, దానికి మార్కెట్ ఉండదు. ఏదైనా పుస్తకం గురించి పత్రికలో సమీక్ష వస్తే (రావడమూ గగనమే), అక్కడ్నుంచీ మొదలవుతుంది ఉత్తరాల వెల్లువ – దయచేసి తమకో పుస్తకం పంపమని ముక్కూ మొహమూ కూడ తెలియని అభ్యర్థనలు. "పుస్తకం ముద్రించేందుకు ఖర్చయి ఉంటుందనీ, ఊరికే అడగడం భావ్యం కాద"న్న ఇంగితమే ఉండదు. అడగడమే భాగ్యం అనుకుని రచయిత తపాలా ఖర్చులు చూసుకో కుండా పుస్తకం పంపితే తర్వాత మరే స్పందనా ఉండదు. పుస్తకం గురించిన

అభిప్రాయాన్ని కోరుకుంటాడు రచయిత. అభిప్రాయం మాట అటుంచి, కనీసం అందిందన్న విషయం కూడా తెలుపడా సదరు ముక్కూమొహం తెలీని మనిషి. ఆ విధంగా అన్ని దశల్లోనూ చేతులు కాల్చుకోడమే!

సృజించడం మాత్రమే తెలిసిన రచయిత ఈ బాధలన్నీ పడలేక ఎవర్నైనా పబ్లిషర్ని వెతుక్కోడమే మంచిదనుకుంటే – అదీ వ్యాపార సంబంధమే అవుతుంది. ప్రచురణకర్త పెట్టుబడిదారుడు కనుక సహజంగా లాభాలు కోరుకుంటాడు. రచయిత అతని చేతిలో చిక్కుకుపోవాల్సిన పరిస్థితులే సర్వసాధారణం అవుతాయి. ఈ నేపథ్యంలో సాహితీరంగంలో వేళ్ళూనుకున్న బూర్జువా వ్యాపార ధోరణిని 'కడలి కెరటం' కథలో చిత్రీకరించారు కృష్ణ.

కథలోని నాయకుడు అమర్. పత్రికా ప్రచురణావస్థలోనే పున: పున: ప్రయత్న దశలో ఉంటాడు. మార్కెట్లో ఉన్న అన్ని పత్రికలకీ రాసి పంపుతుంటాడు. ప్రతి పత్రికనుంచీ తిరిగొస్తుంటాయి. పట్టు వదలని విక్రమార్కుడిలా రాసిరాసి పంపిస్తూనే ఉన్నా, అన్నీ తిరుగు టపాలో అంతే భద్రంగా వెనక్కి వస్తుంటాయి. ఆ దశలో అనుకోని పరిణామం. విధివశాత్తు అక్షరం ముక్క రాయలేని అక్షర అజ్ఞానే అయినా అదృష్టవశాత్తూ రచయిత్రిగా పేరు తెచ్చుకున్న ఒకానొక యువరచయిత్రికి అతను ఘోస్ట్‌గా మారతాడు. "తన కలంలో బలం తప్ప డబ్బూ, హొదా, అధికారం పరపతులతోపాటు ప్రముఖ రచయితల అండదండలూ, సీనియర్ సాహితీ వేత్తల ఆశీస్సులు దండిగా ఉన్న" రచయిత్రి ఆమె. అందుకే అమర్ రాసిన కథల్నీ, నవలల్నీ తీసుకుని ప్రతిఫలంగా అతనికి కొంత డబ్బు ముట్టజెప్పి తన పేరుతో పత్రికల్లో ప్రచురించుకుని, ఆ తర్వాత పుస్తకాలుగా అచ్చేసుకునేది. ఆ విధంగా రచయిత్రే కాని, ఆమె 'రచయిత్రి కమ్ ప్రచురణ కర్త'గా అవతారమెత్తుతుంది.

"పేగు తెంచుకుని పుట్టిన బిడ్డల్నయినా పెంచి పోషించే స్తోమత లేనప్పుడు– ఆ బాధ్యత వహించి, వారికి మంచి జీవితాన్నిచ్చి వెలుగులోకి తీసుకురాగల శక్తి సామర్థ్యాలున్న వాళ్ళకి 'దత్తత' ఇచ్చేయడం ఎలా తప్పు కాదో – ప్రతి పత్రికనుంచీ తిరిగొస్తూ మరుగున పడిపోయే" తన రచనలు తన పేరుతో కాకపోయినా మరోవ్యక్తి పేరుతోనైనా పాఠకుల ముందుకు వెళ్ళి వెలుగు చూస్తాయన్న ఆశతోపాటు, రాసిన రాతలకు అంతో ఇంతో ఆర్థిక ప్రతిఫలం కూడ చేకూరుతుందనే ఆశతో అమర్ ఆమెకు 'ఘోస్టు'గా మారతాడు.

అమర్ తన పేరుతో రాసి పంపిన రచనలు పుంఖానుపుంఖంగా తిరిగొస్తే, ఆమె పేరుమీద పుంఖానుపుంఖంగా పత్రికల్లో ప్రచురితం కావడం అసహజమనిపించే విషయమే అయినా, అలా జరగడానికి అవకాశమే లేదనీ నిర్ద్వంద్వంగా కొట్టి పారేయలేం.

పదకొండేళ్ళు పైబడే పున:పున: ప్రయత్నదశలోనే ఉంటాడు అమర్. ఇదికూడ అసహజమైన విషయమే. పంపిన ప్రతిరచనా తిరిగొస్తుంటే, అంత దీర్ఘకాలం జీవికగా అదృష్టాన్ని పరీక్షించుకోడం జరగని పని. అయినా అలా జరగడానికి అవకాశమే లేదనీ ఖండితంగా చెప్పలేం.

రెండేళ్ళపాటు అమర్ కథలు, నవలలు 'ఆమె' పేరుతో పత్రికల్లో ప్రచురింపబడ్డమే కాకుండా, ఆమెకు బహుమతులు కూడ తెచ్చిపెడతాయి. ఆ తర్వాత ఆమె వాటిని సంపుటాలుగా ముద్రించుకుని, ఆవిష్కరణ సభలు జరుపుకుని, పేరున్న కొందరు సీనియర్ కవులు, రచయితలచేత సభల్లో పొగిడించుకుని 'విశిష్ట రచయిత్రి' అయిపోతే–

తన పేరు లేదన్న భావమే తప్ప తన కష్టానికి బదులుగా ఆమెనుంచి దక్కే ఆర్థిక ప్రతిఫలం మొదట్లో తృప్తినిచ్చినా, రాన్రానూ ఏదో చెప్పలేని ఒకానొక అసంతృప్తి అమర్‌కు కలుగుతుంది. తాను రాసినవాటితో సాహితీ లోకంలో రచయిత్రిగా ఆమె అంచెలంచెలుగా ఎదిగేకొద్దీ... "కనీసం ఒక్క కథైనా, ఒక్క నవలైనా తన పేరుతో అచ్చులో చూసుకోవాలన్న తపన" అతనిలో రోజురోజుకూ పెరుగుతూ వస్తుంది. అది సహజం కూడా. ఫలితంగా అచ్చంగా తనకోసం ఒక నవల రాసుకోడం, దాన్ని ఒక పత్రిక్కి పోటీకోసం పంపడం, అది 'ఉత్తమ నవల'గా ఎంపికై మొదటి బహుమతి పాతికవేల రూపాయలు అమర్‌కు సంపాదించి పెట్టడం జరుగుతుంది. "పత్రికల్లో కనిపించే చాలా రచనలు రచనలనుబట్టి కాక ఆయా 'రచయితలను' బట్టి పబ్లిష్ అవుతాయ"ని అపోహపడుతూండే అమర్ దృక్పథాన్ని మార్చివేస్తుంది.

ఆ విషయాన్ని పసిగట్టిన ఆమెలో అసూయబీజం మొలకెత్తు తుంది. అది అత్యంత సహజం కూడా. మరో ఆరునెలల్లో అమర్ నవల సీరియల్‌గా పత్రికలో రాబోతోంది. ఇకపై అమర్ తనకు ఘోస్ట్‌గా ఉండక పోవచ్చు. రచయిత్రిగా తాను నిర్మించుకున్న కీర్తిసౌధం కుప్పకూలిపోవచ్చు. అయితే అలా జరగకుండా ఉండడానికి ఆమె ఒక మాష్టర్ ప్లాన్ వేస్తుంది.

ఓసారి చదివి ఇస్తానని అమర్ నవలని తీసుకుని, ఏకంగా తన నవలగా ముద్రించేసుకుని, అమర్ సిటీలో లేని సమయంలో ఆవిష్కరింప జేసుకుంటుంది. ఇదేమీ పాపం, అమర్ గమనించడు.

పత్రికలో అమర్ నవల సీరియల్‌గా మొదలైన రోజునే, ఆ సీరియల్ ఆపాలనీ, తాను రాసి అంతకుముందే డైరెక్ట్ నవలగా ప్రచురించి ఆవిష్కరించుకున్న తన నవలని అమర్ పత్రిక్కి పోటీకి పంపి బహుమతి గెలుచుకున్నాడని ఆమె సివిల్ కోర్టులో దావా వేస్తుంది. అయితే, అమర్ ఆ నవలను ఎప్పుడు రాశాడో, ఎప్పుడు పోటీకి పంపాడో, పత్రికవాళ్ళు ఆ నవలకు బహుమతి ఎప్పుడిచ్చారో... ఇత్యాది విషయాలేమీ ఆమెకు తెలీవనీ, ఆమె అబద్ధమాడిందని రుజువౌతూ, సివిల్ కోర్టులో కేసు తేలిపోనున్న సమయంలో... ...

ఆమె సివిల్ కోర్టునుంచి మధ్యాహ్నం లంచ్‌టైమ్‌లో హుటాహుటిన వెళ్ళి పోలీసు స్టేషన్లో కేసు బుక్ చేయగానే అప్పటికప్పుడు పోలీసులొచ్చి, అమర్ కోర్టుమెట్లు దిగీదిగగానే అరెస్టుచేసి తీసుకుపోతారు. కథ సివిల్ కేసునుంచి క్రిమినల్ కేసుకు మారుతుంది. సహజాతి సహజంగా సాగుతుంది.

ఆ నవల తనది కాదనీ, ఆమెదేననీ ఒప్పుకుంటే అంతకు ముందిచ్చే డబ్బుకు పదింతలు అందుతుందనీ, తనమీద పెట్టిన కేసులూ ఉపసంహరింపబడతాయనీ... లేదంటే కేసులో బలవంతంగా ఇరికించడమే కాకుండా, పదమూడేళ్ళుగా చేస్తున్న కాంట్రాక్ట్ లెక్చరర్ ఉద్యోగం ఆమె పరపతితో పీకించేయబడుతుందనీ...భార్యాబిడ్డలు రోడ్డున పడకుండా చూసుకోమనీ ఒత్తిడి తెస్తాడు సదరు ఇనస్పెక్టర్ ఆఫ్ పోలీస్, ఆమెకు మౌత్‌పీసై!

పత్రికలో ప్రచురింపబడటానికి ముందే అనాలోచితంగా తన నవల రాతకాపీని ఆమెకిచ్చిన అమర్ ఈసారి సరైన ఆలోచన చేస్తాడు... ఓసారి తన భార్యతో మాట్లాడాలంటాడు. అమర్ భార్య కవిత– మూడేళ్ళ పాప రమ్యతోపాటు రోడ్డుమీదకు రాడానికే సంసిద్ధమవుతుంది. ఫలితం ఖైదీ అవుతాడు అమర్.

'ఓపెన్ ఎయిర్ జైలు...చల్లపల్లి'లో ఓపెన్ అవుతుంది కథ. ఏదో యూనివర్సిటీ క్యాంపస్‌లానో, ప్రకృతి చికిత్సాలయంలానో ఉన్న ఆ జైల్లో (మన జైళ్ళింత బాగున్నాయాన్న అనుమానం రాకమానదు) ఫార్మాలిటీస్

మాత్రం మామూలే. ఖైదీల్ని నగ్నంగా నిలబెట్టి పుట్టుమచ్చలు నమోదు చేయడం, వారివద్దనున్న డబ్బులో నోట్లను మాత్రమే రికార్డు చేసి చిల్లర (ఎంతైనా సరే) నొక్కేయడం వంటివన్నీ యథాతథంగా హైటెక్ జైలైనా అక్కడా జరుగుతాయి. ఈ విషయాలన్నింటినీ గొప్ప కథనశక్తితో చెబుతూ, పాఠకుణ్ణి ఊపిరి తీసుకోనివ్వకుండా... చివరాఖర ఫుల్‌స్టాపుతో పాటూ 'అమ్మయ్య' అని నిట్టూర్పిస్తారు కథకుడిగా కృష్ణ. అక్షరాలతో పాఠకుల కళ్ళ ఎదుట దృశ్యాన్ని ఆవిష్కరించగల 'సీనిక్ రైటర్' కృష్ణ –జైలు వాతావరణాన్ని కళ్ళ ఎదుట నిలపడంలో ఎంతో విజయవంతమయ్యారు. దృశ్యాలు ఒకదాని వెంట ఒకటిగా మన కళ్ళముందు జరుగుతూ, టీవీలో సీరియల్ చూస్తున్న అనుభూతినిస్తాయి. కథను చదువుతూ పాఠకుడు కాస్తా ప్రేక్షకుడవుతాడు.

స్వజాతి సంపర్కం ప్రకృతి విరుద్ధమనీ, క్షేమకరం కాదనీ తెలిపే పోష్టర్లనుంచి, తాముండాల్సిన హాల్లో ఏ మూల ఉంటే వాస్తుపరంగా బావుంటుందన్న విషయం వరకు చాలా సుదీర్ఘంగా జైలు వర్ణన చర్చించడం అవసరమా అనిపిస్తే – అవసరమనే చెప్పాలి. జైలులోదైనా జీవితం జీవితమే. ఆ జీవితాన్ని సమగ్రంగా చిత్రీకరించారు కృష్ణ. భార్యాబిడ్డల్ని వదలివచ్చి ఏళ్ళ తరబడి ఒంటరిగా ఉండే ఖైదీల్లో ప్రకృతివిరుద్ధమైన సంపర్కాలు అలవాటవుతాయన్న విషయం అవగతమవుతుంది. అందుకే బహుశా, అటువంటివి కూడదంటూనే, 'స్వజాతి సంపర్కంలో సురక్షిత పద్ధతులు పాటించం'డంటూ, అవేమిటో ఎలా పాటించాలో తెలియజెప్పే నగ్న పోష్టర్లను ఖైదీల హాలుల్లో ప్రదర్శనకు ఉంచుతారని తెలుస్తుంది. జైలు జీవితంలో గమనించదగిన మరో విషయం – ఖైదీలు పరస్పరం పరిచయం చేసుకుంటూ, పేరుతోపాటు వెనుక రాసుకునే క్వాలిఫికేషన్లా తాము ఏ కేసు మీద వచ్చిందీ చెప్పుకోడం – "నా పేరు వెంకటేష్...రేప్ కేసు; నా పేరు సత్యన్నారాయణ...డౌరీ కేసు!" ఇలా.  ఇలా పరిచయం చేసుకుని తమ కథలు చెప్పుకోడమూ పరిపాటి.

అలా అమర్ అడగకపోయినా, సదానంద్ అనే ఖైదీచేత అతని కథనంతా పూసగుచ్చినట్లు చెప్పిస్తారు కథకుడు. అతని భార్య పక్కింటి వాడితో సంబంధం పెట్టుకుంటుంది. అది సహించలేని సదానంద్ ఆమెను చితకబాది పుట్టింటికి పొమ్మంటాడు. వెళ్ళిన ఆమె తల్లిదండ్రులతో తిరిగొచ్చి అతనిపై కట్నం వేధింపు కేసు బనాయిస్తుంది. ఫలితం సదానంద్ కటకటాల

వెనక్కి వస్తాడు. సదానంద్ కథనంతా వివరంగా కథకుడెందుకు చెప్పారాని ఆలోచిస్తే, అది కథకెంత బలాన్ని చేకూర్చిందో అర్థమవుతుంది. పురుషాధిక్య సమాజంలో స్త్రీకి రక్షణనిచ్చేందుకు ఏర్పరచిన చట్టాలూ, కల్పించిన అవకాశాలూ– నిజంగా వాటి అవసరమున్న వాళ్ళకి ఉపయోగ పడుతున్నాయో లేదోకాని, తప్పుడు కేసులు బనాయించే సదానంద్ భార్యలాంటి వాళ్ళకి మాత్రం గొప్ప అనుకూలంగా ఉపయోగపడు తున్నాయని తెలుస్తుంది. అలా ఉపయోగపడేవే చట్టాలన్నీ – ఎస్సీ అట్రాసిటీ కేసుతో సహా. అలాగే 'కాపీరైట్' చట్టం కూడా. దాన్ని పబ్లిషర్ అనుకూలంగా ఉపయోగించుకునే అవకాశాలున్నాయన్న విషయం స్ఫురించేలా సదానంద్ కథను నేర్పుతో ఉపచిత్రీకరించారు కృష్ణ. తానొక విజయవంతమైన ప్రచురణకర్త అయ్యుండీ, కాపీరైట్ చట్టంపై వ్యతిరేకంగా ఇంత మంచి కథ రాసినందుకు రచయితను అభినందించాలి. అయితే ఎస్వీ కృష్ణ కేవలం ఒక పబ్లిషర్ మాత్రమే కాదు; రచయిత–పబ్లిషర్! అందుకే ఇటువంటి కథను రాయగలిగారు. కథలోని రచయిత్రి 'ఆమె'– కేవలం పబ్లిషర్ మాత్రమే. అమర్‌ను ఘోస్టుగా చేసుకుని తనపేర పుస్తకాలు ప్రచురించుకునే పబ్లిషర్. కనుకనే నిర్దయగా అమర్‌ను జైలుపాలు చేయ గల్గింది. పైగా తన పరపతితో పదమూడేళ్ళుగా చేస్తున్న ఉద్యోగం పీకించేయగల్గింది.

ఈ విధంగా కథలోని ప్రతి సంఘటనకు అంతర్గత సంబంధాన్ని, సంగతాన్ని కలిగిస్తూ అమోఘంగా కథనాన్ని నిర్వహించారు కృష్ణ. తోటి ఖైదీ సదానంద్ కథను చెప్పి, అసలు కథకు ఎంతో బలాన్ని చేకూర్చారు. కొంత నిడివి పెరిగినా జీవితం సమగ్రంగా దర్శనమిస్తుందీ కథలో. కొడవటి గంటి, రావిశాస్త్రి, కా.రా మాస్టారువంటి కథకులు ఈ ఒరవడి పెట్టినవారే. వారి అడుగుజాడల్లో కడలి కెరటాన్ని ఉవ్వెత్తున ఉంచారు కృష్ణ.

అమర్ భార్య కవిత బెయిల్ తీసుకువస్తుంది. సదానంద్ కూడ బెయిల్‌పై విడుదలవుతాడు. జైలునుంచి బయటికొచ్చిన అమర్‌కు భార్య కవిత, చంకలో కూతురుతో ఆహ్వానం పలుకుతుంది – అమర్‌ని ఉద్యోగంలోంచి తొలగిస్తూ రిజిస్ట్రార్‌నుంచి వచ్చిన ఆర్డర్‌ను అందిస్తూ. ఉద్యోగం పోయిందన్న విషయాన్ని జీర్ణించుకోలేని అమర్, భార్య ముఖంలోకి చూస్తాడు. విడివడకుండా విచ్చుకున్న ఆమె పెదవులు కురిపిస్తున్న మందహాసం అతడి వెన్ను తడుతుంది. మాటల్లో చెప్పలేని ఏదో సందేశాన్ని అందుకున్నవాడై అమర్ – "ఇప్పుడేం చేస్తారు సార్?"

అని సదానంద్ అడిగిన ప్రశ్నకు దృఢ చిత్తంతో సమాధానమిస్తాడు – "ఉద్యోగం పోయిందని నా భార్యాపిల్లల్ని వదులుకుంటానా?" అని తిరిగి ప్రశ్నిస్తూ, భార్య చంకలోంచి అతనివద్దకు ఉరుకుతున్న కూతుర్ని అందు కుంటూ, "ఈ కూతురే కాదు...నేను స్వయంగా రాసుకున్న ఆ నవల కూడా నేను కన్నబిడ్డే"నని ఒక నిశ్చయ దరహాసంతో బదులిస్తాడు.

అవును, స్వయంగా రాసుకున్న రచనెప్పుడూ రచయిత కన్నబిడ్డే!

చివరికి కథ ఏమైందన్నది వాచ్యంగా చెప్పకుండా, సూచ్యంగా వదిలేయడం గొప్ప ముగింపు. కేసులో విజయం పొంది కవిత ఆసరాతో 'రమ్య'మైన రచనావ్యాసంగాన్ని రసరమ్యరీతిలో అమర్ కొనసాగించి ఉంటాడని ఊహించొచ్చు. కథకు ఇంద్రజిత్ గీసిన ఇలస్ట్రేషన్– కడలి కెరటమై పోటెత్తి వచ్చిన కలం పాళీ కుహనా రచయిత్రిని చుట్టేయగా, ఆమె చేతుల్లోని కాగితాలు విముక్తమై విహంగాల్లా ఎగరడం – ఒక ఆశావహ దృక్పథాన్ని కలిగిస్తూ, రచయితగా అమర్ ఓడిపోయి ఉండడని భావింపజేస్తుంది.

'కడలి కెరటం' సెన్సేషనలే కాదు, సిన్సియర్ స్టోరీ కూడా. సాహితీ రంగంలో ఉండే అసూయల్నీ, తత్ప్రభావంతో చెలరేగే అన్యాయాల్నీ బాగా ఆవిష్కరించింది. ఎత్తుగడ, ముగింపులు ఎంతో ప్రతీకాత్మకంగా సాగిన కథ. ఎక్కడా విసుగు కలిగించకుండా ఉత్కంఠతో చివరికంటా చదివించు కుంటుంది. మోసగింపబడి, అవమానంతో బలవంతంగా జైల్లోకి నెట్టేయ బడిన నేపథ్యంలో మొదలైన కథ, అంతంలో జైలునుంచి బెయిలుపై విడుదలై, కూడగట్టుకున్న ఆత్మస్థైర్యంతో, ఆశావహ దృక్పథంతో బయటి ప్రపంచంలోకి అడుగు పెట్టడం – తరువాత వేయబోయే వేయి అడుగుల సమర యానానికి తొలి అడుగే.

రచయితలకు కనువిప్పు ఈ కథ. నైపుణ్యముండి, స్వార్థపూరిత దెయ్యాల చేతిలో పడి నలిగిపోయే 'ఘోస్ట్' రచయితల దయనీయ స్థితిని మనోవేదనని గొప్పగా చిత్రించారు కృష్ణ. ఒక ప్రచురణ కర్తపై రచయిత పోరాటాన్ని తను స్వయానా రచయితైన కారణంగానే చిత్రీకరించే ధైర్యం చేశారు. ప్రచురణకర్తగా కంటె, మౌలికంగా తానొక రచయితనని నిరూపించు కున్నారు. కథారచన సమయంలో ఆయనలోని ప్రచురణకర్త ప్రతిఘటించ లేదంటే, ఆయనొక నైతికాదర్శాలుగల మంచి ప్రచురణ కర్తన్న విషయం తేటతెల్లమవుతుంది.

నమ్మక ద్రోహం తలపెట్టేవారు ఉంటారన్న విషయాన్ని ఎప్పుడూ స్మరణలో ఉంచుకోవాలన్న విషయాన్ని చెబుతుందీ కథ. ప్రచురణ / ప్రసారం కాని రచనలు ఎవరికీ, ముఖ్యంగా తోటి రచయితలకు ఎట్టి పరిస్థితుల్లోను ఇవ్వకూడదని హెచ్చరిస్తుంది.

కాపీరైట్ చట్టంపై చక్కని అవగాహన కల్పించే ఈ కథ ప్రతి రచయిత తప్పకుండా చదివి గుర్తుంచుకోవలసిన కథ.

(జయంతి పబ్లికేషన్స్)

కథయిత్రి : డా॥ వాడ్రేవు వీరలక్ష్మీదేవి
కథ : తెలుసుకొనవె యువతా!
ప్రచురణ : ఆదివారం వార్త,
**14.12.2008**

# ప్రేమతో కరగాలి ...
# కరిగి ప్రవహించాలి

ప్రేమ!

మనుషులు ఒకరినొకరు ప్రేమించుకోడం సహజం. అందునా స్త్రీ పురుషులైతే, "అంతా అనురాగమయం, ఆనందానికి నిలయం"గా ఉంటుంది వారి ప్రేమ పర్యవసానం.

ప్రకటన!

ఒకరిపట్ల ఒకరి ప్రేమను ప్రకటించుకోగలిగి నప్పుడు, ఒకరి పట్ల ఒకరి ఆర్తిని అర్థవంతంగా ప్రదర్శించుకోగలిగినప్పుడు, అప్పుడు ఇద్దరిమధ్యా ప్రేమ చిగురు వేసి, తీగలల్లి అనురాగ విరులు పూస్తాయి; ఆనందపు ఫలాలు కాస్తాయి.

ప్రేమ ప్రకటన!

ఇదంతా ప్రేమ ప్రకటన సరిగా సక్రమంగా ఇద్దరిమధ్యా కొనసాగినప్పుడు... ఆయా ప్రకటన రీతులు మనసుకు గిలిగింతలు పెట్టినప్పుడు మాత్రమే. లేదంటే విచారమూ, విషాదమూ,

వియోగమూ... క్రమక్రమంగా ఒకదానిని మించి మరొకటి ప్రేమరాహిత్యంగా, ప్రేమాభావంగా, పరిణమించి జీవితాన్ని నరకప్రాయం చేయొచ్చు; లేదా అంతమే చేయొచ్చు.

అందుకే, ప్రేమ ఉంటేనే సరిపోదు. దాన్ని సక్రమంగా, అర్థవంతంగా ప్రకటించగలగాలి; ప్రదర్శించగలగాలి.

ప్రేమ తాలూకు భావప్రకటనల్లో భేదాలుంటాయి. వైయక్తికమైన రీతులుంటాయి. అయితే, ఆ రీతులూ, భేదాలూ ఆ ప్రేమకు పాత్రమైన హృదయాన్ని స్పృశించగలగాలి; నేరుగా తాకగలగాలి; లోపలంటా తిష్ఠ వెయ్యగలగాలి. అప్పుడంతా అనురాగమయమే, ఆనందానికి నిలయమే అవుతుంది.

ప్రేమ ప్రకటనరీతీ, భావప్రదర్శన స్వభావమూ సరిగా లేనప్పుడు, అంటే అది ఎదిరి మనసును తాకనప్పుడు అసంతృప్తీ, కోపమూ పెరిగి, నిందలూ నిష్పందనలూ చెలరేగి, అభియోగాలూ అపార్థాలూ పెట్రేగి, పంతాలకు పట్టింపులకు పోతుంది వ్యవహారం. ఫలితం విచారమూ, విషాదమూ, వియోగమూనూ. అంతా ద్వేషభరితం, దు:ఖపూరితం అయిపోతుంది.

అయితే నిజమైన ప్రేమకి గెలుపోటములు ఉంటాయా? అసలు వాటి ప్రసక్తి వచ్చిందంటే పారస్పరికమైన ప్రేమ, అనురాగం, ఆప్యాయత, ఇష్టం అన్నీ తగ్గిపోతున్నట్టు కాదా?

రెండు రకాలైన ప్రేమనూ విశదపరుస్తూ, వాటి భిన్నరీతుల్ని తద్భిన్న ప్రభావాల్ని, భిన్న ఫలితాల్ని విడమరచి అద్భుతంగా చిత్రించిన డా॥ వాడ్రేవు వీరలక్ష్మీదేవి కథ 'తెలుసుకొనవె యువతా...!' చాల గొప్ప కథ. 14 డిసెంబర్ 2008 ఆదివారం 'వార్త' అనుబంధంలో ప్రచురింపబడింది.

+++

కూనిరాగం తీసిన కంఠస్వరమో, ఏ సెమినార్లోనో పేపరు ప్రెజెంట్ చేసేప్పుడు చదవడంలోని ఉచ్చారణో, అందులోని గ్రేసో 'సమీర'మై వచ్చి మనసును తాకవచ్చు. అదే విషయాన్ని తెలియపరచి నప్పుడు పేపర్లోని సబ్జక్టును గురించికాక మరి దేనిగురించోనని అర్థమైనప్పుడు ముందు చిన్న కోపం కలిగినా, అవే మాటలు ఓ వారం రోజులు వెంటపడీ.... వేధించీ... మరపుకు రావచ్చు లేదా మనసు అట్టడుగు పొరల్లో నిక్షిప్తం కావచ్చు.

మరో నెల తర్వాతో ఎప్పుడో అనుకోకుండా 'ఆనంద్' సినిమా బయటో ఎక్కడో మళ్ళీ తారసపడొచ్చు. రొటీన్‌గా 'సినిమాకి వచ్చారా?' అని అడగకుండా తాను మాత్రం సినిమాకి కాదని, స్నేహితుడి కోసమని తెలియజేస్తూ తనకు సినిమాలపట్ల ఆసక్తి లేదని తెలియజేయవచ్చు. ఆ చిత్రమైన స్వభావమే ఆకర్షించవచ్చు. 'ప్రమోద'మై పరిణమించవచ్చు. ఎప్పుడూ తనను చూడాలనీ... ఆ మాటలు వినాలనీ మనసు మారాం చెయ్యొచ్చు. 'ఏం మాయ చేసావొ కానీ...' అని గారాలుపోతూ నెమ్మదిలో పాడుకోనూవచ్చు.

ఫలితం 'సమీర వెడ్స్ ప్రమోద్' అని శుభలేఖ ప్రింటవుతుంది.

+++

ఆ సమీరమో... ఆ ప్రమోదమో, ఒకదానికొకటి సొంతమయి నప్పుడు మొద'లవ్వు'తుంది అసలు కథ. పూర్తిగా సొంతమనుకున్నప్పుడు పుడుతుంది స్వార్థమూ, తత్ప్రయోజనమూ, అభియోగాలూ, అపోహలు అపార్థాలూ మొదలు.

టెలిఫోనులో అయిదు నిమిషాలు మించి సమీరం వీస్తే అవతల కట్. ఫలితం నిరాశ... ఎన్నోసార్లు. ఈ నిరాశను అసంతృప్తిలోకి మారుస్తాయి ఎప్పుడో పరిచయమైన కొత్తల్లో జరిగిన కొన్ని సంఘటనలు. అప్పుడవి అర్థం కాకపోయినా, వాటి తాలూకు లోతులు ఇప్పుడు బాగా అనుభవమవుతాయి.

శీతాకాలపు సాయంత్రం రైలు దిగి చలిలో ప్లాట్‌ఫాం మీద గంట, రెండు గంటలు నిరీక్షణ, వచ్చి ఇంటికి తీసుకెళ్తానన్నవాడు రాకపోడం, పైగా ఒకవేళ వస్తే తను కనబడకపోతే ఇబ్బంది పడతాడని అక్కడే గడ్డ కట్టిపోయిన సమీరం, చలితోనే కాదు, కోపంతో కూడా. అంతలోనే, "సారీ! నువు వస్తానన్నది రేపు కదా!" అని వినబడితే ఎలా ఉంటుంది?

ఒకరినొకరు మరొకరిని ఒకేలా కోరుకోవద్దా? ప్రశ్న తలెత్తుతుంది. ఉద్యోగం, స్నేహితులు, పార్టీలు అన్నీ అయ్యాకే తనైతే ఎలా? అవన్నీ తనకూ ఉన్నా, 'మొదటి ప్రాధాన్యత' తనేనే!

ఆడవాళ్ళకో పుట్టిల్లు ఉంటుంది – తాత్కాలికంగా దూరం అవ్వడానికైనా... దూరం పెట్టడానికైనా. తరువాత పరిణామాలను బట్టి పర్యవసానం – వియోగమో, పునఃసంయోగమో!

సెల్‌ఫోన్ సౌకర్యం అంతగా లేని కాలంలో ప్రేమించుకుని, ఆ

సౌకర్యం ఒక తుఫానుగా మారిన కాలంలో పెళ్ళి చేసుకున్నారు సమీర, ప్రమోద్ (చాలా కాలమే ప్రేమించుకున్నారులా ఉంది)

మాట్లాడ్డానికి టైమ్ లేనోడు, 'షార్ట్ మెసేజ్ సర్వీస్'ను మాత్రం అమోఘంగా ఉపయోగించుకుంటాడు. ఆంగ్లలిపిలో తెలుగు భాష, లిప్యంతరీకరణ. 'లిప్' అంతరీకరణం కూడా – పెదవినుంచి రాని అంతరంగ భావప్రదర్శనం.

"చిరుగాలి తరగా! భానుడు వెళ్ళలేక పోతున్నాడు...
నిద్రతో బరువెక్కిన నీ రెప్పలు ఒకసారి విప్పి చూడవూ!
నీ వీడ్కోలు కోసమే పాపం, ఆగాడు
చూడు చూడు లోకానికి కాలమే ఆగిపోయింది" – ఎంత భావుకత్వం! తనకు మాత్రం మూడు నెలలుగా చావుకత్వంలా ఉంది.

అర్ధరాత్రీ అపరాత్రీ అని లేకుండా మెసేజ్ టోన్ మోగుతుంది– గజల్లాటి భావాన్నేదో మోసుకొస్తూ.

"ఈ రెప్పలు మూతపడవు
చనిపోయిన తర్వాత కూడా...
నీ కోసం ఎదురు చూస్తూ"

సున్నిత భావాల ప్రేమప్రకటనం. ఉండలేక వచ్చేసినా, 'సచ్ ఎ కన్నింగ్ ఫెలో'గా సమీర మనసులో నాటుకున్నాడు ప్రమోద్.

+++

గుండెలో కూడా ఉండాలి ప్రేమ. దూరంనుంచి అయిదు నిమిషాలు ఫోనులో మాట్లాడితే ఆరో నిమిషం ఆ దూరం భారమౌతుంది– భరించలేనంతగా! పోయి వళ్ళో వాలిపోవాలన్నంత ఉద్వేగం!

పొరపాటుగా గుర్తు పెట్టుకున్న తేదీ. అయినా సాయంత్రం ఆరు నుంచి రాత్రి తొమ్మిది వరకు, 'ఒకరోజు ముందు వచ్చేస్తుందేమో'నని చెప్పిన ఆరోజ్ఞానం మాట ప్రకారం రైలు స్టేషనుకు వెళ్ళేసరికి, పాపం చలిలో గడ్డకట్టుకుపోయిన సమీరం.

గుర్తు లేనంత మాత్రాన 'ప్రత్యేకం' కాకుండా పోతుందా? సున్నితమైన ప్రేమ లేదని అభియోగమొకటి. నాకా సున్నితమైన ప్రేమ లేనిది? బయటి నుంచి కాలింగ్ బెల్ మోగితే, ఎంతమందిలోంచయినా నా సమీరం నన్ను తాకుతుందే! నిద్రపోయేటప్పుడు ఎంత నిశ్శబ్దంగా సమీరం వచ్చినా, మెలకువలోకి వచ్చేస్తానే! "ఇంట్లో ఎక్కడ తిరుగుతున్నా సరే ఆ గాలి నాకు

తగుల్తూ ఉంటుంది. ఆమె సన్నిధి తెలుస్తూనే ఉంటుంది" – భావుకత్వపు ప్రేమ తీరిదీ.

+++

మూడు నెలల తర్వాత తిరిగొచ్చిన ఇంటిగాలికి మూడు నెలలుగా, ప్రతిరోజూ తీసి పారబోస్తున్న ఫిల్టర్ డికాషన్, ఆనాటి ఫ్రెష్ కషాయమై కనబడి కాఫీ తాగమంటుంది. ఊహించని చోట కనబడుతుంది ప్రమోద్ ప్రేమ, చిత్రం!

రాత్రి ప్రయాణం, నిద్రలేమితో నీడపట్టులో అలవాటయిన చోటులో హాయిగా నిద్రపోయి సాయంత్రం ఆరవుతుండగా మెలకువలోకి వచ్చిన సమీరానికి ప్రక్కన కుర్చీలో మౌనంగా తదేకంగా చూస్తూ కూర్చున్న ప్రమోదమైన పలకరింపు. కాదు కాదు, "ఎందుకు వదిలి వెళ్ళిపోయావ్? నేనెలా వదిలి ఉండగలననుకొన్నా" వన్నటువంటి మాటల, భావాల ఛాయల మూగభావన.

'కళ్ళలో బెంగ, చేతల్లో నిర్లక్ష్యం'గా నిర్ధారించుకుని నిరాశ పడేలోపు– సమీర రెండు చేతుల్నీ తీసుకుని ఆమె అరచేతుల్ని కళ్ళమీద పెట్టుకుంటే – తడిసిపోతూ అవి.

+++

పైకి ప్రదర్శించాలన్న తపనతో కూడిన ప్రేమ – సమీరది; గుండెల్లోనే దాచుకోవాలనే మూగప్రేమ – ప్రమోద్‌ది. ప్రేమ తాలూకు భావప్రకటనల్లో తేడాని తత్ప్రభావ స్వభావ రీతుల తులనాత్మక సంతులనాత్మక ఇతివృత్తంగా తీర్చిదిద్దిన తీరు అమోఘమైతే, ఒక విలక్షణమైన ప్రత్యేకమైన కథాకథనం దాన్ని ఉత్కంఠభరితంగా, ఉద్వేగ భరితంగా చదివిస్తుంది. ఎంతో సున్నితమైనది ప్రేమ. కథాగమనం కానుగ, తురాయి, పున్నాగ, పారిజాత, పసుపు కనకాంబర, గోరింట పూల నేపథ్యంలో సాగుతూ ప్రేమ తాలూకు సున్నితత్వాన్ని అక్షరాక్షరంలోనూ పట్టి చూపుతుంది.

కథకు ఉపోద్ఘాతంగా సాగిన బర్కిలీ యువకుల తేటముఖాల చిరునవ్వుల ధూమాల ప్రకటనలోని "గెలుపుయొక్క రుచి – అసలు రుచి" అన్న కాప్షన్ కథకు ఏ విధంగా ఉపయోగపడిందీ అర్థం కాదు. అసలయిన రుచిని ఎవరు పొందారు? సమీర గెలిచిందా? ప్రమోదా? ఒకరికొకరు అర్థం కాకున్నా, ఒకరినొకరు వదులుకోలేక సంఘర్షించే ఇద్దరూ

గెలవలేదా?! ఒక్క మాటలో చెప్పాలంటే 'ప్రేమ గెలిచింది'. అందుకే కథను ముగిస్తూ, "ఇన్ని వేల రంగుల ఈ ప్రపంచంలో ఈ జీవితం అందుకే ఇంత మిష్టీరియస్" అంటారు కథయిత్రి. "లేకపోతే యానిమేషన్ ఫిల్ములా రొటీన్" అవుతుంది జీవితం. జీవితాన్ని యాంత్రికం చెయ్యనిది ప్రేమ ఒకటేనన్న సందేశాన్ని యువతకు ఇస్తుందీ కథ

+++

కథను ప్రారంభిస్తూ, రెండు కిలోమీటర్ల దూరాన ఉన్న హోర్డింగు చాలా స్పష్టంగా కనిపిస్తున్నందుకు ఎంతో బెంగటిల్లిన కథయిత్రి, దాని క్కారణాన్ని చెబుతూ, "ఈ కిలోమీటరు పొడవునా రెండువేపులా ఉండే వృక్షాలు మాయమయినందుకు" అంటారు. నాలుగు వాక్యాల్లో రెండు కిలోమీటర్లల్లా ఒక కిలోమీటర్ అయిపోయినట్లుగానే, సమీర ప్రమోద్‌ల మధ్య సాగిన మూడు నెలల వియోగం సగానికి సగంగా తగ్గిపోతే బాగుండును కదా అనిపిస్తుంది.

'తెలుసుకొనవె యువతా!' అన్న శీర్షిక, 'అలా నడచుకొనవె యువతా!' అని కూడ చెబుతున్నట్లనిపిస్తుంది, దాదాపుగా అలాగే ఉండే పల్లవితో కూడిన ఒక పాట ప్రాచుర్యంతో. అయితే 'అలా నడచుకొనవె యువతా!' అని చెప్పడానికన్నట్టూ, ఒకరోజు తేడాగా 15-12-2008 'సాక్షి'లో వచ్చిన వీరలక్ష్మీదేవిగారి వ్యాసం 'నీ రెక్కలు ఎక్కడ మిత్రమా!' ఉంది. యాసిడ్ దాడి, ఆ దాడిలో పాల్గొన్న ముగ్గురు యువకుల్ని ఎన్‌కౌంటర్ చేసి కాల్చేసిన వైనం నేపథ్యంలో ప్రతిపాదించిన స్వేచ్ఛాభరిత ప్రేమలోకం గురించి రవీంద్ర కవీంద్రుని స్వగతంలా సాగుతుంది వ్యాసం.

మనోలోకాల వికాసం కోసం, చేతనను సున్నితం చేసుకోవాల్సిన అవసరాన్ని నొక్కి చెబుతూ, తాను 'గీతాంజలి' రాశాననీ, అయితే ఈ నాడు లోకంలోని కర్కశత్వం నింపిన అందరి తరపున ప్రార్థిస్తూ, చూస్తున్న సినిమాల వల్ల, వీడియోలవల్ల మీడియా కార్యక్రమాల వల్ల, అధిక ధనంవల్ల లభిస్తున్న అధిక సుఖాలవల్ల, మరెన్నో దరిద్రాతిదరిద్రమైన కార్యక్రమాల వల్ల, అనేకానేక భేషజాలవల్ల కఠినమై స్వార్థంతో గడ్డకట్టి ఎండిపోయి ఉన్న గుండెలు కరిగి కన్నులనుంచి వర్షంలా కరుణ కురిసే భాగ్యాన్ని ప్రసాదించమని కోరతానంటారు రవీంద్రులు; కాదు కాదు, ఆయన తరపున వీరలక్ష్మీదేవి.

ఉన్మాదంతో యాసిడ్ కుమ్మరించిన యువకుల్లోను, భగ్గుమన్న

మంటల బాధలో, అవమాన జ్వాలల్లో, దగ్ధమవుతున్న యువతుల్లోను ఎవరున్నారు? మనం కాదా? “ఈ దౌర్జన్య విషాద సంఘటనల వెనుక గడ్డకట్టి మొద్దుబారిన హృదయాలకు బాధ్యత లేదా?” అని ప్రశ్నిస్తూ, “అందుకే మనం కరగాలి. ప్రవహించడం నేర్చుకోవాలి” అంటూ మరో మారు టాగోర్ ప్రేమగీతాల (ను చదవమని)తో అంజలిస్తున్నారు వీరలక్ష్మి.

ప్రేమతో కరగాలి... కరిగి ప్రవహించాలి! ఈ సూత్రం దాంపత్య ప్రేమకు సైతం ఎంతో ఉపకరిస్తుంది. ప్రేమను గుండెల్లో దాచుకుంటే, దాని అనుభూతి ఎదుటివారికి ఎలా తెలుస్తుంది? అందుకే అది ప్రకటింపబడాలి. ప్రకటింపబడటమే ప్రవహించడం. అప్పుడు మనుషుల మధ్య, మనసుల మధ్య ప్రేమసామ్రాజ్యం విస్తరిస్తుంది.

(రసరేఖ, సెప్టెంబర్ 2009)

కథయిత్రి : దామెర్ల గీత
కథ : కీ బొమ్మ
ప్రచురణ : కళాదీపిక
ఏప్రిల్-మే 2009

# విధి చేతిలో ... ... 'కీ'!

చిన్న పిల్లలు ఆడుకునే బొమ్మలు...కీ ఇస్తే మాట్లాడతాయి, నడుస్తాయి, పాడతాయి, డాన్స్ చేస్తాయి... పాడుతూ డాన్స్ చేస్తాయి... వాటి డాన్స్‌కు అవే చప్పట్లు కొట్టుకుంటాయి...ఏమైనా చేస్తాయి.

మూడేళ్ళ నానీ, మూడు నెలల చంటిబాబు ఉయ్యాల్లో నిద్రపోతుంటే, భుజాలు పట్టుకుని అటూ ఇటూ కుదుపుతూ లేపేస్తాడు. వాడు కెవ్వుమంటూ ఏడుపు అందుకుంటాడు. ఇద్దరి పిల్లలకీ తల్లి, రాధికకి ఆ దృశ్యం చూసేసరికి ఎక్కడలేని కోపమూ వచ్చి, నానీని దూరంగా లాగి చెంప ఛెళ్ళుమని పిస్తుంది. చంటిబాబును ఎత్తుకుని సముదాయించి మళ్ళీ నిద్రపుచ్చేసరికి ఓ అరగంట పడుతుంది. అప్పుడు నానీని చూస్తే...అమ్మెందుకు కొట్టిందో అర్ధం కాక, బిక్కమొహంతో ఓ మూల కూర్చుని కనిపిస్తాడు. జాలేసి వాణ్ణి దగ్గరకు తీసుకుని బుగ్గలపై కారుతున్న కన్నీటిని తుడుస్తూ, అడిగితే, వచ్చీరాని

మాటలతో "కీ యిచ్చే దాన్సు (డాన్స్) చేస్తుందని..." సమాధానమిస్తాడు.

ఆపుకోలేని నవ్వుతో నానీని ముద్దు పెట్టుకుంటూ చెబుతుంది రాధిక, "వాడు కీ బొమ్మ కాదు, నీ తమ్ముడు... వాడూ మనలాగే మనిషి. మనుషులకు 'కీ'లుండవు" వాడికేం అర్థమైందో తెలీదుగాని, అర్థమైనట్టుగా తల ఊపుతాడు.

చాల సహజసుందరమైన ఈ దృశ్యం దామెర్ల గీత (నెల్లూరు) రాసిన కథ 'కీ బొమ్మ'లోది. ఏప్రిల్–మే 2009, కళాదీపికలో ప్రచురితమైంది.

రెండే రెండు సంఘటనలతో చిత్రీకరింపబడిన ఈ కథ కేవలం రెండే రెండు పేజీల చిన్న కథ. కానీ జీవితమంత సందేశం. ఈ చిన్న కథలో కథయిత్రి మనిషి జీవితాన్ని గమ్మత్తుగా ఇరికించేశారు. చక్కని శిల్పంతో నడచిన ఈ కథ చదవగానే ఇట్టే ఆకట్టుకుంటుంది.

రెండో దృశ్యం – నానీకి జీవిత సత్యం నేర్పి, మళ్ళీ వంటపనిలో పడదామనుకుంటుండగా, బయట ఏదో కలకలం, ఎవరివో ఏడుపులు... అరుపులు...వినిపిస్తే తలుపు తీసి చూసిన రాధికకు కనిపించిన దృశ్యం– జనం గుంపులు గుంపులుగా ఎదురింటికి వస్తున్నారు. ఏమిటి విషయమని పక్కింటి వనజను అడిగితే, ఇంటర్ చదువుతున్న ఎదురింటి ప్రకాష్ కాలేజీకి వెళ్తూ లారీ గుద్ది చనిపోయాడని చెబుతుంది. ఇక అక్కడ నిలవలేని రాధిక జోరుగా లోనికి వచ్చేస్తుంది.

'అక్కా!' అంటూ వచ్చి రోజూ కబుర్లు చెప్పే ప్రకాష్...నానీకి లాలీపాప్ తినిపిస్తూ సైకిల్లో షికారు తిప్పే ప్రకాషన్న...ఇక లేడా? మరి రాడా? ఆపుకోలేని కన్నీటితో వెక్కి వెక్కి ఏడుస్తుంది రాధిక.

పాపం, నానీగాడికి రెండో అయోమయం. వాడ్ని చూస్తూ తనలో తనే అనుకుంటున్నట్లుగా చెబుతుంది రాధిక, "ఇంతకు ముందు అయోమయంగా నీవన్న మాటకు నవ్వాను. కాని అది పచ్చినిజం. మనిషి నిజంగా కీబొమ్మే... కానీ కీ కనబడదు. ఆడించే ఆ దేవుడూ కనబడడు. కానీ, ఆడిస్తూనే ఉంటాడు. మనం ఆడుతూనే వుండాలి. తన ఇష్టం వచ్చినప్పుడు ఆపేస్తాడు. మనం ఆగిపోవాల్సిందే...", మరణవైరాగ్యంతో ఏమేమో అంటున్న అమ్మ ఏం చెబుతుందో అర్థం కాకపోయినా, ఆమె చెంపలపై కారుతున్న కన్నీటిని తన చిన్ని చేతులతో తుడుస్తాడు.

ఇదీ కథ. రెండు వైరుధ్యాలు...రెండు జీవిత సత్యాలు. వెంట వెంటనే జరిగిన రెండు సంఘటనల సారం – మనిషి 'విధి చేతిలో...కీ'

అనీ! అది కీలెరిగి వాత పెడుతుందనీ!

ఆరంభం, ముగింపు ఈ కథకు గొప్ప శిల్పచమత్కారాన్ని కలిగించాయి. మూడు నెలల చంటిబాబు హఠాత్తుగా కెవ్వుమని అరచి రాగం అందుకోడంతో మొదలైన కథ, వదిహేడేళ్ళ ప్రకాష్ హఠాన్మరణంతో కలిగిన దు:ఖాతిశయంతో (రెండూ హఠాత్సంఘటనలే) రాధిక చెక్కిళ్ళ మీదుగా జారుతున్న కన్నీటిని నానీ చిన్ని చేతులతో తుడవడంతో ముగుస్తుంది. మనిషి బ్రతుకే ఆద్యంతాల ఏడుపు. పుడుతూనే ఏడుస్తాడు; పోతూ ఏడిపిస్తాడు. జననం, మరణం ఎప్పుడు సంభవిస్తాయో ఎవరికీ తెలీని హఠాత్సంఘటనలు. ఈ విధంగా జీవితం మొత్తాన్ని అర్ధస్ఫూర్తితో, అమోఘంగా ఆవిష్కరించిన కథయిత్రి దామెర్ల గీత అభినందనీయురాలు.

(5-6-2009, మువ్వలు దినపత్రిక)

కథకుడు : డా॥ కర్రి శివాజీ
కథ : స్వేచ్ఛ
ప్రచురణ : స్వాతి వారపత్రిక
22.2009

# ఏది స్వేచ్ఛ?

స్వేచ్ఛ అంటే ఏమిటి?

ఉద్యోగం సద్యోగం లేకుండా, సమాజానికి ఎంతమాత్రం ఉపయోగపడకుండా, తాతలు సంపాదించిన ఆస్తితో సిన్మాలు చూస్తూ జల్సాలు చేస్తూ పెళ్ళాం పిల్లలతో ఖాళీగా గడపడం స్వేచ్ఛ అవుతుందా?

అవుతుందనుకుంటాడు వెంకటేశ్వర్లు. పైగా అటువంటివాడెవడైనా కనిపిస్తే, "అబ్బా, ఎంత ఆనందంగా ఉన్నాడు!" అని కూడా అను కుంటాడు.

అది స్వేచ్ఛ కాదని అనుకుంటుంది రుక్మిణి. పైగా, అలా అనుకోడం మూర్ఖత్వమేనని భావిస్తుంది.

సాపేక్షం!

ఏ వస్తువైనా, భావమైనా, అనుభవమైనా, అనుభూతైనా – ప్రతీదీ సాపేక్షమే. వ్యక్తుల వైయక్తిక అభిప్రాయాల్ని బట్టీ అభిరుచుల్ని బట్టీ, ఇష్టాల్నిబట్టీ

అభిమతాల్ని బట్టీ ప్రతీదీ మారుతూంటుంది. ప్రతీదీ పెద్ద గీత పక్కన చిన్నగీతో, చిన్న గీత పక్కన పెద్ద గీతో అవుతూనే ఉంటుంది.

రుక్మిణి, వెంకటేశ్వర్లు భార్యాభర్తలు. వారిద్దరి మధ్య ఏర్పడిన భేదాభిప్రాయం వారిని విడదీస్తుంది, తాత్కాలికంగా. రుక్మిణి తెలివైన భార్య. ప్రతీ మగాడి విజయం వెనుక ఒక స్త్రీ ఉంటుందన్న నానుడికి ప్రతిబింబంగా నిలుస్తుందామె. 'స్వేచ్ఛ'ను గురించి తప్పుగా అభిప్రాయపడిన భర్త వెంకటేశ్వర్లుకు కనువిప్పు కలిగిస్తుంది.

డా॥ కర్రి శివాజీ రచించిన కథ 'స్వేచ్ఛ', సి.పి. బ్రౌన్స్ అకాడమీ, స్వాతి సపరివార పత్రిక సంయుక్తంగా నిర్వహించిన సంక్రాంతి కథల పోటీలో తృతీయ బహుమతి పొందిన కథ. 22-5-2009 సంచికలో ప్రచురింపబడింది. ఈ కథలో స్వేచ్ఛ స్వరూప స్వభావాలను చక్కగా చర్చించి, అసలైన స్వేచ్ఛ తీరును, రీతినీ ఆవిష్కరించారు డా॥ శివాజీ.

వెంకటేశ్వర్లు ఆర్మీలో వెహికల్స్ మెకానికల్ ట్రేడ్‌లో సిపాయిగా చేస్తూంటాడు. కనిపించని శత్రువును కనిపెట్టుకుంటూ, మంచుకొండల్లో శీతల పవనాల్లో సరిహద్దుల్ని కాపాడుతూ చేసే జాగారాలు, కఠిన విధులు అతనికీ మధ్య విసుగు కలిగిస్తున్నాయ్. వార్షికంగా వచ్చే రెండు నెలల సెలవుమీద ఇంటికి వచ్చి వెళ్ళిందగ్గర్నుంచీ అతని దృక్పథం మారింది. తాను కోల్పోతున్న స్వేచ్ఛామయ జీవితం గురించి బాగా కలవరం పట్టుకుంది. సివిలియన్స్‌లా ఉన్న తన స్నేహితులు పొద్దున్న పనిలోకి వెళ్ళి, సాయంత్రాలు దర్జాగా భార్యలతో స్కూటర్ల మీద షికార్లు, లేకపోతే పిల్లలతో కలిసి హాయిగా టి.వి చూస్తూ కాలక్షేపం చెయ్యడం – అటువంటి చిన్న చిన్న సరదాలకి దూరమైపోతూ ఉండడం అతని కలవరానికి అసలు కారణం. స్నేహితుల్ని చూసి అతనికి అసూయ కూడా కలిగింది. దాంతో నెల రోజులు కాజువల్ సెలవు మీద మళ్ళీ ఇంటికి వస్తాడు, ఇక వెళ్ళ కూడదని నిర్ధారణగా నిర్ణయించుకున్నాకా!

ఈ విషయం తెలియని అతని భార్య రుక్మిణి, నెల రోజుల సెలవు అయిపోడంతో, అదే విషయాన్ని గుర్తు చేస్తూ అడుగుతుంది. "లీవు పొడిగించారా?" అని. "లేదు, ఇక వెళ్ళదలచుకోలేదు" అంటాడు. దాంతో ఆమెకు భర్త నిర్ణయం అర్థమవుతుంది. మనసు వికలమవుతుంది.

బి.ఎస్సీ, బి.ఇడి., చదివి స్కూల్లో సైన్స్ టీచరుగా చేస్తున్న రుక్మిణి చిన్నప్పట్నించీ 'కలాం' గురించి చదివి, ఇన్‌స్పైర్ అవ్వడంతో కాబోయే

భర్త సైంటిస్టు కాకపోయినా, దేశం కోసం పాటుపడే వ్యక్తి కావాలని కోరుకుంటుంది. అందుకే సిపాయిగా భర్తది తనకంటే తక్కువ స్థాయి ఉద్యోగమైనా, తక్కువ జీతమైనా తండ్రి మాట కాదని మరీ, ఆనందంగా వెంకటేశ్వర్లును పెళ్ళి చేసుకుంటుంది. తోటి టీచర్ల భర్తలు ఎంత పెద్ద ఆఫీసర్లయినా, తన భర్త దేశానికి ప్రత్యక్షంగా సరిహద్దుల్లో సేవ చేస్తున్నాడని, ఆ భాగ్యం అందరికీ కలిగేది కాదని బల్ల గుద్ది వాదించి ఆత్మగౌరవాన్ని పొందుతుంటుందామె. ఆమె వెంకటేశ్వర్లు జీతాన్ని కాదు, జీవితాన్ని ఆరాధించింది.

మిలట్రీవాళ్ళు వెంకటేశ్వర్లు మీద అప్రిహెన్షన్ రోల్ జారీ చేస్తే, సర్కిల్ ఇనస్పెక్టర్‌కి పదివేలు లంచం, ప్రతినెల అయిదేసి వేలు ఇచ్చే ఒప్పందంపై "ఇంట్లో లేదని రాయిస్తూ" నెట్టుకొచ్చేలా ఏర్పాటు చేసుకుంటున్న భర్తను చూసి నిర్జీవమైపోతుంది రుక్మిణి మనసు. ఆమె ఇక ఆత్మ సంఘర్షణను ఏ మాత్రమూ భరించలేక, ఒంట్లో నలతగా ఉందన్న సాకుతో పుట్టింటికి పోతుంది. వెంకటేశ్వర్లు ఒకసారి వెళ్ళినా, ఆమె ముభావంగా ప్రవర్తించే సరికి, అహం అడ్డొచ్చి మళ్ళీ వెళ్ళలేదు.

తండ్రి గ్యారేజీని అభివృద్ధిపరచి, ఆర్మీ వెహికల్స్‌ను పదేళ్ళు రిపేరు చేసిన అనుభవంతో... ఖర్చులన్నీ పోను మొదటి నెలలో ముప్పై వేలు రెండో నెల్లో రెట్టింపు సంపాదించి, కొత్తగా వచ్చి పడిందనుకున్న స్వాతంత్ర్యంతో – మనకు మనమే రాజూ, మంత్రీ... ఎవరికీ జవాబు దారులం కాదు అనే భావనతో సంతృప్తి చెందుతాడు. తన భార్య కోరుకున్న దది కాదని అతనికి బోధపడదు.

భార్య వెళ్ళేనాటికి నెల తప్పిందన్న విషయాన్ని తల్లి ద్వారా తెలుసుకున్న వెంకటేశ్వర్లు, ఆమెను చూడ్డం కోసం అత్తారింటికి వెళ్తాడు. అంత ఆనందమైన విషయాన్ని తనకెందుకు చెప్పలేదని భార్యని నిలదీస్తాడు. "మీకు చెప్పాలనిపించ లేదు..." అంటూ, "అంటే, నేనెంత దారుణంగా దెబ్బ తిన్నానో ఊహించండి" అంటుందామె. ఎందుకంటే, "నువ్వొక సైనికుడి బిడ్డవని" పుట్టబోయే బిడ్డ చెవిలో సగర్వంగా చెప్పాలనుకుందామె.

తాను మిలట్రీలో కంటె బాగా ఎక్కువే సంపాదిస్తున్నా నంటాడు వెంకటేశ్వర్లు. సొంత ఇల్లు కట్టుకుని సుఖంగా ఉండడమే తన ఆలోచన అంటాడు. అవన్నీ సరికాదంటుంది రుక్మిణి.

ఎంతైనా రుక్మిణి తెలివైనది. భర్త డ్యూటీకి తిరిగి వెళ్ళనని చెప్పిన

రోజునే ఎదిరిస్తారు సగటు ఆడాళ్లు. అదే అంటుందామె. "ఆ రోజే ఎదిరించి చెబితే, మీరిచ్చే సంజాయిషీకి బహుశా, మీ వాదనే కరెక్టేమోనని సమాధాన పడిపోయి ఉందును", అంటూనే, "అయినా చేసేదేముంది? మీరు ఇంటికి వెళ్ళండి. డెలివరీ తర్వాత నేనూ వచ్చేస్తాను. మళ్ళీ మీ భార్యగా అంతకు ముందటిలా ఉండలేనేమోగాని, మన బిడ్డకి ఒక తండ్రి కావాలి కదా... మనమూ అందరిలానే బతికేద్దాం, మీరనుకునే ఆనందంతో" ఇనుమును బాగా కాల్చిన తర్వాతే వంచగలం. అలాంటి దెబ్బే ఇది. అయితే, ఆమె ఇనుమును కాల్చిన వైనంలోనే ఉంది కదా ఔచిత్యమంతా.... ఔన్నత్యమంతా!

"మీరలా ఆర్మీని వదిలేసి ఓ పిరికివాడిలా పారిపోయి వచ్చారంటే భరించలేకపోయాను" అంటుంది. పిరికితనమంటే శత్రువుని చూసి పరుగెత్తుకు రావడమే కాదు. మన బాధ్యతకి వెన్ను చూపించడం కూడా పిరికితనమేనని వివరిస్తుంది, ఆధునిక మాంచాలయై! అలా వెంకటేశ్వర్లు 'స్వేచ్ఛ' అనుకున్నదానికి మరో పార్శ్వం పిరికితనమని తెలియచెబుతుంది.

బాగా కాలితేనే గాని ఇనుముని వంచలేం. ఆ ప్రయత్నాన్ని గొప్పగా నెరవేరుస్తుంది రుక్మిణి. "దేశం మీమీదొక బాధ్యతని పెట్టింది. అది మరచిపోయి... 'స్వేచ్ఛ' కావాలని మీరు దానినుంచి దూరంగా పరుగెత్తారు" అని చెబుతూ, ఎంతైనా టీచరు కదా, తాను చెప్పబోతున్న ఉపమానానికి క్షమించమంటూనే, అంటుందిలా, "నా కడుపులో ఉన్న మన బిడ్డ స్వేచ్ఛ కావాలని నా కడుపుని చీల్చుకుని బయటకి వచ్చేద్దామని ప్రయత్నించదు కదా! .. స్వేచ్ఛ అనేది మన కర్తవ్యాన్ని నిర్వర్తించినపుడే లభిస్తుంది" – జ్ఞాన బోధ చేస్తుంది.

ఈ సందర్భంలో కథకుడు కథలోని వాస్తవ సంఘటనని తీసుకొని కథనాన్ని అద్భుతంగా రక్తి కట్టించారు. బిడ్డ కడుపు చీల్చుకొని బయటికి రావాలని చూస్తే తల్లి మరణిస్తుంది. అలానే, పౌరులు అందునా బాధ్యత గల పౌరులు విధినిర్వహణ నుంచి స్వేచ్ఛను కోరుకుంటే, వ్యవస్థ నాశనమౌతుంది. పైగా, ఈ సందర్భంలో రుక్మిణి స్థానంలో భారత మాత గోచరించేలా చాలా నేర్పుగా, చెప్పకుండానే వ్యంజింపగలిగారు కథకుడు. సైనికులు భారతమాత ముద్దు బిడ్డలు. వారు స్వేచ్ఛ కోరుకుంటే దేశ ప్రాదేశిక సమగ్రతనీ, సార్వభౌమత్వాన్నీ పణంగా పెట్టినవారే అవుతారు. అంతటి బాధ్యతాయుతమైనది వారి విధి నిర్వహణ.

"అందరూ సంసారాలు చేస్తారు. పిల్లల్ని కంటారు. ముసలివాళ్ళై చనిపోతారు. కానీ ఓ సైనికుడికి మరణం లేదు. చాలా గొప్పవాళ్ళు సైనికులు... మీరు వాళ్ళలో ఒకరని ఇన్నాళ్ళూ గర్వపడ్డాను" అంటూ, అభావంగా వెంకటేశ్వర్లు వైపు చూస్తూ ఉండిపోతుంది, రుక్మిణి. ఆమె అభావంగానే ఉందిగానీ, ఆమె ప్రవర్తన, ఆమె చెప్పిన తీరు వెంకటేశ్వర్లు భావాల్ని మార్చింది. అతని భావాల్లోని డొల్లతనాన్ని అతనికే అర్థమయ్యేలా చేసింది. ఈ విధంగా, వెంకటేశ్వర్లుకు తన విధి నిర్వహణలోని బాధ్యతని, అందులో ఉన్న ఔన్నత్యాన్నీ నాటకీయంగా వివరిస్తుంది. చదువుకున్న తెలివైన ఉపాధ్యాయినిగా, బాధ్యతాయుతమైన భార్యగా రుక్మిణి.

ఇక చెప్పేదేముంది? వాలంటీర్‌గా డ్యూటీలో రీజాయిన్ కావడానికి నిర్ణయించుకుంటాడు వెంకటేశ్వర్లు. జీవితంలో మొట్టమొదటిసారిగా సంపూర్ణ స్వేచ్ఛ లభించిన భావంతో పులకించిపోతూ అందరికీ ఆదర్శవంతుడవుతాడు.

బాధ్యత లేని స్వేచ్ఛ పిరికితనమనీ, పలాయనవాదమేననీ నిరూపించారు కథకుడు శివాజీ. బాధ్యతతో కూడిన స్వేచ్ఛ సంపూర్ణమవుతుందని చెబుతూ, స్వేచ్ఛకీ పిరికితనానికీ, స్వేచ్ఛకీ పలాయనత్వానికీ మధ్యనున్న తేడాని ప్రస్ఫుటం చేస్తూ సన్నపాటి విభజన రేఖ గీసి చూపించారు కథకుడిగా శివాజీ.

యథేచ్ఛగా ఆంగ్ల పదాలను వాడితే తప్పనికాదు కానీ, తెలుగు కథను సాధ్యమైనంత తెలుగుదనంతో నింపితే ఇంకా బావుండేది. హృదయాన్ని పట్టి పిండేసేంతగా కదిలించకపోడానికీ ఇదో కారణమనిపిస్తుంది. అయితే, సమగ్రావగాహనను కలిగించే సందేశాత్మక కథ 'స్వేచ్ఛ'. దాని సందేశమే దాని బలం.

మొదటి తెలుగు కథ గురజాడవారి 'దిద్దుబాటు'లోని కమలినిని స్ఫురింపజేస్తున్న రుక్మిణిని, ఆమెను సృష్టించిన డా॥ శివాజీని తెలుగు కథ వంద సంవత్సరాల సందర్భంగా అభినందిస్తున్నాను.

(చినుకు మాసపత్రిక, అక్టోబర్ 2009)

కథయిత్రి : ఎం.వి.వి.ఎస్ సౌమ్య
కథ : కంచె
ప్రచురణ : చినుకు, మార్చి 2010
ఉపాధ్యాయవాణి
జూన్ 2010

(కథ రాసిన తేదీ 16.7.2004; కథయిత్రి ఎనిమిదో తరగతి చదువుతుండగా...)

# మౌలిక విద్యాసత్యాలను ఆవిష్కరించిన 'కంచె'

"రెండూ మొక్కలే"

ఒకటి ఇంటి గుమ్మం ముందు కంచెలో ఉంది. ఇంకొకటి దానిక్కాస్త దూరంగా రోడ్డువార... దానిచుట్టూ ఏ కంచె లేదు. హాయిగా ఉంది.

కంచెలో మొక్కకి నీరు పోసినా సరిగా ఎండ తగలక మోడుగా మారిపోయి నిటారుగా ఉంది. రోడ్డపక్క మొక్క కాలువ నీటితో బతికేస్తూ ఆకులు తొడిగి గాలికి హాయిగా ఊగుతోంది. ఆకుల బరువుకి కాస్త వంగి ఉంది జ్ఞానవృద్ధుడిలా!"

ఈ ముగింపు వాక్యాలు, ఎం.వి.వి.ఎన్. సౌమ్య రాసిన కథ 'కంచె 'లోవి. కంచెను ప్రతీకగా తీసుకుని రెండు మొక్కల ఎదుగుదలల్లోని వ్యత్యాసాన్ని తులనాత్మకంగా విశ్లేషించారు కథయిత్రి.

ఒకటి ఇంటి గుమ్మం ముందు కంచెలో... మరొకటి రోడ్డువార ఏ కంచె లేకుండా!

కంచె రక్షణకు సూచన. అదీ కాక, కంచెలో

మొక్క ఇంటి గుమ్మం ముందుంది. అంటే, దాన్ని కావాలని వేసుకున్న మొక్క. అందుకే దానికి నీరు సక్రమంగా అందుతోంది. అయినా అది 'హాయిగా'లేదు. చుట్టూ కంచెలో లేని మొక్క కాలువ మురికినీళ్ళతోనే ఆకులు తొడిగి గాలికి హాయిగా ఊగుతోంది. కంచెలోని మొక్క సరిగా ఎండ తగలక మోడుగా మారిపోయి నిటారుగా ఉంది. నిటారుగా ఉండడమంటే, ఆకులు వేయలేదని. అంటే భవిష్యత్తులో అది కొమ్మలు వేయదని వ్యంజనం.

ఇక్కడ కీలకమైన ప్రతీకలు ఎండ, కాలువ కుళ్ళు నీరు. ఎండ, జీవితంలోని ఆటుపోట్లకు ప్రతీక. అలాగే కాలువ కుళ్ళు నీరు కూడా రక్షింపబడని జీవితానికి సంకేతం. కంచె సురక్షిత జీవితానికి ప్రతీక. రక్షణవలయంలో, ఆటుపోట్లనేమీ ఎరుగని జీవితానికి సంకేతం.

చిన్నప్పట్నించీ మరగకాచి చల్లార్చిన నీరు తాగిస్తుంటే, సహజ సంక్రామ్యత చచ్చిపోతుంది. ఎప్పుడైనా ఏ ఊరైనా వెళ్ళినపుడు, తప్పని పరిస్థితిలో మామూలు నీరు తాగితే, వెంటనే జలుబు చేసేస్తుంది, సహజ నిరోధక శక్తి తగ్గిపోతుందిగా! అదే ఎక్కడపడితే అక్కడ తిరుగుతూ, మట్టిలో ఆడుకుంటూ, ఏ నీరు పడితే అది తాగే కుర్రాడికి జలుబులూ జబ్బులూ రావు. షాపింగుకోసం వెళ్తున్న హైటెక్ తల్లులు, రోడ్డువార మట్టిలో పొర్లే పిల్లల్ని చూసి, "వీళ్ళింత మురికిగా బతుకుతున్నా వీళ్ళకే జలుబూ చేయదు, ఏ జబ్బూ రాద"నుకునే మాటలు వింటుంటాం. నిజానికి ఏ మట్టిలోంచి మనిషి మొలుచుకొచ్చాడో ఆ మట్టిలో ఆడుకోడమే ఆరోగ్యం. ఇది పుట్టిన తర్వాతి పేగుబంధం.

పైగా, కంచె ఎండ తగలకుండా ఆపుతోంది. అంటే, తల్లిదండ్రుల అతి జాగ్రత్త...వారు తమ చిన్నతనంలో ఎంతో కష్టపడిన జీవితం తమ పిల్లలకు రాకూడదనుకోడం...అటువంటి జీవితాన్ని పిల్లలకి ఇవ్వకూడదని వాళ్ళు అడిగినవాటిని అడిగిన వెంటనే ఇవ్వడం, సకల సౌకర్యాలతోనూ కష్టమంటే ఏమిటో తెలీకుండా పెంచడం, ఆఖరుకు చదివే స్కూల్లో ఏ.సి ఉందో లేదో అన్నంతవరకు పోయిందీ పిచ్చి...ఇదేదో గొప్ప అనుకుంటున్నారు. ఎంత కష్టపడితే పైసా వస్తుందో పిల్లలకు చిన్నప్పట్నించీ తెలియజేయాలి.

అనుకోని 'ఒత్తిడికట్టడి'లో చదువుల భాగోతం సాధించేదేమిటో ప్రతీకాత్మకంగా తెలియచెప్పిన కథ 'కంచె'. ఒత్తిడికట్టడి సాధిస్తున్నదేమిటి?

విద్యార్థుల ఆత్మహత్యలు. ఎండ తగలక మోడువారిన మొక్క దశ తరువాత ఎండిపోయి అంతం కావడమే!

రెండు మూడు, చాలా సహజమైన దృశ్యాలతో కథను ఏమాత్రం రాయాలని కాక, చెప్పాలనుకున్నదేదో అలవోకగా చెప్పేసిన కథ ఇది. అయినా, ఒక శిల్పం – ప్రణాళికాబద్ధంగా రాసిన కథలా దీన్ని మార్చేసింది. కథ చదవడం మొదలుపెట్టగానే పాఠకుణ్ణి ఏమార్చే కథనం. కళ్ళు అక్షరాలవెంట పరుగులు తీస్తాయి.

తొక్కుతున్న సైకిలు చక్రంలో గాలి హఠాత్తుగా తగ్గిపోతే, చుట్టూ పరికిస్తే, పక్కనే సైకిల్ షాపుంటే, "కరక్టు చోటుకే వచ్చి ఆగిం"దనుకున్న ఒక పాజిటివ్ దృక్పథంతో కథ మొదలవుతుంది. చూస్తే ఇద్దరున్నారు, ఇద్దరూ కుర్రాళ్ళే! ఒకడికి ఎనిమిదో తొమ్మిదో ఉంటే, ఇంకొకడిది మరో రెండు ఎక్కువ, వయసులు.

ఇద్దరిలో చిన్నోడు అందుకుంటాడు సైకిలు, "అక్కా! ఏంటి?" అని అడుగుతూ.

"వాణ్ణి చూస్తే అప్పుడే పుట్టిన లేగదూడలా ఉన్నాడు. కాకపోతే కాస్త నలుపంతే. సరిగా సైకిల్ చక్రం అంత ఎత్తే ఉన్నాడు. చొక్కా నిక్కరూ వేసుకున్నాడు. చొక్కా బాగా మాసిపోయి ఉంది. ముఖం మాత్రం కళగానే ఉంది"

"గాలి కొట్టు", వాడు పంపు అందుకుంటుంటే, "పాచ్ పడిందేమో అది కూడా చెక్ చేసెయ్"–ఇలా సంభాషణతో మొదలైన కథ అటువంటి సహజ సంభాషణలతోనే ఆద్యంతం నడుస్తుంది.

అందీ అందని హ్యాండిల్ బార్ పట్టుకుని సైకిల్ని ఆ వేపుకి తీసుకెళ్ళి స్టాండ్ వేసి వాడు పనిలోకి దిగుతాడు. వాణ్ణి, వాడి పనితనాన్ని చూసి మురిసిపోతూ, సహజంగా బుర్రలోకి వచ్చిన అనుమానాలను ప్రశ్నలుగా మార్చి అడుగుతుంది సైకిలమ్మాయి (కథయిత్రి).

పని ఎంతబాగా, చకచకా చేసేస్తున్నారో! కానీ, ఇంత చిన్న వయసులో చదువుకోకుండా ఈ పనీ గినీ ఏంటో? ఆటల్లేవు, పాటల్లేవు. పాపం, మట్టి కొట్టుకున్నారు. చక్కగా అందరు పిల్లల్లా ఉండడానికి లేదు. వాళ్ళని చూస్తే జాలేసింది కథయిత్రికి.

"ఏరా, ఏమన్నా చదువుతున్నావా?"

"ఆ! రెండో కలాసక్కా!"

"మరి స్కూలు కెళ్ళకుండా ఇక్కడున్నావేంటీ?"

"మా బడి పొద్దుటే ఉంటాది. మజ్జానంనుంచీ సెలవు. అప్పుడు బువ్వ తినేసి, అన్నా నేనూ షాపుకొచ్చేత్తాం"

అసలీ భాషంటేనే గలీజు మన నాగరీకపు తల్లిదండ్రులకి. ఆ ఎదవ స్కూళ్ళలో అలగాజనంతో ఇదే నేర్చుకుంటారనుకుంటారు. ఈ సహజ సజీవ భాషను అడ్డుకోకూడదు. మొదట ఎలిమెంటరీ స్థాయిలో పిల్లాడు తనకి వచ్చిన భాషలోనే మాట్లాడుతాడు. మాట్లాడనివ్వాలి. లేదంటే వాడి భావ వ్యక్తీకరణ శక్తి, అభివ్యక్తి రీతి నశిస్తాయి. ఆ తర్వాత మనం కోరుకునే కృతక నాగరీకపు భాషని నెమ్మదిగా వాడే నేర్చుకుంటాడు.

"మరెప్పుడు చదువుకుంటావు స్కూల్లో మాష్టారు చెప్పినవన్నీనూ?"

"రాత్రి బువ్వ తినేసి చదివేసుకుని పడుకునిపోతాను. మా కలాసులో నేనే ఫస్ట్ అక్కా!"

"అబ్బో! వెరీగుడ్. నీకే సబ్జక్టు బాగా ఇష్టమేంటి?"

"తెలుగు భలే ఉంటుంది కదక్కా. అన్నీ కతలే. లెక్కలయితే పుస్తకం కూడా ముట్టుకోక్కర్లేదు. అన్నీ కూడ్డాలు, తీసేడాలు, గుణించడాలు, భాగేయడాలూనూ. మా స్కూల్లో అయ్యన్నీ ఉప్పుడు నేర్పుతున్నార్గానీ, నాకయ్యన్నీ ఎప్పుడో వచ్చేసు..."

"ఎలాగో?"

"షాపుకొచ్చినోళ్ళందరూ డబ్బులిత్తారా. అయ్యి నేను లెక్క చూసుకోవాలా. మిగిలినియ్యి ఇయ్యాలా మరి. అలాగన్న మాట"

ఇంత సహజమైన సంభాషణలతో కథ అలా అలా నెమ్మదిగా, ఒడిదుడుకుల్లేకుండా సాగిపోతుంది.

మన అతి, విపరీత వెర్రితలలు వేస్తున్న నాగరీకపు తెలుగుభాషాదేశపు పాలకులకూ, తల్లిదండ్రులకూ అసలు తెలుగు అవసరమే లేని పదార్థం. ఎలిమెంటరీ స్థాయినుంచే పిల్లలు ఎంగిలి ఇంగ్లీషులో మాట్లాడేయాలి. అందులోనే నవ్వాలి, ఏడ్వాలి. లేదంటే ఫైనులు కట్టాలి.

పాఠశాల, జీవితంనుంచి నేర్చుకోడాన్ని తెలియజెప్పాలి. మన సోకాల్డ్ సాఫిస్టికేటెడ్ కార్పోరేట్ పాఠశాలల్లో చదువొక్కటే జీవితంగా లభించే 'శిక్ష'ణ మాత్రమే దొరుకుతుంది. చదువుతప్ప జీవితంలో మరేమీ ఉండవు. చదువు...చదువు...చదువు! ఒత్తిడిముట్టడి!! ఫలితం ఆత్మహత్యలు.

"ఎంతిమ్మంటావ్?"

"రెండ్రూపాయలక్కా",

వాడి లెక్కల పాండిత్యం తెలుసుకోడానికి చిల్లరున్నా పదిరూపాయల నోటిస్తుంది కథయిత్రి. వాడు చక్కగా లెక్కలేసి మిగిలిన డబ్బులిస్తాడు.

ఆఖరి అనుమానం మిగిలిపోయింది కథయిత్రికి – "మరి ఉదయమేమో స్కూలుకి వెల్తావ్. తరువాతేమో ఇక్కడికొచ్చేస్తావ్. ఆడుకోవా?"

"ఎందుకాడుకోనూ! పనున్నప్పుడది చేత్తా. లేకపోతే టైర్లు దొర్లించుకుంటూ బండాట ఆడుకుంటాను. ఇందాకేమో గాలి కొడతా గంతులేశానా!"

వాడి సమాధానంతో సమాధానపడి, ముద్దుగా అప్రయత్నంగా వాడి తలని నిమిరి, సైకిల్ తీసుకుని వస్తుంటే ఏదో స్కూల్ బస్ అడ్డొచ్చి ఆగుతుంది. ఓ పిల్లాడు దిగుతాడు. బాగా అలసిపోయి యూనిఫాం, టై, బెల్టు, షూస్ అన్నీ వేసుకుని బొకేలో చుట్టిన వాడిన పువ్వులా ఉన్నా నీటుగానే ఉన్నాడు.

కంచెలో పెరుగుతున్న ముంగిలి ఇల్లే వాడిది. మోయలేక మోయలేక మోసుకొచ్చిన పుస్తకాల బ్యాగ్ వరండాలో పాడేసి, వెంటనే బంతి తీసుకుని ఆటలో పడతాడు. వాళ్ళమ్మ బ్యాగ్‌లో కనబడిన ప్రోగ్రెస్ కార్డు చూస్తుంది. టీచర్ పంపిన సమాధానపత్రాలు కూడ చూస్తుంది.

"ఏరా! ఫైవ్+త్రీ+టూ+వన్= టెన్ అని బాగానే వేసావు కదా! టెన్ మైనస్ టూ = ఫైవ్ + డేష్‌లో ఏం వెయ్యాలో తెలీదురా వెధవా. నిన్నిందుకేనా ఇంతింతి డబ్బులుపోసి కాన్వెంటులో చదివిస్తున్నది? ఆ సైకిల్ షాపు కుర్రాళ్ళా ఏ దుంపల బడిలోనో పాడేస్తే పోయేది. అది రాయకపోవడం వల్ల ఏడో రాంకులోకి పోయావు"

"ఆ మోహన్‌కేనా ఈ సారి కూడా ఫస్ట్ రాంకు. వాణ్ణి చూసైనా నేర్చుకో!" – పిల్లల్ని ఇలా వేరెవరితోనో అస్సలు పోల్చి చూపించకూడదు. విద్యామానసిక శాస్త్రపరంగా ఇదెంతో తప్పు. ఇటువంటి పోలికలు పిల్లాడిలో న్యూనతాభావాన్ని పెంచుతాయి. కానీ, తల్లిదండ్రులు చేసేదదే!

"ట్యూషన్‌కి రడీ అవ్వు" తల్లి గర్జించేసరికి, ఏడుపందుకుంటూ, "మమ్మీ ఇవాళెళ్ళను. ఆడుకుంటా"నంటాడు.

"చంపుతా వెధవా" అంటూ నాలుగు వడ్డిస్తూనే రెండు బిస్కెట్లు

నోట్లో కుక్కితే వాడు ఏడుస్తూనే మింగుతాడు. బ్యాగ్ భుజానికి తగిలించుకుని ఏడుస్తూనే బయటికొస్తాడు...ఏడుస్తూనే నడుస్తుంటాడు.

"అరే! ఎందుకురా ఏడుస్తున్నావ్? అమ్మ నీ మంచికేగా చెప్పింది! ట్యూషన్‌లో చదివేసుకుంటే రాత్రొచ్చేసి పడుకోచ్చు"ఓదారుస్తూ అంటాడు సైకిల్ షాపు చిన్నబ్బాయి.

"అరె, గిరె ఏంటీ. నీపని నువ్వు చూస్కో!" పొగరుగా అంటూ పోతాడు వాడు.

సాలోచనగా కథయిత్రి అనుకుంటుంది – "ఆ పిల్లాడు బడి పాఠాలు మాత్రమే నేర్చుకుంటున్నాడు. అదీ ఏడుస్తూ. సైకిల్ షాపు కుర్రాడు పాఠాలతో పాటూ ఇంకేదో నేర్చుకుంటున్నాడు... అవును, వాడు బతుకు పాఠాలు నేర్చుకుంటున్నాడు. బతకడం నేర్చుకుంటున్నాడు. జీవించడం నేర్చుకుంటున్నాడు."

వాడిమీద జాలిపోయి అభిమానం పెరిగిందంటుంది కథయిత్రి.

సైకిలెక్కుతూ, అప్పుడు చూస్తుంది, రెండు మొక్కల్నీ!

(?-?-2010, జనస్పందన దినపత్రిక)

కథకుడు : చలసాని ప్రసాదరావు
కథ : మాష్టర్స్ పీచు
ప్రచురణ : ఆదివారం ఆంధ్రప్రభ
8.7.2012

# మాష్టర్ పీసు (చు)ల్లోని కళామర్మం

ఆదివారం ఆంధ్రప్రభలో 8 జూలై 2012న ప్రచురింపబడిన చలసాని ప్రసాదరావు కథ 'మాష్టర్ పీచు' ఈ కథను ఆయన మొదటగా ఎప్పుడు రాశారో, ప్రచురించారో వివరాలేమీ లేవు. కాకపోతే, చివర 'శత్రువు' సంకలనం నుంచి అని ఇవ్వడం జరిగింది.

నేనొక ఆర్టిస్టునీ, ఆర్ట్ లవర్నీ, కళా విమర్శకుణ్ణీ కనుక ఆలస్యం చెయ్యకుండా వెంటనే కథ చదివేసాను. ఆధునిక చిత్రకళ గురించి వ్యాప్తిలో ఉన్న భావాలనే కథారూపంలో మలచి చెప్పారు.

ఈ కథ చదవగానే, నేనెప్పుడో 'ఆధునిక చిత్రకళ' గురించి రాసిన వ్యాసంలోని (మార్చి 1994 మిసిమి మాసపత్రిక) ప్రారంభ వాక్యాలు మదిలో మెదిలాయి–

"చిత్రకళాప్రదర్శన జరుగుతోంది. ప్రదర్శింపబడ్డ చిత్రాలన్నీ ఆధునిక శైలివే.

చూస్తోన్న ప్రేక్షకులలో చిత్రకళ గురించి

అంతగా అవగాహనలేని ఒకాయన ఒక చిత్రం ముందు నిల్చొని తదేకంగా చూస్తోన్నాడు. కిటికీలో నుంచి కనబడుతోన్న దృశ్యం. సంధ్యాసమయం. స్వర్ణకాంతితో మెరిసిపోతున్న ఆకాశంలో రేఖామాత్రంగా నల్లని మబ్బులు, అక్కడక్కడా. చిత్రంలో ఒక ప్రక్క కొబ్బరి చెట్టు మ్రాను; మరో ప్రక్కనుంచి ఏదో చెట్టుకు సంబంధించిన కొమ్మ మాత్రమే కనబడుతోంది. కొమ్మపైన ఊదారంగు పూలు, నారింజవర్ణంతో కనబడుతూ అక్కడక్కడ గుత్తుల్లా ఉన్నాయి. కొబ్బరిమ్రానులోని నలుపు రంగుకు బ్యాలెన్సింగా కొమ్మమీద నల్లకాకి ఒకటి ఉంది.

చూస్తోన్న ఆ వ్యక్తి అసంకల్పితంగా అన్నాడు, తన ప్రక్కనే నిల్చొని చూస్తోన్న వ్యక్తితో, 'అన్ని చిత్రాల్లోకీ యిదే బాగుంది... సహజంగా... చిత్రంలో ఏం ఉందో అర్థమౌతోంది.' ఆ రెండో వ్యక్తి వస్తోన్న నవ్వును ఆపుకోలేకపోతూనే చెప్పాడు, 'ఇది చిత్రం కాదండీ. నిజంగా కిటికీయే'నని. మొదటి వ్యక్తి ముఖం అయోమయంగా మారిపోగా అన్నాడు, 'ఏమోనండి, నాకు అన్ని చిత్రాలు అయోమయంగా అనిపించినయ్. ఒక్కటీ అర్థం కాలేదు. ఇదేనా ఆధునిక చిత్రకళంటే!"

ఆధునిక చిత్రకళ పేరిట వెర్రివేషాలు వేస్తున్న కళలో ఈ అయోమయం కనబడుతుంది. అసలైన ఆధునిక చిత్రకళలోని మర్మాలను తెలియని కొందరు కళాకారులు, చిత్రంలోని భావం క్లిష్టంగాను, చిత్రణ అయోమయంగానూ ఉంటే చిత్రం గొప్పదవుతుందనే అపోహతో ఉన్నారు. వాళ్ళు సృష్టించేవే ఇటువంటి కళాఖండాలు.

ఆధునిక చిత్రకళ గురించి వ్యాప్తిలోనున్న అనేకానేక అభిప్రాయాలను గుదిగుచ్చి కథరూపంలోకి మలచి రాశారు చలసాని. అంతకు ముందెప్పుడో కళావిమర్శకుడైన ఆయన ఆధునిక చిత్రకళ గురించి ఎన్నో వ్యాసాలు రాశారు. ఒక పుస్తకం కూడ వచ్చిందన్న గుర్తు. అయినా ఆయనకు తృప్తి కలగలేదు. ఆ విషయాలను కథరూపంలోకి మార్చి వ్యంగ్య విమర్శతో రాశారు, బహుశా ఎక్కువమందికి చేరాలని అనుకుంటా. కథైతే బాగా చదువుతారు కదా మరి!

కథలోకి వెళ్తే, సుబ్రావ్ ఒక ఆర్టిస్టు. మంచి చిత్రాలు వేయాలనే తపన కలిగినవాడు. ఒకసారి చిత్రకళాప్రదర్శనలో ఒక చిత్రాన్ని ప్రదర్శిస్తాడు. దానికే పదివేల నగదు బహుమతి వస్తుంది. అంతేకాకుండా ఆ చిత్రాన్ని మరో పదివేలకు ప్రదర్శన జరుపుతున్న ఆర్ట్గ్యాలరీ వాళ్ళు

కొంటారు. అందుకని ప్రత్యేకమైన ఆసక్తితో ఆ చిత్రాన్ని చూస్తూ నలుగురు మిత్రులు – రావు, దాసు, మూర్తి, రాజులు అందులో ఏముందో అర్థం కాక తలలు బాదుకుంటూ మాట్లాడుకుంటుంటారు. అసలు విషయం వాళ్ళు నలుగురూ ఆర్టిస్ట్ సుబ్రావ్ స్నేహితులే. వారిలో మూర్తి కొంచెం చిత్రకళపట్ల అవగాహన ఉన్నవాడు.

"మన సుబ్రావ్‌గాడు ఈ కళాఖండం ద్వారా మన మట్టి బుర్రల్లోకి ఎక్కించదలచిన మహత్తర సందేశం ఏమిటంటా"వంటూ రావునుద్దేశించి అడుగుతాడు దాసు. రావు బుర్ర గోక్కోడు, కళ్ళజోడు సవరించడు; (ఆధునిక కళను చూసి ఆస్వాదించడానికి ముందు ఇవన్నీ చేయవలసి ఉంటుందనడం వ్యంగ్యం. ఇదే వ్యంగ్యంతో మిత్రుల సంభాషణ, కథమొత్తం సాగుతుంది). అయితే రావు అసలా చిత్రంవైపే చూడడు, పైకప్పును పరిశీలించటంలాంటి అసంగత పనులేమీ చేయడు. అదే వ్యంగ్యం కొనసాగుతుంది.

అయితే అతను మాత్రం తదేకంగా చూస్తున్నాడు –ఎదురుగా కదలాడే సజీవ శిల్పాలను. అల్లంత దూరంలో ఒక శిల్పాన్ని చూస్తున్న ఇద్దరమ్మాయిల్నే అతనంత తదేకంగా చూస్తున్నాడు. మూర్తి ఎద్దేవా చేస్తాడు. "అమ్మాయిలెవర్నో చూస్తూ గుటకలు మింగుతూండటం కళారంగానికి ఇన్సల్ట్" అంటాడు రాజు. మిత్రుల మాటలకు ఉడుక్కోకపోగా, "మీ కళాభిమానం తగలెయ్య, ఏముందోయ్... ఈ సుబ్రావ్‌గాడి పెయింటింగులో" అంటాడు రావు నిర్లక్ష్యంగా!

చివరికి అది తమకు అర్థం కాదని నిర్ధారించుకున్న మిత్రులు ముగ్గురు, చిత్రకళపట్ల కొంత అవగాహన ఉన్నవాడు, సుబ్రావ్‌తో కలిసి సాయంత్రాలు గంటలగ్గంటలు కళగురించి చర్చించే మూర్తిని అందులోని కళామర్మం విప్పి చెప్పమంటారు.

"ఏమైనా సుబ్రావ్‌లో ఈమధ్య కొంచెం ప్రోగ్రెస్ కనిపిస్తుందిలే..." అంటూ మొదలెట్టి, ఆ చిత్రంలోని మర్మాలెన్నో బయటపెడతాడు. కళల్ని ఆస్వాదించాలంటే కొంతన్నా అనుభవం కావాలంటాడు. అర్థం కానంత మాత్రాన అదంతా చెత్తని కొట్టిపారేయ కూడదంటాడు. ఈమధ్య సుబ్రావ్ చాలా చదివేడు. వాంగో జీవితం చదివీ, అతని చిత్రాలు ఆల్బంలో చూసీ, వారం రోజులపాటీ లోకంలోనే లేడని చెబుతూ, సుబ్రావ్ ఈ పెయిటింగ్‌లో కొన్ని సింబల్స్ వాడాడంటాడు. పూర్వపు కళాకారులందరినీ మించి, కళారంగాన్ని జయించాలని తేల్చుకునిమరీ వేసిన చిత్రమంటూ, అందులో

విప్లవభావలున్నాయంటాడు. “ ఈ పెయింటింగులో రంగుల ముద్దలు తప్ప మరేం లేవనేగదా మీ గోల!...అంతా ఆ రంగుల్లోనే ఉంది...పై భాగంలో ముద్దముద్దగా చిక్కగా ఉన్న ఎర్రరంగు విప్లవ భావాలకు సంకేతం. మధ్యలో పసుపురంగులో కలగాపులగంగా, పెద్ద పెంటకుప్పలా కనిపిస్తున్నది చుట్టూ ఉన్న ఈ సమాజానికి సింబల్. ఇహ ఈ చిత్రం కింది భాగంలో ఉబ్బెత్తుగా ఉన్న నల్లరంగు బలిసిన పందికి సింబల్. స్వార్థం కోసం సమాజాన్ని ఛండాలంగా రూపొందనిచ్చి అందుమూలంగా లాభపడాలని చూసే దుష్ట వర్గాలకు సింబల్ ఈ పంది! ఇది ఈ పసుపు సమాజాన్ని లడ్డుండలా మింగేయాలని చూస్తోంది. ఈ సందర్భంలో ఆ నలుపుకూ ఈ ఎరుపుకూ జరిగే సంఘర్షణను ప్రదర్శించటమే ఈ చిత్రంలో సుబ్రావ్ చేసింది.”

చివరికి రాజు, దాసు తృప్తిగా తలూపినా, మూర్తి చెబుతున్నంత సేపూ మిత్రులు ముగ్గురూ మూర్తిని క్రాస్ చేస్తూనే ఉన్నారు వ్యంగ్యంగా తమ అనుమానాలతో. అవన్నీ చెప్పాలంటే కథ మొత్తం ఇక్కడ రాయాల్సి వస్తుంది. కానీ గొప్ప వ్యంగ్యవైభవంతో సంభాషణరూపంలో కథనశిల్పంలో మలుస్తూ, ఆధునిక చిత్రకళగురించి చాల విషయాలను మూర్తిని మౌస్‌పీసుగా చేసుకుని చలసాని చర్చించారు.

“మాకు తట్టనేలేదు సుమా! ‘సంఘర్షణ’ అంటే ఇదన్నమాట”, చివరికి అందరూ రాజీ కుదిరినట్లుగా బరువైన హృదయాలతో కదులుతూండగా సుబ్రావ్ వస్తాడు. మిత్రులందరూ కంగ్రాట్స్ చెబుతుంటే పొంగిపోతూ తనకు ఇరవై వేల రూపాయల మూల్యాన్ని సంపాదించిపెట్టిన తన చిత్రంవైపు గర్వంగా చూస్తూ ఉలిక్కిపడతాడు. “పదండి కాఫీ తాగుదా”మంటూ మిత్రబృందాన్ని ఎగ్జిబిషన్ హాలు దాటించి, ‘ఇప్పుడేవస్తా” నంటూ, వెళ్ళి తన పెయింటింగును తలక్రిందులు చేసి వేలాడదీసిన కళాప్రదర్శన బాధ్యుల్ని తిట్టుకుంటూ, దాన్ని సరిగా తిప్పి వేలాడదీసి చేతులు దులుపుకుంటూ వస్తాడు. ఇదీ అసలైన పతాకస్థాయికి చేరిన వ్యంగ్యం.

ఆధునిక చిత్రకళలో ఎంతో అయోమయం, అస్పష్టత ఉందనీ, అది సామాన్య మానవులకు అర్థంకాని పదార్థంగా మారిపోయిందనీ, మూర్తిలాంటి కళావిమర్శకులు దాన్ని మరింత అయోమయంతో కూడిన ‘మాష్టర్‌పీచు’ల్లా గొప్పగా కీర్తిస్తున్నారనీ ఈ కథలో చలసాని చెప్పారు.

ఈ కథకు ఆధారభూతమైన నిజసంఘటన ఒకటుంది. నైరూప్య చిత్రకళకు ఆద్యుడైన వాసిలీ కాండిన్‌స్కీ ఒకసారి తన స్టూడియోలో తాను వేయని ఒక కొత్తచిత్రాన్ని చూసి ఆశ్చర్యపోతాడు. అదెంతో అసహజంగా ఉన్నా, అర్థం కాకున్నా, చెప్పనలవిగాని గొప్ప అందంతో మెరిసిపోడం గమనిస్తాడు. దానిలో మెరిసిపోతున్న ఏదో చెప్పరాని అంతర్గత వికిరణాన్ని గమనిస్తాడు. అలా చూస్తూ మురిసిపోతుండగా, ఠకీమని స్ఫురిస్తుంది, అది తన చిత్రమేననీ, తలక్రిందులుగా ఉంచబడిందనీ. కానీ ఆ పరిశీలన నుంచి ప్రపంచ ప్రసిద్ధిగాంచిన నైరూప్యకళను ఆయన సృష్టించాడు. ఆబ్‌స్ట్రాక్ట్ ఆర్ట్‌కే (నైరూప్యకళ) పితామహుడిగా గుర్తింపు పొందాడు.

ఈ నేపథ్యాన్నంతా చలసాని ప్రసాద్ ఈ 'మాష్టర్ పీసు'లో అద్భుతరీతిలో కథలాగా మలచి చెప్పారు. అసలు ఆధునిక కళపట్ల సానుభూతి ఏమాత్రం లేదేమో అనిపించేలా కథలోని సంభాషణలను నడిపారు. కానైతే చివరికి అంతర్లీనంగా ఒక సందేశం వినిపించారు. అదేమంటే – నైరూప్యకళ పుట్టిన సందర్భాన్నే గమనించి కళాకారులు అసంబద్ధమైన చిత్రాలను సృజిస్తున్నారు తప్ప, అసలు కాండిన్‌స్కీ రూపొందించిన నైరూప్య నియమాలను గమనించడమే లేదు. అందుకే ఆధునిక చిత్రకళ అభాసు పాలవుతోందన్నదే!

నిజానికి నియమాలు తెలుసుకుని చిత్రిస్తే, ఆధునిక చిత్రణ పద్ధతి చిత్రకారునికో వరం. ఏదైన ఒక భావాన్ని సంప్రదాయ పద్ధతిలో చిత్రించేటప్పుడు సూత్రపరంగా, సాంకేతికపరంగా ఎన్నో పరిమితులుంటాయి. సాంప్రదాయ పద్ధతిలో ఎంత నైపుణ్యంతో చిత్రించినా, ఈ పరిమితులవల్ల చిత్రకారుడు తానాశించిన రసాన్ని సృష్టించలేకపోవచ్చు. అదీగాక, ఎన్నో వందల సంవత్సరాలనుంచీ చూపిస్తున్న సహజచిత్రణలో ఏ విధంగా కొత్తదనాన్ని సృష్టించగలుగుతాడు? చూపిందే చూపి చూపి తాను విసుగు చెందడమే కాకుండా, తన ప్రేక్షకులకు కూడా విసుగు కలుగకుండా చూసుకోవాలి కదా!

చుట్టూ ఉన్న కొండలూ కోనలు, చెట్లూ పుట్టలు, ఆకాశం నీరు మనం నిత్యం చూసేవే. ఈ పరిమితమైన రూపాలను, స్థూలజగతి యదార్ధ స్వరూపాన్ని అదేపనిగా చిత్రిస్తూ ఏవిధంగా అదనపు అందాన్నీ, ఆకర్షణనూ పదేపదే చూపగలడు? భావమెంత ఉన్నతమైనా, దాన్ని చూపే, సంకేతపరచే రూపాలు సుపరిచితమైనవి అయినప్పుడు చిత్రంలో వెల్లడయ్యే ప్రత్యేక

ఆకర్షణ ఏముంటుంది? ఈ ఆలోచనలే ఆధునిక చిత్రకళ ఆవిర్భావానికి నాంది పలుకుతూ పునాది వేశాయి.

ఈ నేపథ్యంలో వివేచిస్తే, చిత్రకారుడు ఎటువంటి పరిమితులకు లోబడకుండా, సాంప్రదాయ పద్ధతిలో కాకుండా, ఆ పద్ధతులను లెక్కచేయని క్రొంగొత్త రీతుల్లో తన భావానికి అనుగుణమైన రంగుల్లో రూపాల్లో రేఖల్లో ప్రాణం పోసి, తానాశించిన ప్రత్యేకాంశాన్ని దృశ్యీకరిస్తూ ప్రేక్షకుని అనుభూతికి అందించగలగడమే ఆధునిక చిత్రకళ.

అందువల్లనే వాస్తవంనుంచి విడివడి సహజరూపాల సౌందర్యాన్ని అసహజరూపాల్లోకి అనువదిస్తూ, ప్రకృతి రూపాలను వికృతపరుస్తూ కొత్త కొత్త రూపాలను సృజిస్తూ, మూడు ఆయతనాల వాస్తవికతను త్రోసిరాజని రెండు ఆయతనాల చిత్రణతో స్థిరమైంది. పొడుగు, వెడల్పులతో పాటు, లోతును కూడ చూపడం మూడో ఆయతనం. దీనితోనే అత్యంత వాస్తవికత, అంటే వెలుగునీడలతో ఫొటోలా ఉన్న చిత్రాలను సృజించడం మొదలుపెట్టింది చిత్రకళ. ఫొటోగ్రఫీకి అత్యంత సమీపంగా అర్థంలేని విధంగా పరిణమించింది. తద్వారా రంగుల వెలుగునీడలకు కాకుండా, స్వచ్ఛమైన రంగుల కాంతులకు తావిచ్చింది ఆధునిక చిత్రకళ.

ఇంతకంటే ఎక్కువ చెబితే పాఠకులకు విసుగు కలుగుతుందని భావిస్తూ, ఆధునిక చిత్రకళనే ఒక నైరూప్య భావనని కథారూపంలో అద్వితీయంగా రూపొందించి, సామాన్యుల ఎరుకలోకి తీసుకువచ్చిన చలసాని ప్రసాదరావుగారికి అంజలి ఘటిస్తున్నాను.

(7-7-2012 ఈరోజు దినపత్రిక)

కథయిత్రి : శారద
కథ : అందవిహీన
ప్రచురణ : ఆదివారం ఆంధ్రజ్యోతి
**22.7.2012**

# శారీరక కురూపం వెర్సస్ హృదయ కురూపం

సౌందర్యం!

రెండు విధాలు; బాహ్యం, అంతరం.

బాహ్యం శరీరానికి చెందితే, అంతరం అంతరంగానికి చెందుతుంది.

బాహ్యం శరీరానికి అంటే, కనిపించే రూపానికి చెందుతుంది. అంతరం అంతరంగానికి అంటే, కనిపించని మనసుకు చెందుతుంది.

బాహ్యం కనిపించేది అంటే, రూపం కలిగినదవుతుంది. అంతరం కనిపించనిది అంటే, రూపం లేనిదవుతుంది.

రూపం కలది అంటే, మూర్తం అవుతుంది. రూపం లేనిది అంటే అమూర్తం అవుతుంది.

బాహ్యంగా కనిపించే శారీరక రూపం కలిగిన మూర్తసౌందర్యం కంటే అంతరంగా కనిపించని రూపంలేని మానసిక అమూర్త సౌందర్యం గొప్పదని ఉదాత్తమైందని సాధారణమైన

లోకాభిప్రాయం. ఎంత సాధారణం అంటే సర్వసాధారణం.

బాహ్యసౌందర్యం కంటే అంత:సౌందర్యం అసలైన సౌందర్యంగా భావింపబడుతుంది.

ఈ రెండు సౌందర్యాల నేపథ్యంతో సౌందర్యవంతమైన జీవిత సత్యాన్ని గురించి చర్చించిన అందమైన కథ, 'అందవిహీన'. 22 జూలై 2012 ఆదివారం ఆంధ్రజ్యోతిలో వచ్చింది. రాసినవారు శారద.

అందవిహీన, అంటే అందం లేనిది. అంటే కనిపించే అందమనే సామాన్యార్ధం. అందాన్ని ఎప్పుడూ బాహ్యరూపానికి ముడిపెట్టి ఆలోచించడమే మనిషి నైజం. ఆమె అందవిహీన అంటే ఆమె అందంగా లేదనే, అందగత్తె కాదనే భావించడం పరిపాటి. కురూపి అనే రూఢీ. ఆమె ఎటువంటిది, ఆమె స్వభావం ఎలాంటిది అనే ప్రశ్నే రాదు.

అందాన్ని చూసి ఆనందించొచ్చు. కాని ఎక్కువగా ఆ అందం ముడుచుకుపోయేలా, కుంచించుకుపోయేలా కామెంట్ చేయడమే లోకసహజం. ఇది కుసంస్కారం. అందాన్ని ఆనందిస్తూ ఆనందింప జేయొచ్చు. ఇది సహృదయ సంస్కారం.

లోకంలో సహృదయ సంస్కారులకంటే, కుసంస్కారులే అధికం. ఈ కుసంస్కారం ఎంతవరకు పోతుందంటే, అందంగా ఉన్నా కామెంటే; అందవిహీనంగా ఉన్నా కామెంటే!

కుసంస్కారం హృదయ కురూపత్వం. ఈ సంస్కారానికి, ఈ కురూపత్వానికి అందమెంత కామెంట్ చేసే వస్తువో అందవిహీనం కూడ అంతే కామెంటీయమైన వస్తువు.

అందుకే సంధ్య రోడ్డుమీద పోతుంటే ఆమెను చూసి ఒకడి కామెంట్ – "ఆమె అందమే ఆమె శీలానికి రక్ష" అని. అదేదో పెద్ద జోకయినట్టు చుట్టూ ఉన్నవారు ఎస్, అమ్మాయిలయ్యిండీ ఆమెవంక చూసి హేళనగా నవ్వడం, ఎటువంటి సంస్కారం? బయట రోడ్డుమీద పదహారేళ్ళ సంధ్య ఎదుర్కొన్న మొదటి అవమానం.

అప్పటివరకూ ఆమె అందవిహీనం ఇంట్లో మాత్రమే చర్చల్లో కొచ్చేది, పెళ్ళెలా అవుతుందని. అలాగే అమ్మా నాన్నలు తప్పించి చుట్టాలెవరూ తనని ముద్దు చేయని విషయం ఆమె చిన్నప్పుడే గ్రహించింది. రెండో తరగతిలో టీచర్ పిల్లలచేత నాటకం వేయిస్తున్నప్పుడు తనకో వేషమడిగితే అదోలా నవ్వింది. ఇదంతా, ఎప్పుడూ బాధ కలిగించలేదు.

అయితే, ఇప్పుడది రచ్చకెక్కినట్లనిపించింది. అదే ఆమె తీరని అవమానానికి కారణమైంది.

ఎనిమిదో తరగతికొచ్చేసరికి ఆమె వ్యక్తిత్వం వికసించింది. ఆలోచిస్తే తెలిసింది, ప్రతివాళ్ళకీ ఏదోక ప్రత్యేకత ఉంది, ఆడపిల్లలకైతే మరీ! "కుందనపు బొమ్మలా ఉండేదొకరైతే, కమ్మగా పాడేవారింకొకరు. ఆటల్లో మగపిల్లలతో సమానంగా పరుగెత్తే శక్తి ఒకరిదైతే, రంగురంగుల బొమ్మలేయగల ప్రవృత్తి ఇంకొకరిది. ఏ ప్రత్యేకతా లేకుండా, మౌనంగా తల దించుకుని వుండేదాన్ని నేనొకదాన్నే" – ఈ ఆత్మపరిశీలన ఆమెకో ప్రత్యేకత సాధించి పెట్టింది. ఏ ప్రత్యేకతా లేని తను, చదువులో అందరికన్నా ముందుండాలని నిశ్చయించుకొంది. అంతే అప్పట్నించీ ఆమె క్లాసులో ఫస్ట్ మాత్రమే కాదు, మార్కుల్లో ఎవరూ తనను అందుకోలేనంతగా ఉండేది. విజయాన్ని కాంక్షించేవారికి ఈ మనోవైజ్ఞానిక అంశం ఒక పాఠంలా ఉండేలా క్లుప్తంగా అయినా చాల ఉత్తేజపరచే రీతిలో రాశారు కథయిత్రి శారద.

ఇంజనీరింగ్, మెడిసిన్ చదివించలేనంటే, హాయిగా కామర్స్‌లో చేరిపోయింది సంధ్య. బికాం పూర్తికాగానే బ్యాంకులో ఉద్యోగం. చేస్తూనే ఆరేడేళ్ళలో ఎం.కాం., ఎం.బి.ఏ చేసింది (ఆరేడేళ్ళు అనే సందిగ్ధం ఇక్కడ అవసరంలేదు. ఎందుకంటే, సంధ్యే స్వయంగా చెబుతున్న మాటలివి, కనుక ఎన్ని సంవత్సరాలన్నది ఆమె కచ్చితంగానే చెప్పగలుగుతుంది. చెప్పడానికి ఈ చిన్న తప్పు తప్ప, కథనంలో ఇంకేమీ కనబడలేదు). ఆ చదువుతో ఓ పెద్ద కంపెనీలో మేనేజరుగా మంచి ఉద్యోగం సంపాదించింది.

పెద్దగా కట్నం ఇవ్వలేని నాన్న పరిస్థితి, రూపం చూడగానే పెదవి విరవడం కలిసి ఆమెను పెళ్ళిచూపులకు విముఖం చేసాయి. దేవుడిచ్చిన రూపమూ, చదివిన చదువూ, చేస్తున్న ఉద్యోగం – అన్నీ కలిసి ఆమెనో ముప్పయ్యేళ్ళ కన్యగా స్థిరపరచాయి. ఇదంతా ఊహించిందే కనుక ఆమెకెప్పుడూ నిరాశ కలగలేదు.

శారీరక రూపం వెర్సస్ కురూపంలా ఆఫీసులో తామిద్దరూ– నిర్మల, తనూ! తెల్లగా, సన్నగా, పొడవుగా పెద్దకళ్ళతో నిర్మల అందగత్తె. మంచి శారీరక రూపం. నల్లటి రంగూ, చిన్న కళ్ళూ, ఎత్తు పళ్ళూ, చప్పిడి ముక్కూ. అయిదడుగులు కూడా దాటని కురచరూపం, చూస్తే

ఎవరూ మరచిపోలేని శారీరక కురూపత్వం తను.

సహజంగా ఆమెకే ఆకర్షింపబడేవారు అందరూ, సుధీర్ కూడా! తనతోపాటే ఏడాదిక్రితం తోటి మేనేజరుగా చేరాడు సుధీర్. దాదాపు నెలరోజులు పని నేర్చుకోటానికి సంధ్య రూంలోనే కూర్చునే సుధీర్, మాటిమాటికీ ఏదో వంకతో నిర్మలని కేబిన్లోకి పిలిచి మాట్లాడుతుండేవాడు. నిస్సహాయంగా చూసేది సంధ్య. ఎందుకంటే, సుధీరంటే ఒక వ్యామోహంలో పడిపోయింది. అతన్నించి వచ్చే ఆఫ్టర్ షేవ్ వాసనా, పైకి మడిచికట్టిన చొక్కా చేతులూ, నవ్వుతున్నట్టుండే కళ్ళూ, నిగనిగలాడే చెంపలూ, తెలివితేటలూ – సుధీర్!

ఆరునెళ్ళ తర్వాత సుధీర్ పెళ్ళి ప్రస్తావన తెస్తే నమ్మలేకపోతుంది సంధ్య. వెనుక రహస్యం గురించి వారం రోజులు ఆలోచించినా ఏమీ కనబడలేదు. అతనికి డబ్బవసరం లేదు; ఉన్న ఒక్కగానొక్క చెల్లెలి పెళ్ళీ తండ్రే చేసేశాడు. పోనీ ఇంకెవరూ దొరకకా అంటే, అతను మంచి అందగాడు, పెద్ద ఉద్యోగస్తుడూ. ఎవరు కాదనుకుంటారతన్ని! ఒక నిశ్చయానికొస్తూ, కారణం అడుగుతుంది – "మీ మాటలూ, తెలివితేటలూ. ప్రొఫెషనలిజమూ, వ్యక్తిత్వమూ అన్నీ బాగా నచ్చా"యన్నాడు. హాయిగా ప్రశాంతంగా పెళ్ళికి సరేనంటుంది సంధ్య. ఈ వయసులో అట్టహాసంగా పెళ్ళిపీటలమీద చేసుకోడం తనకిష్టం లేదంటే, సివిల్ మేరేజి చేసుకుని రిసెప్షన్ ఇద్దామని నిర్ణయిస్తాడు.

మోడల్ కార్డొకటి చూపిద్దామని సుధీర్ ఆఫీసు గది దగ్గరకు వెళ్తుంది సంధ్య. తలుపులు మూసుంటాయి. లోపలనుంచి మాటలు వినబడతాయి, సుధీర్, మరో కొలీగ్ అతని ఆప్తమిత్రుడు రాజశేఖర్ల సంభాషణ. సంధ్యని ఎంపిక చేసుకోడం పట్ల కారణం అడుగుతాడు రాజశేఖర్. "నీ సందేహం నాకర్థమైంది. నిర్మలలాటి అందగత్తె పక్కనున్నపుడు సంధ్యలాటి ఆడదాని మొహం ఎవరూ చూడరు కదూ? మరదే పెద్ద క్వాలిఫికేషన్!" చెబుతాడు. "అందమైన అమ్మాయిని చేసుకున్నా మనుకో, జన్మంతా అనుమానమే... ఎంతమంది ముట్టుకున్నారో, ఎక్కడెక్కడ ముట్టుకున్నారోనని...ఎక్కడికి వెళ్ళినా, ఎవరు దానివంక చూసినా మనసులో పీకులాట. ఇంతమంది ఆరాధనగా చూస్తూ వుంటే దాని మనసు మాత్రం చలించకుండా ఉంటుందా అని గుంజాటన. ఇదంతా ఎందుకు? ఎవరికీ పనికిరానిదైతే సరి...అందులో మంచి ఉద్యోగమూ, డబ్బూ,

పలుకుబడి! డోంట్ యూ థింక్ షి ఈజ్ ఐడియల్?" పగలబడి నవ్వుతో.

"నా రూపురేఖలు నాకు డిస్క్వాలిఫికేషన్ అయినప్పుడు చాలా బాధపడ్డాను. ఇప్పుడదే పెద్ద క్వాలిఫికేషన్ అయినప్పుడు బాధా, అవమానమూ వెయ్యిరెట్లుగా అనిపిస్తున్నా''యనుకుంటూ వెనుదిరుగుతుంది.

ఆ బాధా, అవమానమూ అనుభవించినవాళ్ళకే అర్థమవుతుంది. వృత్తిపరంగా నేనో ఉపాధ్యాయుణ్ణి. పరీక్షల ఇన్విజిలేషన్ సమయంలో కఠినంగా ఉంటాను. చూచిరాతల్నీ, స్లిప్పుల్నీ అంగీకరించను. చక్కగా చదవాలి, బాగా పరీక్షలు రాయాలనుకునే ఫిలాసఫీ నాది. దీన్ని నా క్వాలిఫికేషన్‌గానే నేను భావించేవాణ్ణి. అయితే ఒకసారి ఏమైందంటే, ఇన్విజిలేషన్ పూర్తయి వచ్చేసరికి, ఒక మాట చెవినిపడింది. పరీక్షల సమయంలో స్కూలుకొచ్చి చాల మానిప్యులేషన్లు చేస్తుండేవాడతడు. గుమాస్తాతో అతనన్న మాట – "ఈ రోజు మూడో నంబర్రూం సర్వనాశనం అయిపోవాల్రా! అందుకే భాస్కర్ని వేయించా"నన్నాడు. అంటే ఆ రూం, బహుశా ఆరోజు కిట్టుబాటు కాలేదన్నమాట. ఆ రూమ్‌లోని పిల్లలు స్లిప్పులు రాయకూడదన్నమాట! "మంచిదనుకున్న నా పాలసీ ఈ రకంగా కూడా ఉపయోగపడిందా"ని నిర్వేదంగా అనుకోడం తప్ప ఏం చేయగలిగాను?

అటువంటి నిర్వేదంతోనే ఆలోచనలో పడింది సంధ్య. పెళ్ళి విషయం అందరికీ తెలిసిపోయింది కనుక, ఏమీ జరగనట్టు పెళ్ళాడి అందరి ముందరా మామూలుగా వుండి పరువు నిలుపుకోడమా? పెళ్ళి రద్దు చేసుకుని వ్యక్తిత్వాన్ని కాపాడుకోడమా??

తన నిర్ణయం చెప్పడానికి సుధీర్ సెల్‌కు డయల్ చేసింది సంధ్య.

కథ ముగిసిపోతుంది. రెండింటిలో దేన్ని నిర్ణయించుకొంది? కథయిత్రి చెప్పకుండానే ముగించివేశారు. పాఠకులను గుంజాటనకు గురి చేసినా మంచి ముగింపునిచ్చిన కథయిత్రి శారదను అభినందిస్తున్నాను.

(24 జూలై 2012, వార్తాసాగరం, దినపత్రిక)

కథయిత్రి : ఎం. సరస్వతి
కథ : స్వర్గం - నరకం
ప్రచురణ : నెలవంక-నెమలీక
మాఘమాసం, 2014

# నరకంలో స్వర్గం చూసిన ఓ పేషంట్ చెప్పిన కథ

చావు పుట్టుకల పొలిమేరల్లోంచి ఒక కార్పోరేట్ ఆసుపత్రిలో 'ఏక్యూట్ రీనాల్ ఫెయిల్యూర్'కి (కిడ్నీ వ్యవస్థ పాడుకావడం) చికిత్స చేసాకా కోలుకున్న ఒక పేషెంట్ చెప్పిన కథ 'స్వర్గం - నరకం'. నెలవంక-నెమలీక మాసపత్రిక, మాఘమాసం 2014 సంచికలో ప్రచురింపబడింది. చెప్పిన కథయిత్రి ఎం. సరస్వతి. సహకారం అందించారు మరో కథయిత్రి డా॥ ఎం.వి.వి.ఎన్. సౌమ్య.

సాధారణంగా ఆసుపత్రిలో ఉండటాన్ని నరకమనే అంటారు. పొడిచే ఇంజెక్షన్లు, తగిలించే ట్యూబులు, గుప్పెళ్ళుగా మింగించే టాబ్లెట్లు ... చుట్టేపులా మూలుగులు హాహాకారాలు...

అలాగే అనుకుంటుంది కథలోని పేషెంట్- "కావలసిన వాళ్ళెవరూ కనిపించడం లేదు. ఇంకా ఏవేవో తగిలిస్తున్నారు. ఏవేవో గుచ్చుతున్నారు. నరకం కనిపిస్తోం"దని.

జీవితంలో ఇంత బాధ ఎవ్వరూ

పడకూడదు. పగవారికి కూడా ఇలాంటి బాధ కలగకూడదు. నరకం అంటే ఏమిటో కాదు; ఇదేననిపించింది.

"స్వర్గం అంటే ఏమిటి? నరకం అంటే ఏమిటి?

అవి ఎక్కడ ఉంటాయి? ఎలా ఉంటాయి?

నాకు చిన్నప్పట్నించీ అనుమానమే. కానీ యిప్పుడు నివృత్తి అయిపోయిం"దంటూ, "ఎక్కడ ఉంటాయో చెప్పేయాలా? దానికి ముందు ఈ కథ వినాల్సిం"దేనంటూ, పేషెంట్ తను ఆసుపత్రిలో చేరడానికిగల నేపథ్యాన్ని వివరిస్తుంది.

"ప్రభాత అందాలు కిటికీలోంచి చూస్తుంటే– అక్కడక్కడ మసక మసగ్గా వెలుగుతున్న దీపాల కాంతిలో మంచు ముసుగులో నగరసుందరి– సాలార్‌జంగ్ మ్యూజియంలో రెబెకా ముసుగు సుందరిని తలపింపజేస్తుంది." – స్వర్గంలాంటి నగరంలో ఆమె ఉందనుకోవాలి. ఈ పేషెంట్ మంచి భావుకురాలు. "నాలో ఒకపాలు భావుకత ఎక్కువయ్యే సరికి పాలవాడి పిలుపు వినిపించింది". అంతే అక్కణ్ణుంచీ నిమిషం విశ్రాంతి లేకుండా ఎడతెరిపిలేని ఇంటిపని. ఒంటి గంటకు తీరికైతే ఒక ముద్ద కడుపులో పడేసి, నడుం వాల్చుతుంది.

కొద్ది సేపటికి కడుపులో గడబిడ; గంటగంటకీ ఈ గడబిడతో మళ్ళా మళ్ళా మళ్ళా బాత్‌రూంకీ, బెడ్‌రూంకీ మధ్య షటిలైపోయింది. మూడు నాలుగ్గంటల్లో వాంతులు కూడా మొదలయ్యాయి. నీరసం, కదల్లేని స్థితి; ఏమిటో అర్థంకాని పరిస్థితి. చేతివేళ్ళు వంకర్లు పోతున్నాయి, అమిత మైన బాధ. కాలి వేళ్ళూ కొంకర్లుపోతున్నాయి.

అంతలో శరీరమూ ఊగిపోతోంది. 'శరీరం కూడ కొంకర్లు పోతోందా', అనుకునేలోగా ఆశ్చర్యం, మొత్తం శరీరం మెలిపెట్టే బాధ. కానీ అర్థమౌతుంది, పేషెంట్‌కు తానో అంబులెన్స్‌లో ఉన్నానని, ఆసుపత్రికి తీసుకుపోతున్నారనీ! చుట్టూ చూడ్డానికి ప్రయత్నిస్తే, అంతా అంధకారం. "ఉదయం చూసిన నగరమే ఇప్పుడు భయంకరంగా ఉందం'టూ, నరకంలా ఉందనే భావాన్ని స్ఫురింపజేస్తుంది కథయిత్రి. ఆ నరకంలో – ఆసుపత్రిలో ట్రీట్‌మెంటంతా యమనరకంలా అనిపిస్తుంది.

నీరుడు బంద్ అయింది. క్రియేటిన్ లెవల్స్ అంతకంతకూ పెరిగిపోతున్నాయి. డయాలిసిస్ చేయాలేమోనన్న మీమాంస!

డాక్టర్లంతా ఎవరికి వారే ఎంతో శ్రద్ధగా పరీక్షలెన్నో చేస్తున్నారు.

అంతా తెలుస్తూనే ఉంది. వాళ్ళను చూస్తూంటే మూర్తీభవించిన ప్రశాంతంలా కనిపిస్తున్నారు. పేషెంట్ మనసూ ప్రశాంతించింది. పరిస్థితి మెరుగైంది.

నర్సులు క్షణం క్షణం కనిపెట్టుకుని, బ్రతిమలాడి తినిపించడం, బాధ తెలీకుండా సునాయాసంగా ఇంజక్షన్లివ్వడం ... ఎంతో సేవ! ఆ సమయంలో పేషెంటుకు వారందరిలో ఫ్లారెన్స్ నైటింగేలే కనిపించింది.

ఇక ఆయాలో...ఎవరికి వారికే చేసుకోడానికి చిరాకైన పనిని కూడా వారు చిరాకుపడకుండా చేస్తున్నారు. రోజురోజూ చీర మార్చడం, బెడ్‌షీట్ మార్చడం... అమ్మైనా కానివారికి ఇంత సేవ చేస్తుందా? ఆయాలను 'ఆయమ్మ'లన్నా అది సరిపోదనిపిస్తుంది. ఒక్క డాక్టర్లే కాదు, నర్సులు, ఆయాలు. అందరూ ఎవరికివాళ్ళే ప్రాణదాతలనిపించింది. వారు దేవదూతల్లా అనిపించారు. వారందర్లోనూ మదర్ థెరెసా కనిపించింది.

జీవితంలో ఎప్పుడూ చూడని ప్రేమానురాగాలు. ఆసుపత్రిలో కోలుకుంటున్న ఆ పది రోజులూ స్వర్గసీమలో ఉన్నట్టుగా అనుభూతి చెందుతుంది పేషెంట్.

అరే! అంతకు ముందు నరకకూపంలా అనిపించిందే, ఇప్పుడు స్వర్గధామంలా అనిపిస్తోంది. ఏమిటీ తేడా? చికిత్సనుంచి విచికిత్సలోకి పడుతుందామె.

"స్వర్గమూ నరకమూ ఎక్కడున్నాయి?

ఇక్కడే కదూ! మన మనసులోనే కదూ!

మన మనఃస్థితే స్వర్గాన్నైనా సృష్టిస్తుంది....నరకాన్నైనా సరే!" స్వగతంగా అనుకుంటూ, "స్వర్గం, నరకమే కాదు, మరే స్థితైనా మానసిక స్థితి ప్రతిబింబమే"నని తీర్మానించుకుంటుంది.

కథకుడు : డా॥ యండమూరి సత్య కమలేంద్రనాథ్
కథ : పద్మవ్యూహం
ప్రచురణ : నవ్య, 2.11.2016

# వ్యసనమో పద్మవ్యూహం

"ద్యూత మాంస సురా వేశ్య ఖేట చౌర్య
పరాంగనా:
మహా పాపాని సప్తైవ వ్యసనాని త్యజేత్బుధ:

వ్యసనాలు ఏడు. జూదం, మాంస భక్షణం, సురాపానం, వేశ్యా సంగమం, వేట, దొంగతనం, పరస్త్రీ వ్యామోహం; శాస్త్రం చెప్పిన ఈ ఏడు వ్యసనాలను ప్రయత్నపూర్వకంగా విడిచిపెట్టాలి.

ఏడు వ్యసనాలను దుష్ఫలితాల తీవ్రత దృష్ట్యా అదే వరుసలో చెప్పడం జరిగింది. అన్నిటికంటె ప్రమాదకరమైన వ్యసనం జూదం.

గుర్రప్పందాలు, పేకాట, పాచికలు, క్యాసినో, రమ్మీ...జూదంలో ఒకటి కాదు, పది కాదు, పదివేల రకాలున్నాయి. ధర్మరాజంతటి వాడే జూదంలో భార్యని సైతం పణంగా పెట్టే దు:స్థితికి దిగజారాడంటే, దాని ప్రభావం ఎంతటిదో అర్థమౌతుంది.పాచికల నుంచి చీట్లపేకవరకు,

ఎలాంటి జూదమైనా విచక్షణను దెబ్బ తీస్తుంది. ఓటమి పాలైతే ఎలాగైనా విజయాన్ని పొందాలనే దురహంకారం మళ్ళీ మళ్ళీ మనిషిని దానికి బానిసను చేస్తూనే ఉంటుంది.

ఈ విషయాన్ని ఎన్నో రకాలుగా, ఎందరో కవులు, రచయితలు ఎప్పటినుంచో కథనాత్మకం చేస్తూనే ఉన్నారు. అయినా మనిషి దానికి బానిసగా తన బ్రతుకును అర్పించుకుంటూనే ఉన్నాడు. ఈ నేపథ్యంతో గుర్రప్పందాల ఆధారంగా 'పద్మవ్యూహం' అనే కథ నవ్య దీపావళి ప్రత్యేక సంచిక, 2 నవంబరు 2016లో వచ్చింది. కథకుడు డా॥ యండమూరి సత్య కమలేంద్రనాథ్.

గుర్రప్పందాల పిచ్చి నరనరానా జీర్ణించుకున్నవాడు అశ్విక్. ఆదివారమొస్తే చాలు, మలక్‌పేట రేస్‌కోర్సు గ్రౌండ్స్‌లోనే రోజంతా గడిపేస్తాడు. ఒక్కోసారి పున్నమినాటి చంద్రుడిలా ఇంటికి చేరినా, మరోసారి పాడ్యమి చంద్రుడిలా చేరతాడు. ఈ కథాసందర్భంలో పాడ్యమి చంద్రుడే అవుతాడు. అలా కావడంలో అంచెలంచెలను చాల నాటకీయంగా కథనం చేశారు కమలేంద్రనాథ్. కథకునికి గుర్రప్పందాలతో అనుభవాలున్నాయేమోనని భ్రమ కలిగించేంత విధంగా కథనాన్ని రక్తి కట్టిస్తారు.

గత రెండు వారాలుగా పోయిన డబ్బులను ఏ విధంగానైనా భర్తీ చేసుకోవాలనే దృఢ నిశ్చయంతో వెళతాడు. రాజు అనే ఫెరియర్‌మాటమీద గురితో తాను పందెం కట్టే గుర్రాన్ని ఎంపిక చేసుకుంటుంటాడు అశ్విక్. ఈ సారి ముందురోజే రాజును కలుస్తాడు. కాని అతను రేపు రేసుకోర్సులోనే చెబుతానంటాడు, కొన్ని రేసులు అప్‌సెట్ అవుతాయేమోననే అనుమానాన్ని వ్యక్తం చేస్తూ.

రేసుకోర్సుల్లో జరిగే మోసాలను సహజనైజంలో వర్ణిస్తూ, కథను నడిపించారు కమలేంద్రనాథ్. ఒక్కోసారి ఒక గుర్రాన్ని ఫేవరెట్ చేసి మరో గుర్రాన్ని గెలిపించడం వంటి జిమ్మిక్కులు చేస్తుంటారు.

రాజు చెప్పినట్టుగా మొదటి పందెం సిల్వర్ జెట్ అనే గుర్రంమీద పదివేలుకు కాసి, ముప్పైవేలు గెలుచుకుంటాడు. డబ్బు తీసుకుందుకు వెళ్తే, "ఏదైనా మరో పందెం కాసే ఉద్దేశం ఉంటే కార్డు మీ దగ్గర ఉంచండి. ఆ పందెం డబ్బులో ఈ సొమ్ము కలుపుదాం" అంటాడు– ఇదో చిన్న ప్రలోభం. అలా ప్రలోభపెట్టడమే వాళ్ళ పని. ఒక పందెం గెలిచిన ఊపులో మరో పందెం కాయడానికి ఆ మాత్రం ప్రోత్సాహం

చాలు, మనిషి బలహీనత. అంతలోనే, "చూశారా సర్! ఎలా నెగ్గిందో" అంటూ వెనుకనుండి వినబడుతుంది. "ఈ సారి 'ఓ మై మై' గుర్రం మీద పందెం కాయండి" సలహా ఒకటి పారేసాడు రాజు. మరో ప్రలోభం. అతను చెప్పకపోయినా, అశ్విక్ తనంత తానే అడుగుతాడు. మరో బలహీనత. బ్రీఫ్‌నుంచి లక్ష తీసి, గెలుచుకున్న ముప్పైవేలకు జోడించి పందెం కాస్తాడు అశ్విక్. ఇదంతా గమనిస్తున్న వ్యక్తి ఒకడు, "ఏం సార్! ఏదైనా టిప్ వచ్చిందా, అంత పందెం కాస్తున్నా"రని అడిగితే, ఏమీ తెలియనట్లు ఎందుకో గెలుస్తుందనిపిస్తోందంటాడు – అంతా డిప్లొక్రసీ – డిప్లొమసీ+హిపోక్రసీ! పందెం కాసిన గుర్రం నాలుగు లెంగ్స్ ముందుగా పరుగెడుతుంటే, అశ్విక్ మనసులో ఉత్కంఠ; అతని మనసు కూడా ఆనందంతో గుర్రంలానే ఉరకలు, గెంతులు వేస్తుండగా, అంతలోనే తన గుర్రాన్ని మరో గుర్రం దాటుకు వెళ్తుంది. ఆరు, ఏడు గుర్రాల మధ్య 'ఫొటో ఫినిష్'. మరో గుర్రం ఆరు అంగుళాల తేడాతో నెగ్గింది. గోవిందా! సర్వం గోహ్‌విందా!!

అశ్విక్‌ని గమనిస్తూన్న వ్యక్తి అతణ్ణి సమీపించి, "అన్నట్టు మీరు ఆర్ అండ్ బి ఇంజనీరు కదా!"ని అడుగుతూ, తననో కాంట్రాక్టరుగా పరిచయం చేసుకుంటాడు. "జూదంలో జయాపజయాలు వెన్నంటి ఉంటాయి సార్! నేనెవరో మీకు తెలియదు కానీ, రెండు మూడు సార్లు నా కాంట్రాక్టు బిల్లులు పెండింగ్‌లో ఉంటే మీరు ఇప్పించారు. మీకు ఏదైనా సహాయం కావాలంటే అడగండి. అదృష్టం కొద్దీ ఈ రేసులో నేను నెగ్గాను" చెబుతాడా పరిచయస్తుడైన అపరిచయస్తుడు. విచక్షణ కోల్పోగా, మనిషిని నిర్వీర్యుణ్ణి చేసే ప్రలోభం –వేరే ఆలోచించనీయని పెద్ద బలహీనత.

"చూడండి ఇంజనీరు గారూ! ఇద్దరమూ జూదగాళ్ళం. ఇద్దరు జూదగాళ్ళ మధ్య సఖ్యత ఎక్కువ ఉంటుందని నా అభిప్రాయం. నేనెవరో తెలియకుండానే నా బిల్లులు ఇప్పించారు. ఆ రోజు నామమాత్రంగా డబ్బులు తీసుకున్నారు. మనుష్యులన్న తర్వాత ఆ మాత్రం కృతజ్ఞత లేకపోతే మనకీ, జంతువులకీ తేడా ఏం ఉంటుంది? మీరు సంశయించకండి", తేనె పలుకులు వినిపించాడు కాంట్రాక్టరు. జూదప్రలోభం అప్పు తీసుకోడానికే మొగ్గు చూపింది. అయితే అహం అడ్డురాగా, "ఓ పని చేద్దాం. నా కారు తాళాలు ఇస్తాను. బ్రీఫ్‌లో తెల్లకాగితాలు ఉన్నాయి. ఓ

కాగితం మీద కారు మీకిస్తున్నట్లుగా రాసి ఇస్తాను. మీరు వచ్చినా సరే లేదా ఎవరినైనా పంపించినా డబ్బు ఇస్తాను లేదా కారు ట్రాన్స్‌ఫర్ చేసేస్తాను. మీ పేరుమీదనైనా, మీరు కోరిన ఎవరి పేరుమీదైనా సరే! ఒకవేళ ఈ రేసు నెగ్గితే, డబ్బు ఇప్పుడే ఇచ్చేస్తానం"టే, భలేవారే, కారు తాకట్టు పెట్టవలసిన అవసరం ఏముంది, నోటి మాటగా తీసుకోండని అన్న వ్యక్తి, 'నోటు' రాయించుకుని మరీ ఇస్తాడు. అతని లెక్కలు అతనికున్నాయి – మూడు రోజుల్లో తీర్చాలని అగ్రిమెంట్ రాయించుకుంటే సరి, లక్ష రూపాయలకే కారు వస్తుంది. గుర్రప్పందెంలా దైవాధీనంకాని లాభసాటి వ్యవహారం. పైగా ఇంజనీరు గుప్పిట్లో ఉంటాడు. సర్వాధికారాలతో కాంట్రాక్టరు కోరినవిధంగా అప్పు మూడు రోజుల్లో తీర్చకపోతే కారుని అతనిపరం చేస్తున్నట్లు రాసి ఇచ్చేసాడు అశ్విక్.

జూదంలో సెంటిమెంట్ పాత్ర కూడ తక్కువదేమీ కాదు. సెంటిమెంటల్‌గా తను మొదట గెలిచిన రేసు బుకీ దగ్గరకెళ్ళి 'రాయల్ ప్రిన్స్'పై పందెం కాసాడు. ఆ రోజు అప్పటికే మూడు రేసుల్లో పందేలు నెగ్గి, లక్షకే కారు దొరకబుచ్చుకున్న కాంట్రాక్టరు మాంఛి హుషారుగా డెర్బీ రేసులో పాల్గోవాలని మెదడు దొలిచేస్తుంటే, తన దగ్గరున్న డబ్బులన్నీ లెక్కపెట్టుకోసాగాడు కాంట్రాక్టరు.

జూదం కేవలం ఆశ కాదు. అత్యాశ. డబ్బు తేలికగా సంపాదించాలనుకోవడం అత్యాశే కదా! చాదర్‌ఘాట్ బ్రిడ్జి మీదుగా నడచి వెళ్తుంటే ఎన్నో ఆలోచనలు. కారు ఏదంటే భార్యకు ఏమని చెప్పాలి? బ్రిడ్జి చివరకు వచ్చేసరికి రెడ్ సిగ్నల్ పడడంతో ట్రాఫిక్ ఆగింది. అశ్విక్ పక్కగా వెళ్ళి కాసింత దూరంలో ఓ కారు, తన కారులాంటిదే ఆగడం గమనించాడు. నంబర్ ప్లేట్ చూస్తే అది తన కారే. డ్రైవింగ్ సీట్లో కాంట్రాక్టర్‌కు బదులు వేరే వ్యక్తి. విచారిస్తే తెలిసిన విషయం, "...ఎవరో పెద్దమనిషి...కాంట్రాక్టరట. రేసుల్లో అత్యవసరంగా డబ్బు కావాలంటే – ఈ కారు తాకట్టు పెట్టా"దని. అంతలోనే అతని కారు రెండో చేతిలోంచి మూడో చేతిలోకి మారిపోయింది – వ్యసన పర్యవసానం!

ఆ రాత్రి ఎంతకీ నిద్ర పట్టని అశ్విక్ పోర్టికోలో మంట వేసుకుని, దాని ఎదురుగా కూర్చుంటాడు. రేసు పుస్తకాలన్నీ తగలేసిన మంట అది!

"వ్యసనం పద్మవ్యూహం లాంటిది. బయటకు రావటం తెలిస్తే అర్జునుడిలా విజయుడై బయటకు రావచ్చు లేదా అభిమన్యుడిలా అదే వ్యూహంలో చిక్కుకుపోవచ్చు"ననే కథకుడి అభిప్రాయంతోముగుస్తుంది.

కథకుడు : కడయింటి కృష్ణమూర్తి
కథ : విశ్వామిత్రుడు
ప్రచురణ : తెలుగు వెలుగు
ఆగస్టు, 2016

# కడయింటివారి నడిమింట కథ

"రెండు కుటుంబాలు... రెండు కథనాలు... కానీ అంత:సందేశం ఒక్కటే! అదే... కలసి ఉంటే కలదు సుఖం! రోజూ ప్రతికూల వార్తలు వినీ వినీ సానుకూల దృక్పథమే పోతోంది మనుషుల మనసుల్లోంచి. చూడాలేగాని, ఉన్నంతలో సంతోషంగా జీవితాలను గడిపేసే వాళ్ళు మన మధ్యలోనే కనిపిస్తా"రంటూ ఎడిటోరియల్ లీడ్‌తో ఆరంభమయ్యే విలక్షణమైన కథ 'విశ్వామిత్రుడు'. ఆగస్టు 2016 తెలుగు వెలుగు మాస పత్రికలో ప్రచురితమైన ఈ కథ కడయింటి కృష్ణమూర్తిగారి కలం నుంచి జాలువారిన కథ.

"అత్త లేని కోడలుత్తమురాలు...కోడలు లేని అత్త గుణవంతురాలు" అన్నది నానుడి. అత్తాకోడళ్ళ మధ్య సయోధ్య మృగ్యం. ఉన్నా అంతంతమాత్రం. దానికి విరుద్ధంగా ఉంటే...?! కలో, కల్లో కావచ్చుగానీ, అదొక స్వీట్‌హోం!

కావాలనుకునేవారు తప్పకుండా చదవాల్సిన కథ ఈ విశ్వామిత్రుడు.

కోడలు మైథిలి ఫోను చేసిన దగ్గర్నుంచి సీతమ్మ ఒకటే హైరానా పడిపోతుంది. వంటిల్లు సర్దేసి పడుకోవాలనుకున్నదల్లా, మళ్ళీ వంటగది తలుపులు తెరచి వేసిన దీపాన్ని తెల్లవారు ఝాము మూడు గంటలకి గాని ఆర్పదు. ఈలోగా దబ్బాదు పెసరపప్పు జంతికలు (కోడలి కోసం), కజ్జికాయలు (మనవడి కోసం) చేసింది. ఉదయం వాళ్ళు దిగేసరికి టిఫిన్‌గా దోసెలు వేయడానికి పప్పు నానేసింది. అటుకులు నూనెలో తేల్చి ఉప్పు, కారం వేసి అట్టేపెట్టింది. ఏదడిగితే అది వారికి అందించాలని ఆమె తాపత్రయం. ఆ తాపత్రయం అంతటితో అయిపోయిందా! కోడలు అడిగి మరీ పోయించుకునే తలంటు కోసం కుంకుడు కాయలు దంచిపెట్టింది. నలుగుకు శనగపిండీ, నువ్వుల నూనె,కొంచెం పసుపు గుంద, సాంబ్రాణి అన్నీ సిద్ధం చేసి ఉంచుకొంది. చిక్కు దువ్వెనతో సైతం దువ్వెనలన్నీ శుభ్రం చేసింది.

నాలుగ్గంటలకి లేచే భర్త రఘురామయ్యకు లేస్తూనే బెడ్‌కాఫీ అలవాటు. ఆలస్యంగా పడుకొన్న సీతమ్మకు ఆరైతేగాని మెలకువ రాలేదు. అప్పటికే లేచి కాఫీ పెట్టుకుని తాగిన రఘురామయ్య, ఏమిటి విశేషం, వంటిల్లంతా నూనె మరకలతో ఉంది? రాత్రంతా మేలుకొని ఏం చేశావు? ఎందుకు? అంటూ ప్రశ్నల మీద ప్రశ్నలతో ఆరా తీస్తుంటే, "మీరు ఇప్పుదు తొమ్మిది గంటలకు స్టేషనుకెళ్ళాలి, వాళ్ళు వస్తున్నా" రంటూ చెబతుంది. అంతే ఆ క్షణమే ఆయన హడావుడి ఆరంభమైంది. తల దువ్వుతుంటే, ఏడేగా అయింది, తొమ్మిదికి వెళ్ళాలి స్టేషనుకు. ఈలోగా కూరగాయలు తేవడానికి బజారుకెళ్ళి రండంటూంటే, అలాగే, మైథిలికీ, బుజ్జిగాడికి ఇష్టమైన కూరగాయలన్నీ తెస్తానంటూ బయలుదేరుతూ ఒక హెచ్చరిక చేస్తారు, "ఈలోగా నువ్వు వంట మొదలుపెట్టు. కోడలు రాగానే అప్పజెప్పేసేవు సుమా... పాపం, అక్కడ అన్నీ తనే చూసుకోవాలి. ఇక్కడైనా విశ్రాంతి తీసుకోనీ" అంటూ.

నలభై నిమిషాల్లో తిరిగి వచ్చి స్టేషనుకు సిద్ధమైన ఆయనతో తాను కూడ బయల్దేరడానికి సిద్ధమైంది సీతమ్మ. రైలు దిగుతూనే మనవడ్ని తాతకు అప్పజెప్పుతుండగా, ముఖం చిన్నబోయిన సీతమ్మకు కోడలు మైథిలి, తనను తాను అప్పజెప్పుకోవడంతో మొహం మతాబులా వెలుగుతుంది. వారిద్దరి తలస్నానాలు, టిఫిన్లయ్యాకా, గుళ్ళో అమ్మవారికి

చేసినంత శ్రద్ధతో సీతమ్మ కోడల్ని కొసరి కొసరి అలంకరించింది. ఆమెకూడ అన్నీ చేయించుకొంది. తన దిష్టే తగిలేలా ఉందని, వెంటనే దిష్టి తీసింది.

"అత్తయ్యా ఒక్క మాట... ఈ రోజు నేనే మీ ఇద్దరికీ వడ్డిస్తాను. తర్వాత నేను తింటాను. నాకు మీరు వడ్డించండం"టూ, మామయ్యను భోజనానికి పిలుస్తుంది. భోజనాలయ్యాకా, తీరిగ్గా కూర్చుని తమ సంసారపు ముచ్చట్లన్నీ చెప్పింది మైథిలి. తాను అక్కడ ఉన్నన్ని రోజులూ తానే వంట చేస్తానంటుంది మైథిలి, ఎంతో ప్రయాసతో ఆ ఇద్దరినీ ఒప్పిస్తుంది, ఒక షరతుతో. పిల్లాడి పనులన్నీ తాము చేసేలాగా, కోడలిఅలంకార వ్యవహారమంతా అత్తగారిదనీనూ. మైథిలి కూడ సంతోషంగా ఒప్పుకుంటుంది.

దాదాపు ఇదే సమయంలో మరో ఇంట్లో దాదాపు ఇదే సీను... కమలమ్మ, మాధవయ్య, అరుణ, సీతలమధ్య. కమలమ్మ, మాధవయ్యలు అత్తమామలు కాగా, అరుణ సీతలు కోడలు మనవరాళ్ళు. పనుల పంపకం మాత్రం కొంచెం తారుమారు–కమలమ్మ వంటచేయడం, అరుణమాధవయ్యకు వీడియో గేమ్స్ ఆడటం నేర్పడం. ఎందుకని ఆరా తీస్తే, "మొన్న సీత నన్ను ఓడించిందీ ఆటలో. అంత చిన్నపిల్ల చేతిలో ఓడటమా!" అనగానే, చిరునవ్వుతూ, అందుకు సిద్ధమౌతుంది అరుణ. ఏ ఆటాడినా తాతయ్యతోనే ఆడాలి, తానే గెలవాలి సీత. ఓడినందుకుగాను తాతయ్య తనను వీపు మీదెక్కించుకుని గుర్రపుస్వారీ చెయ్యాలి – ఇదీ ఒప్పందం. గడుసు పిండం సీత. ఎప్పుడూ నువ్వే ఎలా గెలుస్తావని అడిగితే, "తాతయ్య గెలిస్తే నేను ఆయన్ను వీపుమీద మోయలేనుగా!" అంటుంది. "అదేమిట్రా నా దగ్గరే నేర్చుకుని నన్నే ఓడిస్తున్నా"వని తాతయ్య అడిగితే, "దానర్థం మా తాతయ్య నాకు బాగా నేర్పించా"డంటుంది. ఊళ్ళో ఎన్నో తగవులు తీర్చిన మాధవయ్యకు మనవరాలినెలా గెలవాలో తెలీటంలేదు. అదే అంటే, "నేను తాతయ్యని మించిన మనవరాలిని, కావాలంటే తాతకు దగ్గులు నేర్పుతా"నంటూ, "తాతయ్యా, ఇక్కడ మాత్రం గెలుపు నీదే"నంటూ దగ్గుతుంది చిలిపి పిల్ల. కానీ, పాపం, కంప్యూటరు దగ్గరమాత్రం తాతయ్య నిజంగానే ఓడిపోతున్నాడు. అన్ని ఆటల్లోనూ మనవరాలిని 'గెలిపించే' తాతయ్య, నిదానమే ప్రధానమన్న సూత్రాన్ని నమ్ముకోవడంవల్ల కంప్యూటర్ ఆటల్లో సీత చేతిలో ఓడిపోతున్నాడు.

అరుణ ప్రయత్నాలు పాక్షికంగానే ఫలిస్తున్నాయి. అంతలో

వంటైందంటూ వంటింట్లోంచి పిలుపు వస్తుంది. అప్పటికే సీత స్కూలునుంచి వచ్చి తాతయ్యతో రెండు ఆటల్లో నెగ్గి ఆయన వీపుమీద పెరడంతా తిరుగుతూ ఉంటుంది. అప్పుడు కలిగింది అరుణకు అనుమానం. ప్రతిరోజూ తాను పదింటికి అత్తయ్యకు సాయం చెయ్యాలని వెళ్ళడం, అప్పుడే సరిగ్గా మామయ్య కంప్యూటర్ గేమ్స్ నేర్పమని పిలవడం ... అలా పన్నెందు కావడం...అప్పుడు గుర్తుకొచ్చాయి అరుణకు అత్తగారన్న మాటలు –"నేనున్నన్ని రోజులూ నువ్వు హాయిగా ఆటాపాటలతో నవ్వుతూఉండమ్మా. అది చూసి నేనూ మీ మామయ్య సంతోషిస్తాం. సీత విషయం మీ మామయ్య, నీ పనులు ఇంటి పనులూ నేనూ సంతోషంగా చేస్తాం. నువ్వు మన ఇంటి మహారాణివి తల్లీ!". ఆ మాటలు గుర్తొస్తూనే, అరుణ కనుగొలుకుల్లో నీళ్లు నిలిచాయి.

తాతా మనవరాళ్ళ అనుబంధం చాల చిత్రం. మారాం చేసే సీత, ఆయన ఒక్క మాట చెబితే చాలు, మంత్రం వేసినట్లు బువ్వ శుభ్రంగా తింటుంది. తినే ముందు ఆయన నేర్పించిన శ్లోకం చదువుతుంది. నిద్ర లేస్తూనే, నేలతల్లికి దణ్ణం పెట్టి ఏదో శ్లోకం చదువుతూ మంచం దిగుతుంది. స్నానానికో శ్లోకం. బడికి వెళ్ళేముందు దేవుడికి దణ్ణం పెట్టుకుని వెళ్తుంది. బొట్టు పెట్టుకోవడం అస్సలు మరచిపోదు. బడికి వెళ్తూ, ఇంటికి వస్తూ స్నేహితులతో పద్యాలు, శ్లోకాలు చెప్పిస్తోంది(ట). "నువ్వు ఇన్ని శ్లోకాలు ఎప్పుడు నేర్చుకున్నావే" అంటే, "అన్ని ఆటల్లోనూ తాతయ్యే ఎందుకు ఓడిపోతున్నాడనుకున్నావు?" అని ఎదురు ప్రశ్నొకటి. "దానికీ దీనికీ సంబంధమేమి"టంటే, "ప్రతి గెలుపుకీ తాతయ్య వీపెక్కి తిరుగుతానా! ప్రతిసారీ ఒక్క శ్లోకమైనా అప్పజెప్పేవరకూ తాతయ్య నన్ను దించరు తెలుసా? పాతది అప్పజెప్పాలి. అప్పుడు కొత్తది...ఇలా రోజుకు రెండు మూడు శ్లోకాలో, పద్యాలో!" అనుకోకుండా, అరుణ ముక్కు మీద చూపుడువేలు పడింది –"చదువు ఇలా కూడ చెప్పొచ్చా!", ఒక విస్మయం.

"సీతను భోజనానికి పిలువమ్మా" అంటున్న మామగారి పాదాలకు నమస్కారం చేస్తుంటే,"అరె, ఇదేమిటమ్మా, లే"అంటూ లేవదీసి, తలమీదచెయ్యేసి, తన తలను కోడలి తలతో తాకించుతారు పరంధామయ్య. ఇదో ఆశీర్వచనమా! అమోఘం. చల్లని పదార్థమేదో మెల్లగా గొంతు దిగిన అనుభూతి.

ఈ రకంగా విశ్వామిత్రుడు రామలక్ష్మణులను ఆశీర్వదించేవాడుట.

ఎన్నో సార్లు సీత తలను ఇలా తాకుతుంటే చూసేదిగాని,అప్పుడు తెలీదు అరుణకు. "మామయ్యా మీరు విశ్వామిత్రుడికంటే గొప్పవారు. త్రేతాయుగాన్ని కలియుగానికి అన్వయించారు. మీదంతా మౌన వ్యాఖ్యానం" అనుకొంటుంది మనసులో.

"కౌసల్యా సుప్రజా రామా: పూర్వాసంధ్యా ప్రవర్తతే।

ఉత్తిష్ఠ నరశార్దూలా కర్తవ్యం దైవమాహ్నికమ్" అంటూ ప్రాత:కాలాన రామలక్ష్మణులను నిద్రలేపిన విశ్వామిత్ర మహర్షి వారి లతికలను మూడ్కొని ముద్దు పెట్టుకుంటూ ఆశీర్వదించేవాడు.

"ఇప్పటికీ మైథిలి, అరుణల్లాంటి కోడళ్ళూ...సీతమ్మ, కమలమ్మల్లాంటి అత్తలూ ఉన్నారు. ఇక రఘురామయ్య, మాధవయ్యగార్లకూ లోకంలో లోటు లేదం"టూ, ఆశావహంగా కథను ముగిస్తారు కడయింటి కృష్ణమూర్తి, నడిమింట ఉండాల్సిన ఆనురాగ, ఆప్యాయతలను ఒలికిస్తూ!

(వార్తాసాగరం, 10.8.2016)

కథకుడు : డా॥ ర్యాలి ప్రసాద్
కథ : దోపిడీ
ప్రచురణ : విశాఖ సంస్కృతి
సెప్టెంబర్, 2012

# శ్రమ దోపిడీ

మార్క్సిజం సర్వం వ్యతిరేకించిందొకే విధానం. అదే దోపిడీ విధానం. బలవంతులు బలహీనుల్ని, ధనికులు పేదల్ని, యంత్రాల్ని నడిపేవారు శ్రామికుల్ని దోపిడీచేయడమే అనాదిగా వస్తున్న ఆచారం.

బలవంతులకి, ధనికులకి, యంత్రాల్ని నడిపేవారికీ ఒకే పేరు పెట్టాలంటే అదే, 'పెట్టుబడి పెట్టేవాళ్ళు'. వారి దోపిడీకి గురయ్యేవాళ్ళకి మాత్రం ఒకే ఒక పేరు పెట్టలేం. వాళ్ళు, తాడితులు, పీడితులు, అశాంతులు, అనాథలు, అభాగ్యులు...అనేకులు వారు.

వాళ్ళు దోపిడీ చేసేవాళ్ళైతే వీళ్ళు దోపిడీకి గురయ్యేవాళ్ళు. ఈ రెండు భిన్న అంశాలకు సంబంధించిన రెండు ఆర్థికసూత్రాలే చరిత్ర ఎరిగినకాలంనుంచీ మానవసమాజాన్ని ప్రభావితం చేస్తూ వచ్చాయి. అవే పెట్టుబడిదారీ విధానం, సామ్యవాదంగా పరిణమించాయి. అయితే,

సామ్యవాదం ఆచరణలో విఫలం అయిందన్నవిషయం ఈనాడు కాదనలేని నిజం. పెట్టుబడిదారీ విధానమే ప్రస్తుతం ప్రచలితంలో ఉన్న ఏకైక ఆర్థిక సూత్రంగా పరిణమించింది. దానియొక్క సంస్కృతి వ్యాపార సంస్కృతి. లాభాలు ఆర్జించడమే దానికి తెలిసిన ఏకైక లక్ష్యం. దానికి అవసరం లేనిదల్లా మానవత.

ఈ విషయాన్నంతా చక్కని కథారూపంలో, కేవలం రెండే పేజీల్లో వివరించిన కథ డా॥ ర్యాలి ప్రసాద్ సెప్టెంబరు నెల 'సంస్కృతి' మాసపత్రికలో ప్రచురించిన కథ 'దోపిడీ'. పెట్టుబడిదారీ సంస్కృతి పరాకాష్ఠ దశను సులభశైలిలో ఏడోతరగతి కుర్రాడికి కూడ అర్థమయ్యే విధంగా కథనం చేశారు.

పోటీపరీక్షలకు విద్యార్థులను తయారుచేసే ట్యూషన్ సెంటర్‌ను ప్రారంభిస్తాడు కథకుడు. అర్థమెటిక్, రీజనింగ్ తానే చెప్పగలడు. ఇంకా జనరల్ నాలెడ్జి, ఇంగ్లీషూ చెప్పేవాళ్ళకోసం వెతుకుతుంటాడు. తన కొలీగ్ ఒకతను జనరల్ నాలెడ్జి చెప్పడానికి ఒప్పుకుంటాడు. నెలకు ఐదువేలు జీతం నిర్ణయమౌతుంది. అప్పుడు హఠాత్తుగా గుర్తుకొస్తారు పద్మరాజు మాష్టారు. ఈ సందర్భాన్ని వివరిస్తూ, కథకుడు అంటాడు, 'అవసరం' ఆయన్ను గుర్తుచేసిందని. "అవసరం లేకుండా ఏ పనీ చెయ్యము. ఎవర్నీ తలుచుకోలేము కదా! రోజులు అలా తయారయ్యాయి" అనీ స్వగతంగా అనుకుంటాడు. ఈ విధంగా ప్రస్తుత సమాజంలో నెలకొని ఉన్న మానవసంబంధాల్లోని బోలుతనాన్ని వివరిస్తారు కథకుని మాటగా ప్రసాద్. ఇప్పుడన్నీ అవసరార్థం సంబంధాలే. మనీ సంబంధాలు. ఇంగ్లీషుటీచరు కావాలసిన అవసరం కథకుడిదైతే, డబ్బు కావాల్సిన అవసరం పద్మరాజు మాష్టారిది. ఆయన్ను వర్ణిస్తూ, ఒక మాటంటాడు కథకుడు, "సైకిలు తొక్కడంకన్నా నడిపించిన సందర్భాలే ఎక్కువ" అని. ఈ వాక్యం పద్మరాజుగారి, సమాజంలోని అలాంటివారి జీవనగమనాన్ని ఎరుకచేస్తుంది.

రెండు నెలల కోర్సులో మొదటినెల పూర్తికాగానే పద్మరాజుగారు ఎంతో మొహమాటపడుతూ జీతం ఇమ్మని అడుగుతారు. రెండువేలు ఇస్తాడు కథకుడు. కానీ, రెండునెలల జీతం ఒకేసారి ఇవ్వమని అడుగుతారు పద్మరాజు మాష్టారు. ఆ సందర్భంలో కథకునిలోని పెట్టుబడిదారుడు మేలుకుంటాడు. మనసులో బాధగా ఉన్నా, డబ్బు దగ్గర సెంటిమెంట్లు

ఉండకూడదనే లౌకిక సిద్ధాంతం డబ్బివ్వకుండా ఆపేస్తుంది. ఇచ్చేవాడి చెయ్యి పైన, పుచ్చుకునేవాడిది కింద అనడానికి ఇంతకంటే దృష్టాంతం ఏం కావాలి? "డబ్బు తీసుకుని వచ్చే నెల సరిగ్గా క్లాసులకు రాకపోతేనో!" పనికిమాలిన లాజిక్కొకటి వెతుక్కుని కుదుటపడుతుంది కథకుని మనసు.

మళ్ళీ ఏవో ఉద్యోగాల కోసం మరో నోటిఫికేషన్ వస్తుంది. జనరల్‌నాలెడ్జి అయిదువేలు కిట్టదంటుంది. ఎనిమిదివేల దగ్గర బేరం కుదురుతుంది. ఇక పద్మరాజు మాష్టార్ని పిలవాలని వెళ్ళేసరికి ఆయన చనిపోయారని తెలుస్తుంది. కారణం కేన్సర్. పూర్తికోర్సు మందులు నాలుగువేలనీ, రెండువేలు తక్కువైతే, సగం మందులు మాత్రం వాడి ఆపేశారనీ, ఆ కారణంగా చనిపోయారనీ తెలుస్తుంది. కానీ చేసేదేముంది?

రెండునెల్ల జీతం ఒకేసారిచ్చి ఉంటే ఆయన బ్రతికేవారేమో! కథకునిలో ఒక రకమైన విచికిత్స మొదలౌతుంది. "అరవై వేల లాభం పొంది, మాస్టారికి నాలుగువేలే ఇచ్చి తప్పు చేసానా?మాష్టారితో పాటే పాఠం చెప్పినవాడికి ఐదు వేలిచ్చి, ఈయనకు మాత్రం నెలకు రెండు వేలే ఎందుకిచ్చాను? ఆయన అడక్కా? నా గడుసుదనమా? ఎవరెవరో దోపిడీ చేస్తున్నారని గోల పెడతామే. నేను చేసిందేమిటి? ఇది శ్రమదోపిడీ కాదా?"

ఇదే విచికిత్స పాఠకునిలో కూడ కలుగుతుంది. తద్వారా మంచి కథ చదివిన తృప్తినీ మిగులుస్తుంది. ఫలితం కథకుడిగా ర్యాలి ప్రసాద్ విజయవంతం అయ్యారని అర్థమౌతుంది.

కథయిత్రి : పి. సత్యవతి
కథ : కలిసే ప్రయాణం
ప్రచురణ : చినుకు
మే 2016

# ఎంత కష్టం? ఆత్మహత్య!

కుర్రాళ్ళను వాళ్ళ ధైర్యానికి మెచ్చుకోవాలి!

యువతంటేనే సాహసాలకు పెట్టింది పేరు కదా! ధైర్యానికి మారు పేరు కదా!! అందుకోసం వాళ్ళను ప్రత్యేకించి మెచ్చుకోవాలా?

ఏమో నాకలాగే అనిపిస్తుంది. ఇంటి గడప దాటినంత సునాయాసంగా వాళ్ళు ఈ లోకం గడప తన్నేసిపోతున్నారు, ఈ మధ్య. పెద్ద కారణమేమీ ఉండనవసరమే లేదు. అనుకున్నది సాధించలేకపోతేనో, పోటీ చదువుల తాకిడికి తట్టుకోలేకనో, ప్రేమ విఫలమయ్యిందనో ఇట్టే బ్రతుకు ముగించుకుంటున్నారు. ఆఖరుకు, తల్లిదండ్రులు అడిగిందివ్వలేదనో, తిట్టారనో కూడ ఆత్మహత్య చేసుకుంటున్నారు. మరి దీనికెంత ధైర్యం ఉండాలంటారు?

ఆఖరుకు ధైర్య సాహసాన్వితమైన యువత సహజగుణం, ఆత్మహత్యల పాలవుతోందంటే ఏమనుకోవాలి?

నిజానికి ఆత్మహత్య చేసుకోడం అంత సులువేమీ కాదు. దానికెంతో ధైర్యం, సాహసం ఉండాలి. ఈ రకంగా చావులోనూ యువత ధైర్య సాహసాలు ప్రదర్శిస్తోందని గర్వపడాలేమో!

పి. సత్యవతిగారి కథ 'కలిసే ప్రయాణం', ఆత్మహత్య చేసుకోడం ఎంత కష్టతరమో తెలియజేస్తుంది. చినుకు, 11వ వార్షిక ప్రత్యేక సంచిక, మే 2016లో ప్రచురింపబడింది. అప్పట్నించీ నేను మా విద్యార్థులకు కుదిరినప్పుడు ఈ కథ చదివి వినిపిస్తున్నాను. తరువాత చర్చ పెడుతున్నాను. విన్నంతనే మనసు కదిలినా, చర్చతో, వారు అందులో ప్రత్యక్ష పాత్ర వహించగలగడంతో అది స్థిరపడి ఒక దృఢమైన భావన వారి మనసులో ఏర్పడుతుందని నమ్ముతూ నేనీ పని చేస్తున్నాను.

కథాంశం చాల రొటీన్ అయిందే. ప్రేమికులు తమ ప్రేమను తల్లిదండ్రులు అంగీకరించలేదని రైలుకింద పడి చనిపోడం. అయితే రొటీన్‌కి భిన్నమైందీ ఉంది. అదే వాళ్ళు వాళ్ళ ప్రయత్నాన్ని సఫలం చేసుకోలేకపోడం. అంటే వాళ్ళు అనుకున్నట్టూ చచ్చిపోలేకపోడం. ఇదీ, ఈ కథలో నన్ను ఆకర్షించిన అంశం. పదే పదే విద్యార్థులకు తెలియజెప్పాలనిపించే అంశం.

స్థూలంగా కథాంశం – ఒక రాత్రి రైలుకింద పడాలని నాలుగు సార్లు ప్రయత్నిస్తారు రమేషు, అతని ప్రియురాలు (కథలోపేరు చెప్పలేదు) కాని నాలుగుసార్లూ విఫలం అవుతారు. ఆ సాయంత్రం వారు రైలుకట్ట దగ్గరకొస్తారు. రాత్రికొచ్చే రైలుకింద పడి చావాలని. రైలు దగ్గరకి వచ్చేస్తోందనగా, ఆమె గట్టిగా ఇవతలికి గుంజడంతో ఒకరి కౌగిల్లో ఒకరు ఉన్నకారణంగా, కట్టకివతల పడి కిందికి దొర్లుతారు. మొదటి ప్రయత్నం అలా విఫలం అవుతుంది.

బ్రతకాలనుంది కనుక ఆమెను ఇంటికి పొమ్మంటాడు. అడిగితే, ఆమె లేని తాను చచ్చే తీరతానంటాడు. లేదు, లేదు ఇద్దరం కలిసే చద్దామంటుంది. మరి? విస్తుపోతాడతడు. ఒకే నిమిషం అంతే! ధైర్యం కూడగట్టుకుంటే చాలు, అయిపోద్ది. నూరిపోసి, రెండోప్రయత్నానికి సిద్ధం చేస్తాడు. రైలు వస్తుండడంతో చెయ్యీ చెయ్యీ పట్టుకుని ఇద్దరూ పట్టాలమీదికి వెళ్తుంటారు. అంతలో ఆమె ఆగిపోతుంది. అతను గట్టిగా గుంజితే, కింద కూర్చుండిపోతుంది. రెండో ప్రయత్నమూ విఫలమైంది. ఈసారి, తనవల్ల రమేషు అన్యాయంగా చచ్చిపోతున్నాడనిపించి, అతన్ని రక్షించాలనే

ఉద్దేశంతో ఆమె అలా కూర్చుండిపోయానంటుంది.

తెల్లారేలోగా చనిపోగలమా? లేదా? తెల్లారితే అందరికీ తెలిసిపోతుంది. మరింక చావలేము. నీకంతగా బతుకుమీద తీపి ఉంది కనుక, నిన్ను తీసుకెళ్ళి మీ ఇంటిదగ్గర వదిలివస్తాను, నడమంటాడు. ఆమె ససేమిరా అంటుంది. కాని మళ్ళీ ఏడుపు మొదలుపెడుతుంది.

మళ్ళీ కొంత సంభాషణ. ఎలాగైనా బతికితే బాగుంటుందని ఆమెకుంది. కానీ, ఏ సంపాదనా లేని తాను ఆమెను పోషించలేనంటాడు. పెద్దలనుంచి రెండువైపులా చిల్లిపైసా లేదు. తమకు చావడం తప్ప మార్గాంతరం లేదంటాడు రమేషు.

మళ్ళీ కొన్ని మాటలు. గమ్మత్తేమిటంటే, ఈ మాటల్లో వాళ్ళు అప్పటికప్పుడు ఒకర్నొకరు దెప్పుకుంటారు; తిట్టుకుంటారు; రోషపడతారు; చివరికి ఒకరినుంచి మరొకరు విడిపోలేమనుకుంటారు. మళ్ళీ చావడానికి ప్రయత్నిస్తుంటారు.

"ఒద్దు రమేషూ, అసలొద్దు. రైలు క్రింద మొండేలు నేను చూశ్శేను" మూడో ప్రయత్నమూ ముక్కలవుతుంది.

తెల్లారిపోతోంది. చద్దామా, లేదా? అతనికి కోపం వచ్చేస్తుంది. సరేనంటుంది మళ్ళీ. ఈసారి విఫలం కాకుండా ఉండడానికి ఆమె చున్నీతో ఇద్దరి కాళ్ళు గట్టిగా రైలుకట్టకి ముడేసి, పట్టాలమీద అడ్డంగా పడుకుందాం. ఎంత గింజుకున్నా లేవలేమంటాడు రమేషు.

అంతే చివ్వున లేస్తుంది. అతని చెయ్యి పట్టుకుని లాగుతుంది. కట్టమీదనుంచి కిందికి జారతారిద్దరూ. అతని చెయ్యి గట్టిగా పట్టుకుని, అతని నడుం చుట్టూ మరో చెయ్యేస్తుంది. అతని మొహాన కారుతున్న చెమట చున్నీతో తుడుస్తుంది. బుగ్గమీద ముద్దు పెడుతుంది. మళ్ళీ గుండెలవిసేలా ఏడుస్తూ నేలమీద కూలబడుతుంది. తూర్పు ఎర్రబడుతుండగా... కథ ముగుస్తుంది.

ఆద్యంతాల ఒకే సందర్భాన్ని కొంచెం అటూ ఇటూగా చెప్పి కథారంభం, ముగింపు చేస్తారు సత్యవతి. చిక్కబడిన రాత్రి, గాలిలేని ఆరుబయల, ఉక్క, చిమ్మచీకటిలో, అతనికి మరింత దగ్గరగా జరిగి, అతని చేతివేళ్ళలో తన చేతివేళ్ళు దూర్చి...సరేమరి, ఇదే ఆఖరంటూ అతని బుగ్గమీద ముద్దు పెడుతుందామె, చావడానికి ముందు. పునఃపునః వైఫల్యాల తర్వాత, తూర్పు ఎర్రబడుతోండగా... ఆమె అతని బుగ్గపై ముద్దు పెడుతుంది.

తూర్పు ఎర్రబడుతోండగా... అంటూ కథను ముగించడం చాల ఆశావహాన్ని సూచిస్తూంది.

ప్రేమ విషయంలో పెద్దలనొప్పించి పెళ్ళి చేసుకోడమే యువత చూపవలసిన సాహసమని చెబుతుందీ కథ.

(వార్తాసాగరం, 10-5-2016)

కథకుడు : దాట్ల దేవదానంరాజు
కథ : కళ్యాణపురం
ప్రచురణ :

# కళ్యాణపురంలో కాసేపు...

ఈనాడు తెలుగు కథ కొన్ని కొత్త పుంతలు తొక్కుతోంది. స్థానీయత లేదా ప్రాంతీయత, చారిత్రకత అనేవి వీటిలో రెండు. రచయితతాను ఉంటుండే ప్రాంతానికి సంబంధించిన స్థల, కాలాదులను ప్రస్తావించడం, అలాగే ప్రాంతీయమైన యాస, మాండలికాల ప్రయోగం స్థానీయతా చిత్రణలోకి వస్తాయి. ఇక చారిత్రకత విషయానికొస్తే, ఇదీ రెండు రకాలు. జరిగిపోయిన చరిత్రలోని ఒక కోణాన్ని తీసుకునిగాని లేదా జరుగుతున్న వర్తమాన పరిస్థితులను కాని విశ్లేషించడం.

గ్లోబలైజేషన్ కారణంగా అస్తిత్వవాదాలు బలంగా వినబడుతున్న రోజులివి. వసుధైకంనుంచి విడివడి కుగ్రామీణం కావడమనే నేపథ్యంలో మనుషులమధ్య, మనసులమధ్య మమతాను రాగాలు మృగ్యమవుతున్నాయి. ఫలితంగా ఎక్కడికక్కడ భౌగోళికంగానూ ముక్కలు చెక్కలయ్యే

పరిస్థితి వస్తోంది. ఆ పరిస్థితికి అనుగుణంగా స్థానిక వాస్తవికత అనేదొకటి సాహిత్యంలో... అందునా కథారచనలో బలంగా వినిపిస్తోంది. స్థానిక పరిస్థితులను చిత్రిస్తూ, ప్రాంతీయంగా ధ్వంసమవుతున్న మానవ, మానవేతర సంబంధాలను, కారణమౌతున్న రాజకీయ, ఆర్థిక, భాషా, సాంస్కృతిక నేపథ్యాల్లోంచి వివరించడమే స్థానిక వాస్తవికతగా రూపు తీసుకొంటోంది.

వర్తమానంలో జరుగుతున్న సూక్ష్మ అంశాల్ని సైతం రేఖామాత్రంగా ఒక స్కెచ్‌గీసి చూపడం ఈనాటి కథారచనలో భాగమౌతోంది. ఒక్కోసారి అదే కథగా చలామణీ కూడ అవుతోంది. అలాగే, విశ్లేషణాత్మకమైన ఈ ధోరణివల్ల సాహిత్యం రూపంలో అందంగా ఉండాలనే భావన కొరవడుతోంది. సృజనాత్మక కళా రూపం కావడంవల్ల కథ అనేదాన్ని అందంగా చెప్పాల్సిన అవసరం ఉంది. చక్కని ఇతివృత్తం, పాత్రచిత్రణ, సన్నివేశ కల్పనలనేవి ఎప్పుడైనా కథారచనకు మౌలిక లక్షణాలు. అయితే, కొత్తగా చెప్పాలన్న ఆలోచన, ఈ మౌలికలక్షణాలను బాగా ప్రభావితం చెయ్యడం మొదలైంది. ఫలితంగా కథ డాక్యుమెంటేషన్ స్థాయికి దిగజారిందనే అపవాదు కూడా నేటి తెలుగు కథారచనలో గట్టిగా వినిపిస్తోంది. ఒక అంశాన్ని చెప్పడం కోసమే కథ అల్లడమనే ధోరణి కథనాన్ని కచ్చితంగా దెబ్బ తీస్తుందని ఈమధ్య వచ్చిన చాల కథలు నిరూపించాయి. చెప్పాలనుకున్న అంశానికి సంబంధించిన జీవనసత్యాల వివరణ లేకపోయినప్పుడు ఈ విధంగా జరుగుతుంది. ఫలితం, గణాంకాలు లేని విషయనివేదనలే కథలవుతున్న ధోరణి ఒకటి బయలుదేరుతోంది.

స్థానిక వాస్తవికతకు బీజం శ్రీపాద కథల్లోని గోదావరి ప్రాంత ప్రస్తావన అనుకోవచ్చు. ప్రాంతీయ కథనం అనేది శంకరమంచి సత్యం 'అమరావతి కథలు'తో బాగా ప్రాచుర్యంలోకి వచ్చింది. ఖదీర్ బాబు దర్గామిట్టకథలతో మొదలై, ఇటీవల బాగా వస్తోంది – వంశీ పసలపూడి కథలు, ప్రళయ కావేరి కథలు, మడేలుమిట్ట కథలు... ఇలా చాలావచ్చాయి.

దాట్ల దేవదానం రాజు కూడ ఈ తరహా కథారచనకి పూనుకున్నారు. తానుంటున్న యానాం ప్రాంతానికి సంబంధించిన చారిత్రక విషయాలను కథలుగా చేసి చెబుతున్నారు. ఆ విధంగా ఒకప్పుడు ఫ్రెంచివారి వలస పాలనలోనున్న యానాం చరిత్రలోని కొన్ని శకలాలను తీసుకుని 'యానాం కథలు' పేర కథాసంపుటి తీసుకువచ్చారు. ఆయన

ప్రత్యేకంగా 'యానాం చరిత్ర'ను కూడ రాశారు. చరిత్ర రాయడానికీ, చరిత్రను కథనం చెయ్యడానికీ చాల తేడా ఉంది. మొదటి దానిలో కేవలం వాస్తవికత ప్రధానం. ఇక రెండో దానిలో వాస్తవికతకు కొంత కల్పనను జోడించి రసరమ్యంగా ఆవిష్కరించడం జరుగుతుంది. ఈ విషయంలో రాజుగారు సిద్ధహస్తులు. స్వతహాగా మంచి కథకులైన రాజుగారు, తన యానాం చరిత్రని కథీకరించడానికి పూనుకున్నారు. గతానికి చెందిన చరిత్ర శకలాలకు కథనరూపాలు కనుక ఈ కథలను పురాచారిత్రక కథలుగాచెప్పుకోవచ్చని నా అభిప్రాయం.

రాజుగారు ఈ రెండు కోణాలనూ ప్రతిఫలిస్తూ రాసిన కథ 'కళ్యాణ పురం'. ఈనాటి కథ మౌలిక లక్షణాలు–కుగ్రామీణత, కొత్తగా చెప్పాలన్న ఆలోచన, ఒక అంశాన్ని చెప్పడం కోసమే కథ అల్లడం వంటి విషయాలు ఈ కథకీ వర్తిస్తాయి.అయితే, కథాకథన రీతి వీటన్నింటినీ అధిగమించి, ఈ కథను చదవడాన్ని ఆసక్తిదాయకం చేస్తుంది. కథ ఎత్తుగడ పక్కా డాక్యుమెంటేషన్ రీతిలోనే మొదలౌతుంది.

"ఈ ఫ్రెంచివాళ్ళున్నారే ...మహా ఘటికులు. బ్రిటిష్‌వాళ్ళలా కాదు. ఎప్పుడూ ప్రజలతో మంచి అనిపించుకోవడానికే చూసారు. వాళ్ళకిష్టం లేకపోయినా సరే ప్రజల ఆచారాల జోలికెళ్ళలేదు. ఉదాహరణకు బాల్యవివాహాలు, వారసత్వ చట్టాలు ఫ్రెంచివారికి ఆమోదయోగ్యం కావు. అయినా సరే తీర్పులు చెప్పేటప్పుడు భారతీయ ప్రాచీన శిక్షాస్మృతులనే ఆధారం చేసుకునేవారు. ఎనభై ఏళ్ళ క్రితం... పందొమ్మిది వందలముప్పయి నాలుగులో యానాంను స్థానికులు 'కళ్యాణపురం' అని పిలుచుకునేవాళ్ళు. అప్పుడు జరిగిన ఒక సంఘటనను చరిత్ర మరిచిపోలేదు." కేవలం జరిగిన చరిత్రలోని ఒక సందర్భానికి సంబంధించిన కేవల డాక్యుమెంటేషన్ ఈ వర్ణన. లేదంటే ఒక హైస్కూల్ విద్యార్థి గట్టిగా చదివితే చరిత్ర పాఠం కంఠస్థం పెడుతున్నట్లనిపిస్తుంది.

అయితే, జరిగిన ఒక సంఘటనను చరిత్ర మరిచిపోలేదంటూ, పరమ ఛాందసుడైన నీలకంఠశాస్త్రిని కూడా మరచిపోలే"దంటూ, గమనం కథలోకి ప్రవేశిస్తుంది. పేరు ఎలా వచ్చిందని చెప్పే చారిత్రక కథనం ప్రతి ఊరికీ ఉంటుంది. యానాంకు సంబంధించి, అటువంటికథనం ఒకటి – ఫ్రెంచివారికి బ్రిటిష్‌వాళ్ళు ఈనాంగా ఇచ్చిన గ్రామం కాబట్టి కాలక్రమంలో యానాంగా మారిందని. అయితే ఇదే యానానికి అదే

కాలంలో ఉన్నమరో పేరు 'కళ్యాణపురం'. ఆ ప్రాంతం కళ్యాణపురం ఎందుకయ్యిందో అనే విషయంతో మొదలై, చివరికి ఆ పేరు ఎలా కాలగర్భంలో కలిసిపోయిందో అనే విషయంతో ముగుస్తుందీ కథ.

స్థూలంగా ఇదే కథ. నడుమ కథనమంతా నీలకంఠశాస్త్రిదీ, ఆయన ఎంత ఛాందసంగా, శాస్త్రవిధ్యుక్తంగా పెళ్ళిళ్ళు జరిపించేవాడన్నదే.గతంలో జరిగిన ఒక చారిత్రక వాస్తవాన్ని ప్రస్తుత తరానికి తెలియజేసే మంచి గల్పిక.

గోదావరి పుష్కరాలు కారణంగా పెళ్ళిళ్ళు చెయ్యడానికి ఒక సంవత్సరం పాటు ముహూర్తాలు లేవన్నారు. దీనికి గొప్ప ఎమెండుమెంట్ చేసిందేమిటంటే, పుష్కరాలు కాబట్టి ఇక్కడ కాకుండా, ఇటు విశాఖగాని, అటు కృష్ణాగాని వెళ్ళి నిక్షేపంగా చేసుకోవచ్చన్నది. శాస్త్రీయంగా ఎంత అభివృద్ధిచెందినా, మనిషి మౌలికస్వభావం మారదు. ఎనభై ఏళ్ళ క్రితం 1934లో కూడ జరిగిందిదే. బ్రిటిష్‌పాలిత ప్రాంతంలో శారదాచట్టం అమల్లో ఉంది కాబట్టి బాల్య వివాహం కుదరదు. అందుకే ఫ్రెంచిపాలిత ప్రాంతమైన యానాం వెళ్ళి అక్కడ పెళ్ళి చేసుకుచక్కా వచ్చేయడం ఆచారంగా ఉండేది. ఇటువంటి ఒక పెళ్ళితోనే కథ మొదలవుతుంది.

పెళ్ళిళ్ళు చేయించడంలో ఘనపాఠి నీలకంఠశాస్త్రి. ప్రతి చిన్న తంతునీ శాస్త్రం ప్రకారం రివాజుగా చేయించడంలో దిట్ట. వేదం చదువుకున్న ఘనపాఠిగా ఆయనంటే గౌరవం కాని లౌకిక వ్యవహారాల్లో మటుక్కి ఆయనది చాలా చిన్న బుద్ధి. ఆడపెళ్ళివాళ్ళు భోజనాలు వడ్డించారు. అందరూ విస్తర్ల ముందు కూర్చుని శాస్త్రి రాకకోసం నకనకలాడుతున్నా ఎదురు చూస్తున్నారు. రానే వచ్చాడాయన. పీటమీద కూర్చుంటూనే విస్తర్లను పరికించాడు. పదార్థాల పేర్పులో ప్రాథమిక జ్ఞానం కొరవడిందని గ్రహించాడు. ఆగ్రహోదగ్రుడయ్యాడు. ఎందుకంటే, ఉపేక్షిస్తే అస్తిత్వం దెబ్బ తింటుంది. ఏ అస్తిత్వం? నియమాలూ,పద్ధతుల అస్తిత్వమా! అవ్వాలి కాని, నిజానికి దెబ్బ తినేది ఆయనగారి అస్తిత్వం. అంతే...గభాలున లేచిపోతాడు. 'ఏం మూడిందిరాబాబూ' అనుకుంటూ అందరూ నిర్ఘాంతపోతుండగా ఆయనంటాడు–

"ఎవడ్రా ఈ పని చేసింది? విస్తరిలో వడ్డన వెలగబెట్టినవాడిది బ్రాహ్మణ పుట్టుకేనా? శాస్త్రం అంటూ ఒకటి ఏడ్చింది కదా! అపభ్రంశం జరిగితే మా బోంట్లు ఎలా ఊరుకోగలమూ?లేకపోతే ఫ్రెంచివారి ఇలాకాలో

ఆచారాలు మారిపోతాయా? అగత్యం కాకపోతే సొంతూరు వదులుకుని పరాయిపంచకు రావడమే ఖర్మ. ప్రాంతం మారితే శాస్త్రం గతి తప్పుతుందా?అలా వీల్లేదు. ఇక లేవండి,తిండికోసమే వచ్చినట్లుముఖం వాచి...ఇంకా ఏమిటి చూస్తున్నారు? లేవండి." అని గర్జించే సరికి ఏమైందేమైందంటూ ఆడపెళ్ళివాళ్ళు పరుగెత్తుకుంటూ వచ్చి బ్రతిమలాడతారు.

"అయ్యా ! తమరు జ్ఞానవంతులు.వేదవేదాంగ పారంగతులు. ఊరుగాని ఊరు. తప్పు కాయండి.కొన అరిటాకులు దొరకలేదు స్థలాభావంవల్ల కొన్ని ఆకులు అడ్డంగా పెట్టారు. తప్పే. పప్పు కూరల్ని ఉండాల్సిన స్థానంలో కాకుండా కుడిఎడమలుగా వడ్డించారు.అదీ తప్పే. కుర్రాళ్ళు తెలియక చేసిన పొరపాటు. పెద్ద మనసుతో క్షమించండి. విస్తర్లు మార్పిస్తాం" అని ఓ పెద్దాయన కాళ్ళమీదపడితేగాని శాంతించలేదు. అలాంటిది ఆయన పట్టు. నియమాలపట్ల అంత జాగ్రత్త... రివాజుల పట్ల అంత మోజు.

భోజనం చేసాకా, అలసిపోయిన కారణంగా, కాస్త విశ్రాంతి తీసుకు వస్తాననీ, ఈ లోపులో వ్యవహారం నడిపించవలసిందిగా కొందరు పెద్దలకు అప్పజెప్పి వెళ్లాడాయన. అయిదేళ్ళ పెళ్ళికూతురు మీనాక్షి నిద్ర కాయలేకపోయింది. మొహంమీద నీళ్ళు కొడుతూనే ఉన్నా నిద్రలోకి జారిపోయింది. ఆ నిద్రావస్థలోనే సరిగా ముహూర్తానికి జీలకర్ర, బెల్లం తలమీద పెట్టించారు. తాళి కూడా కట్టించారు. పెళ్ళయ్యింది. సరిగ్గా అప్పుడొచ్చాడు నీలకంఠశాస్త్రి. నీలకంఠమల్లా మళ్ళీ అరుణకంఠమయ్యింది. "...సుషుప్తావస్థలో తాళి కట్టడం నిషిద్ధం. మళ్ళీ ముహూర్తం నిర్ణయించి యధావిధిగా కళ్యాణం జరిపించవలసిందే. యానాంలోనే జరిపిస్తారో, కడియంలో దొంగచాటుగా జరుపుతారో మీఇష్టం. ఈ విషయంలో వాగ్వివాదాలు అవసరం లేదు. మళ్ళీ చెబుతున్నాను, ఈ పెళ్ళి చెల్ల"దంటూ, విసవిసా పెద్ద అంగలు వేసుకుంటూ వెళ్ళిపోయాడు.

ఏం మాట్లాడుకున్నారో గాని, పిల్లలిద్దరూ పదేళ్ళపాటు ఎవరిళ్ళలో వాళ్ళుండిపోయాకా ... అప్పుడు సుబ్బావధాని, యజ్ఞన్న శాస్త్రి వియ్యంకులౌతారు. ఆ విధంగా ఒక కొత్త ఒరవడికి వాళ్ళు నాంది పలకడం జరుగుతుంది. "క్రమేపీ కళ్యాణపురానికి పెళ్ళి కళ తగ్గిపోయిం"దంటూ కథ ముగుస్తుంది.

ఒక సందర్భానికి సంబంధించిన ఒక స్కెచ్చే కావచ్చు. అయితే ఏం? ఎంతో విశాలమైన జీవితంలో ఒకింత శకలాన్ని తీసుకుని, సంబంధించిన అంశాలను చిత్రణ మేరకు పాత్రల ప్రమేయాన్ని చొప్పించి, కొన్ని నిజాలను ఎరుకపరుస్తూ కథనంగా చెయ్యడం చూస్తాం. బాగా చెయ్యి తిరిగినవారు కావడంవల్ల రాజుగారు ఈ విన్యాసం చెయ్యగలుగుతున్నారు. రాజుగారి వాక్యనిర్మాణ శైలి కూడా బాగా దోహదపడుతుంది. కథను నడుపుతూనే, చారిత్రక విషయాలను ఏకరువు పెట్టడమూ మానరు. యానాంలో జరిగే ఆ విధమైన పెళ్ళిళ్ళకు సంబంధించిన ఎంతో సమాచారాన్ని అందించారు. ఈ పెళ్ళిళ్ళ కారణంగా యానాంలోని వర్తకులకు, స్వర్ణకారులకు అవి బంగారపు రోజులంటూ, ఎన్నో విషయాలు చెబుతారు. తాళిబొట్లు గంపల్లో పెట్టి అమ్మేవారట. ఇళ్ళ అరుగుల్నీ రోజులు, పూటలపద్ధతిలో అద్దెకిచ్చేవారట. పెళ్ళి ఫీజు ఏకంగా అయిదు రూపాయలు తీసుకునేవారట. ఎక్కువే అయినా, ధృవపత్రం ఇచ్చేవారు కనుక తప్పనిసరిగా పెళ్ళి చేసి, నిశ్చింతగా తమ ఊరికి పోయేవారట. ఇలా చాలా విషయాలు మనకు తెలుస్తాయి.

ఇక భాష విషయానికొస్తే, ఒక విషయం తప్పనిసరిగా చెప్పుకోవాలి. కథకు సంబంధించిన వస్తువుకు తగ్గట్టుగా తన భాషను మార్చడం రాజుగారి రచనలో చూస్తాం. ఈ కథే తీసుకుంటే, ఫక్తు బ్రాహ్మణ్యానికి చెందినటువంటి భాషని...అందునా ఎనభై ఏళ్ళనాటి భాషని తెలుసుకుని మరీ ప్రయోగించడం చూస్తాం. రెండు వాక్యాలు, ఉదాహరణకు, ఈ విషయం అవగతమౌతుంది. "పేరయ్య విస్తరికేసి దృష్టి సారించాడు. అన్నంపై నెయ్యి అభిఘారం చేసి ఉంది. సత్యంత్వర్తేన పరిషించాలి... అమృతమస్తు...అమృతో పస్తరణమసి... పరిషించాలి..." ఇలా సాగుతుంది భాష. అభిఘారం, పరిషించడం...ఇలాంటి పదాలను ప్రయోగించడంవల్లనూ, అలాగే 'ఒక మాట చెబితే పెద్దరికం బహుభేషుగ్గా ఉండేది' వంటి వాక్యాలను కూర్చడంవల్ల ఈ కథలో భాషావస్త్వైక్యాన్ని బాగా సాధించగలిగారు. అయితే, బ్రాహ్మణ్యపు భాషలో ఒక రకమైన యాస ఉండేది. నాచిన్నతనంలో నాకు అది తెలిసిన విషయమే. ఎనభై ఏళ్ళనాటి సంఘటనను రాస్తున్న కారణంగా, ఆ యాసను కూడ గుర్తించి ప్రయోగిస్తేఇంకా ఔచిత్యంగా ఉండేది. పాత్రోచిత భాషలాంటిదే కాలోచిత భాష కూడా.

భాషతో పాటు, ఆనాటి బ్రాహ్మణ్యపు వేషాన్ని కూడ బాగా వర్ణించారు. నీలకంఠ శాస్త్రి భౌతిక రూపాన్ని కళ్ళకు కట్టేలా వర్ణించారు. "ముంజేతికి సింహతలాటం, బంగారు కడియాలు, మెడలో రుద్రాక్ష తావళాలు,నుదుటన విభూతి, గంథం...వేషమూ భాషే సగం గౌరవం తెస్తుందనడానికి ఆయనే ఉదాహణ"ంటారు. శిష్టాచారం మంట గలిస్తే సహించలేని సగటు ఛాందస బ్రాహ్మణ్యపు మూర్తిని రూపుకట్టి చూపించారనడం అతిశయోక్తి కాదు. "వర్ణాశ్రమ ధర్మాలు, శాస్త్రచోదిత కర్మలు దిక్కూదివాణం లేకుండా పోకూడదనే పూర్వాచారాల్ని పట్టుకుని వేలాడుతున్నాము" అని చెప్పిస్తారు నీలకంఠశాస్త్రిచేత. వాక్యాన్ని బిందుపూర్వకంగా ముగించకుండా, ముకారాంతం చెయ్యడంలో పట్టుకు వేలాడే తత్వాన్ని వ్యంజనపరచారనడమూ అత్యుక్తి కాదు."ధర్మాన్ని సమంగా పాటించేవాళ్ళ మధ్యే బంధాలు కలకాలం నిలుస్తాయ"ని గట్టిగానమ్మిన వ్యక్తిగా నీలకంఠశాస్త్రి మన కళ్ళ ఎదుట నిలుస్తాడు.

అలాగే, ఆనాటి ప్రజల వేషభూషణలను సందర్భోచితంగా వివరించడం బావుంది. "మగవారేమో-అందమైన తలపాగ, చెవులకు పోగులు, చేతులకు కడియాలు, నుదుట నిలువుగా కుంకుమ బొట్లు పెట్టుకుంటే ఆడవారేమో, వడ్డాణాలు, నాగరం,జడగంటలు, పాపిడి చేరు, సూర్యచంద్రులు, దండ కడియాలు, కంటె, కాసులదండ ధరించేవారని తెలియజెప్పారు. వాతావరణం, పరిసరాలూ, కాలం, నేపథ్యం... వేటికవిగా విడిపోతే కథనం దెబ్బ తింటుంది. ఈ అంశాలమధ్య సమన్వయం పాటిస్తూ, కథావస్తువును పూరకం చేస్తే అప్పుడు కథనం అద్భుతంగా రక్తి కడుతుంది. ఈ రక్తి కట్టించే నేర్పు రాజుగారికి తగినంత ఉందని నిరూపిస్తుంది 'కళ్యాణపురం'. సంఘటనలూ, సన్నివేశాలూ, విషయాలూ వేటికవిగా వింగడింపబడకుండా ఎలా చెప్తే కథ అవుతుందో తెలుసుకోవడానికి అధ్యయనశీలై ఉండడంతో పాటు, రచయిత, సంబంధిత విజ్ఞాన భాండాగారాన్ని ఆశ్రయించక తప్పదు. అలాగని సేకరించిన సమాచారం మొత్తాన్ని ఏకరువు పెట్టనూకూడదు. ఈ సమన్వయం రాజుగారి కథనంలో తగు మోతాదులో కనబడుతుంది.

ఏమీ తెలియని పిల్లలకి పెళ్ళి చెయ్యడమనేది, ఇప్పుడు చేసినా బహుశా వినోదంగానే అనిపించవచ్చు. బాల్యవివాహంలోని వినోదాన్ని బాగా వర్ణించారు. సమయాభావం వల్ల వివరించలేకపోతున్నాను.పనిలో

పనిగా యానాం మీసాల వెంకటేశ్వరుణ్ణీ ప్రస్తావించారు...వర్ణించారు... స్వామికి ఆ పేరెందుకు వచ్చిందో వివరించారు. ఇలా వస్తువుకు సంబంధించిన చిన్నచిన్న విషయాలను ప్రస్తావించడంద్వారా కథనానికి ఒక సమగ్రతను కూర్చారు రాజుగారు. అందుకు ఆయనను అభినందించాలి.

(కథతో కాసేపు ... చర్చలో ప్రసంగం)

కథకుడు : ఎలికట్టె శంకర్ రావు
కథ : తాత కథ
ప్రచురణ : నవ్య వారపత్రిక
6.8.2008

# కథ చెప్పే తాత కథ

"కథ చెప్పవూ!" - గోముగా అడిగే మనుమలుంటే వారికంత ముద్దుగానూ చెప్పే తాత ఉన్నప్పుడు, నైతికవిద్య దానంతటదే కొనసాగేది.

ఇప్పుడు అలాంటి మనుమలూ లేరు; అలాంటి తాతలసలే లేరు. నట్టింట్లో తిష్ఠవేసిన ఇడియట్ బాక్స్ పుణ్యమాని, కళ్ళ జతలు దానికే అంటిపెట్టుకుపోతున్నాయి. అంతా మాయదారి సినీమా ఓరియెంటేషన్ కార్యక్రమాలతో పెద్ద బుర్రలే ఖరాబవుతుంటే, ఇక చిన్ని బుర్రల మాట చెప్పేదేమిటి?

కతలు వట్టి కతలు కావవి. కలతలు పోగొట్టేవీ; వెతలు బాపేవీ!

ఇంట్లో కథలు చెప్పే తాతో, నానమ్మో ఉంటే, వారిని కథలు చెప్పనిస్తే... లోకం ఇప్పుడున్నంత ఛండాలంగా మాత్రం ఉండదని ఘంటాపథంగా చెప్పగలిగే సత్తా ఇచ్చే కథ ఒక 'తాత కథ'. కథకుడు ఎలికట్టె శంకర్ రావు; నవ్య

వీక్లీలో 6-8-2008 - ప్రచురితం. గాడి తప్పిన మనుమడి కాపురాన్ని దారిలో పెట్టిన తాత చెప్పిన కథ ఈ 'తాత కథ'.

స్థూలంగా కథ ఏమిటంటే, మనుమడు సుధాకర్ దసరా పండుగకు ఇంటికి వస్తాడు. పండుగకు ఇంటికి రావడంలో వింతగాని అసంగతంగాని ఏముంటుంది? కాని సుధాకర్ రాకలో ఉంటుంది. అతనొక్కడే వచ్చాడు. కూడా భార్య మమత రాలేదు. ఆమె పుట్టింటికి పోతుంది. మామూలుగా కాదు, స్పర్ధతో.

సుధాకర్ మనసు బాగోక పొద్దుగూకులా మంచానికి అడ్డంగా పడి ఉంటాడు. చూస్తున్న తాత మనసు కూడ బాగుండదు. "సుధాకర్ ఒక్కడే రావడం బాగనిపించలే, బాధనిపించింది".

"సుధాకరూ నీకో కథ చెప్పాలనిపిస్తుందిరా"

"ఇదే చివరి కథ తాత, మళ్ళీ చెపుతానంటే మాత్రం వినను." - షరతులు వర్తిస్తాయంటాడు, బిజినెస్ ఎగ్జిక్యూటివ్‌గా చేసే మనవడు. తాత ఒప్పుకుంటూ, "చాలా ఏండ్ల కింద నాటి కథ..." మొదలెడతాడు.

సావిత్రి, పాపులు భార్యాభర్తలు. ఎంతో అన్యోన్యంగా ఉంటారు. చూసే సావిత్రి అత్తకు స్వార్థాసూయ కలుగుతుంది. తనకు కాకుండా పోతున్న కొడుకు, ఎప్పటిలా తనవాడిగా ఉండాలనే స్వార్థం; వయసులోనే భర్తను పోగొట్టుకున్న తనకు దక్కని దాంపత్యానురాగం కోడలికి దక్కుతోందనే అసూయ వెరసి, స్వార్థాసూయతో రగిలిపోతుంది. కోడల్ని సూటిపోటీ మాటలంటుంటుంది. సావిత్రి అత్తగారిని మందలించమని భర్తను కోరుతుంది. పాపులు ఎవరివైపుకూ మొగ్గలేదు; భార్యంటే ప్రేమ లేకాకాదు, అమ్మంటే భయమూ లేదు. కానీ, భార్యకు సర్దిచెప్పలేదు; అమ్మని మందలించనూలేదు. కానీ ఇద్దరిమధ్య నలిగిపోతూనే ఉంటాడు.

అత్తపోరు భరించలేని సావిత్రి, అతికష్టంమీద పోలేక పోలేక పుట్టింటికి పోతుంది. రోజులు దొర్లిపోతుంటాయి. ఇద్దరిమధ్య ఏర్పడిన దూరం, దగ్గరయ్యే ప్రయత్నానికి గండికొడుతుంది. కానీ, ఇద్దరూ, ఒకరి జ్ఞాపకాల్లో ఒకరు అనునిత్యం మసలుతూనే ఉంటారు. ఆర్నెల్లు... సంవత్సరం- రోజులు దొర్లిపోతుంటాయి. ఇంతలో "అదెవర్నో మరిగిందట్రా" అంటుంది తల్లి. అలా ఎలా మాట్లాడగలుగుతున్నావంటాడు తల్లిని పాపులు. కానీ అది నిజమేనంటుంది రెండేళ్ళ తర్వాత తిరిగొచ్చిన సావిత్రి, పశ్చాత్తాపంతో.

పాపులు తల బద్దలు కాలేదు
కాళ్ళకింది నేల క్రుంగిపోతున్నట్లు అనిపించలేదు
మిన్ను విరిగి నేలమీద పడ్డట్టూ అనిపించలేదు.

"పాపులు ఒక్క క్షణం ఆగిండు. కిలకిలా నవ్విండు. సావిత్రిని కౌగిట్లో బంధించిండు...." ఏ వికారమూ లేని స్థితప్రజ్ఞుడిలా పాపులుండి పోయాడు.

ఇక్కడివరకూ తాత చెప్పిన కథ కూడ అనుద్వేగంగా సాఫీగా సాగుతుంది. సుధాకర్‌కు తాత ఆ కథ ఎందుకు చెప్పాడా అని అనుమానం వస్తుంది. కాకపోతే ఏదో తాకినట్టుగా అనిపించింది. "నిజమా చెప్పు. మరీ పాపులంత గొప్ప మనుషులుంటారా, ఈ కాలంలో!", తాత కళ్ళల్లోకి సూటిగా చూస్తూ అడుగుతాడు.

తాత కండ్లలో తడి. మొకంలో గర్వం. "నిజమేరా. పచ్చి నిజం. ఈ కథ జరిగి యాభై ఏండ్లయ్యింది...సావిత్రి పోయి పాతికేండ్లయ్యింది"

"ఎట్ల నమ్మేది తాతా", సుధాకర్ తాతను ఇరుకట్ల పెట్టిన అనుకుండు.

"నువ్వు నమ్మాలి. ఎందుకంటే పాపులను నేను, సావిత్రి నా భార్య. సావిత్రి కడుపుల పుట్టినోడే నీ తండ్రి" – సుధాకర్‌కు తల తిరిగిపోయింది. మాట పడిపోయింది. హడావిడిగా ఇంట్లోకి పోయి బ్యాగ్ సర్దుకుంటాడు. ఎక్కడికిరా అని తల్లి అడిగితే, మమత కాడికి అంటాడు. కథ పూర్తవుతుంది. సావిత్రితో పోలిస్తే మమత ఏపాటి? తానూ ఉద్యోగం చేస్తానంది. తాను వద్దన్నాడు. అంతే. చిన్న స్పర్థ!

పాపులు ఔన్నత్యం తెలిపే మాటలు చెబితేగాని నాకు తృప్తి కలిగేలా లేదు. "మొగోనివి కావురా, సిగ్గులేదురా" అని తల్లి అడిగితే, ఆ రోజు ఉదయమే ఎదకొచ్చిన బర్రెపడ్డని తల్లి పనుపున దొరోరి దున్నపోతుతో దాటిచ్చిన విషయాన్ని గుర్తు చేస్తూ అంటాడు, "అమ్మా, బర్రెపడ్డ ఎదకొచ్చింది. దొరోరి దున్నపోతుతో దాటిచ్చినం. రేపు ఈంతది. మనం జున్ను తాగుతం. పాలు తాగుతం. పెరుగు తింటం. వెన్నముద్దలు తింటం. అదీ మన బర్రెనే. దొరోరి దున్నపోతు యాదికొస్తదా. ఏ దొడ్లె కడితేందమ్మా, మన దొడ్లె ఈంతే సాలదా!"

పాపులు స్వచ్ఛమైన తియ్యని మనసులాంటి తెలంగాణా తెలుగులో కథ ఆసాంతమూ సాగుతుంది. అందుకు శంకర్‌కి అభినందనలు చెప్పకుండా ఉండలేను. (అరుణ దినపత్రిక, 3-9-2008)

కథకుడు : కూర్మనాథ్
కథ : వెన్నెల పడవ
ప్రచురణ : ఆదివారం
ఆంధ్రజ్యోతి

# కంచికి చేరే పెద్దాళ్ళ కథలు

కథలంటే ఎంతో ఇష్టపడే బాల్యం, పెరిగి పెద్దదై సంసారపు ఝంఝాటంలోనో, ఉద్యోగ బరువు బాధ్యతల్లోనో పడిపోయి బాల్యాన్ని కోల్పోయి చికాకులూ చీవాట్లతో చిలిపితనాన్ని మరచిపోయి చిందులేసిన గతాన్ని చిందరవందర వర్తమానంతో కప్పేసి...

పిల్లలకు తెలిసిందొకటే, తాము విన్న కథలన్నీ కంచిలో చేరి ఉన్నాయని. పెద్దవుతూనే, దూరం పెరగడంతోనేమో, కథతో అనుబంధాన్ని తెంపుకుంటారు – ఎలికట్టె శంకర్రావు 'తాత కథ'లో రమేష్‌లా! తాతో, నానమ్మో కథ చెబుతానంటే, ఇదే ఆఖరుకథని షరతులు పెడతారు. కథకీ, పెద్దతనానికీ చుక్కెదురు కాబోలు. కానీ, కంచికి చేరిన కథలన్నీ అనుకుంటాయి, ఆ పెద్దాళ్ళని చూసి– వీళ్ళ కథలు కంచికి చేరాయని; కంచికి చేరడమంటే ముగిసిపోడం అనే అర్థంలో! ఎంతో జాలిపడతాయి.

ఇలా కథకి సంబంధించి రెండు కంచిలున్నాయి. పిల్లల కంచి, పెద్దల కంచి! పిల్లల కంచిలో కథలన్నీ భావుకత్వాన్ని మప్పేవైతే, పెద్దల కంచిలో కథలు చావుకత్వానికి దగ్గర చేర్చేవి. పిల్లల కంచిలో వీధులన్నీ వింతలతో విడ్డూరాలతో విరజిమ్ముకుని ఉంటే, పెద్దల కంచిలో చింతలతో చిక్కులతో వెదజల్లుకుని ఉంటాయి. పిల్లల కంచి ఓ చిన్మయనాకం; పెద్దల కంచి ఓ మృణ్మయ నరకం.

పెద్దల కంచిలో ఉండేది ఎక్కువగా నాన్నలే కావడం ఒక వింత. ఈ వింతలోని రహస్యాన్ని విప్పిచెప్పారు, తన కథ 'వెన్నెల పడవ'లో కూర్మనాథ్. ఈ కథ ఆదివారం ఆంధ్రజ్యోతిలో (తేదీ వివరాలు పోగొట్టుకున్నాను. ఈ కథపై రాసిన వ్యాసం అచ్చయిన పత్రిక కొసలు చిరిగిపోడంవల్ల, ఆ తేదీ వివరాలు కూడ పోగొట్టుకున్నాను) వచ్చింది.

తాతయ్యలూ, నాన్నమ్మలూ ఇంట్లో ఉంటే, పిల్లల మనసులు వేస్తాయి గెంతులు. వాళ్ళు కథలు కూడా చెబితే ఇక, గెంతులే గెంతులు!

చిన్నారి కథకుడి అదృష్టమేమంటే, వాళ్ళ ఇంటిముందు గుడిసెలో అవ్వ ఒకతె ఉండేది. రాత్రి బువ్వ తినేసి వెళ్తే, కథలు చెబుతూ, చల్లగ కురిసే వెన్నెల్లో హాయిగా జలకాలాడించేది. ఆమె చంద్రుడి గురించి చెప్పే కథలైతే, ఎంత బాగుండేవో! పిల్లల్ని ఆడించడానికే చంద్రుడు ఉన్నాడనీ, అతడికదే ప్రపంచమనీ, ఏడ్చి పడుకునే పిల్లల కలల్లోకి వస్తాడనీ...రోజుకో కథ. అసలు చంద్రుడు ఒక్కడు కాదు(ట). ఆకాశంలో పద్నాలుగు మంది చంద్రులు. అమావాస్య తర్వాతి రోజునుంచి మొదలెట్టి పిల్లల్ని ఆడించే పనిని రోజుకొక చంద్రుడు చూసుకుంటాడు. అమావాస్యనాడు మాత్రం అందరూ విశ్రాంతి తీసుకుంటారు. ఆ రోజు వాళ్ళ నేస్తాలైన లక్షలకొద్దీ చుక్కల్ని పంపి, తాములేని లోటు పిల్లలకు కనబడనీయరు. ఆమె చెప్పే కథలన్నీ బలేగుంటాయి. సూర్యుడు, చంద్రుడూ అన్నదమ్ములనీ, పిల్లలు పగటిపూట ఆడుకోడానికి సూర్యుడు వెలుతురిస్తే, చంద్రుడు రాత్రిపూట ఇస్తాడంటుంది. అసలు కురిసే వెన్నెలంతా పిల్లలకోసమేట. అందుకే పిల్లలకి పున్నమి చంద్రుడో వెండిబంతి, ఆకాశానికి పెట్టిన బొట్టు, తియ్యటి పాలకోవా,అందమైన ఆల్చిప్ప, ఆకాశంలోకంటా ఎగరేసిన బుడగ! మిగతా రోజుల్లో మంచుజారుడు బండ, అద్దం ముక్క, పక్షి ఈక, వెన్నెల ఉయల...

చిన్నారి కథకుడోసారి ఏటిఒడ్డుకి స్నానానికి వెళ్తే, అది తెలిసి నాన్న బాగా కొడతాడు. ఎప్పుడూ తిట్టని కొట్టని నాన్నమ్మ కూడ నాన్నతోనే

ఏకీభవించేసరికి, నాన్న కొట్టినదానికంటే నాన్నమ్మ ఉదాసీనతే ఎక్కువ బాధపెట్టగా...ఏడ్చి ఏడ్చి అలసిపోయి నిద్రలోకి జారుకుంటే, ఆనిద్దట్లో కల; కల్లో నెలవంక ఊయల్లా నేలమీదికి దిగింది. అప్పటికే నలుగురైదుగురు పిల్లలు అందులో ఎక్కి కూచున్నారు. చిన్నారి కథకుడూ ఎక్కుతాడు. అంతే అది రాత్రిసముద్రంలో పడవలా కదులుతూ మేఘాలుదాటి పైకి, పైపైకి పోతుంటుంది. దాన్ని వెన్నెల పడవగా గుర్తిస్తాడు కథకుడు. పిల్లలంతా కేరింతలతో, చేతులు బయటకు పెట్టి కురిసే మేఘాలను తాకుతూంటే...పడవ నెమ్మదిగా ఒక మేఘం గుంపునుండి మరో మేఘం గుంపుకు వెళ్తుంటే...పిల్లలందరూ ఆనందమేఘాలై అరుస్తూ ఈలలేస్తూ కోలాహలం చేస్తుండగా, దరిచేరిన మేఘం గుంపునుండి హఠాత్తుగా ఒక మనుష్యాకారం, వాళ్ళవైపే వస్తూంటే భయంభయం. తేరిపార చూస్తే అది నాన్నే, "చెప్పకుండా ఎందుకెళ్ళేవు ఏటి"కంటూ గద్దిస్తూ. అంతలో నెలవంక వెన్నెల పడవ వేగం పుంజుకుని ఇంకా పైకి నాన్నకి కనబడకుండా, అందకుండా పైపైకి తీసుకుపోతుంది.

ఎన్నేళ్ళ క్రితందో ఈ కల. చంద్రుడితో ఆ చెలిమి ఎప్పుడు తెగిపోయిందో తెలీదు. బాల్యం గడిచేకా చంద్రుడి సావాసం పోయిందో, చంద్రుడి సావాసం తగ్గి బాల్యం మాయమైందో తెలీని పరిస్థితి.

పెద్దై ఉద్యోగం చేసుకుంటూ సంసారబాధ్యతల్లో కొట్టుకుంటూండగా, చంద్రుడితో ఓ కొత్త అనుభవం. ఎప్పుడూ లేనిది, ఎంతో తిరస్కారంతో చంద్రుడు కథకుణ్ణి చూస్తాడు. మూడేళ్ళ కొడుకు సబ్బుబిళ్ళ కొరుకుతూ కంటబడేసరికి ఆపుకోలేనంత కోపం. ఆ కోపంతో రెండు వేసేసరికి వాడు ఏడుపు లంకించుకుంటాడు. రెక్క పట్టుకుని ఈడ్చుకుపోయి నల్లా దగ్గర మూతి కడుగుతాడు. వాళ్ళమ్మ కూడ వాడ్ని సపోర్టు చేయకపోయేసరికి, ఎక్కడలేనీ ఉక్రోషం తన్నుకొస్తుంది. వాడు వెక్కుతూ పోయి మంచంమీద పడి ఏడుస్తూ, నెమ్మదిగా నిద్రలోకి జారుకుంటాడు. వాడికి అర్థమయేలా చెప్పకుండా అనవసరంగా కొట్టానన్న బాధతో కథకుడు కూడ అన్నం తినకుండా వాడి పక్కకుపోయి పడుకుంటాడు. ఎప్పుడో చిన్నప్పుడు వచ్చిన కలలాంటిదే...తాను పెద్దగా పెరుగుతూ పెరుగుతూ అలా ఆకాశంలోకి విస్తరిస్తుంటే, చేతికి తగులుతూ సబ్బునురగల్లాంటి మేఘాలు చేతికందుతూ...దూరంగా ఆ మేఘాల్లోంచి

తేలుతూ నెలవంక, వెన్నెల పడవలా వస్తూ! తేరిపార చూస్తే అందులో నలుగురైదుగురు పిల్లలు, తన మూడోవాడితో సహా! మబ్బుల చాటునుంచి హఠాత్తుగా ప్రత్యక్షమైన తన్ని చూసి వణుకుతూ, చంద్రవంక అంచుల్ని గట్టిగా పట్టుకున్నారందరూ. వాడైతే భయం భయంగా తననే చూస్తున్నాడు. "చెప్పు సబ్బెందుకు నోట్లో పెట్టుకున్నా"వని తాను గదమాయిస్తుండగా, అప్పుడు చంద్రవంక కథకుణ్ణి చూసిన చూపు మరచిపోలేనిది– ఎంత తిరస్కారం, ఎంత అసహ్యం. పిల్లల స్నేహితుడు చంద్రుడు తన వెన్నెలపడవ వేగం పెంచి, తనకు దూరంగా వాళ్ళను తీసుకుపోయాడు.

కలచెదిరి పక్కకి చూస్తే, నిద్రలో నవ్వుకుంటూ కదులుతూ వాడు, బహుశా ఆ లోకంలో దిగినట్టున్నారు పిల్లలు అనుకుంటాడు కథకుడు.

ఎప్పటెప్పటివో ఊహలకు ఒక రూపాన్ని సూచించిన శ్రీకాంత్‌కు కృతజ్ఞతలు చెబుతాడు కథకుడు; ఆయనతో పాటు పాఠకుడూ చెబుతాడు.

కథయిత్రి : కె.ఎన్. మల్లీశ్వరి
కథ : పెత్తనం
ప్రచురణ : ఆదివారం వార్త,
16.4.2006

## పెద్దరికం తెలీనిది పెత్తనం

అధికారమంటేనే డాబూ దర్పం. ఆ డాబూదర్పాలతో వచ్చే జబ్బులింకా అనేకం–దౌష్ట్యం, దాష్టీకం, పెత్తనం చేయడం, పీడించడం... ఎంతో కాలంగా అధికారపు దౌష్ట్యానికీ, దాష్టీకానికీ, పెత్తనానికీ పీడింపబడిన అణచివేతకి అధికారం వస్తే ఏం చేస్తుంది? ఆ బాధలు తనకు తెలుసున్నవే కనుక ఎంతో సంయమనంతో మెలగుతూ తనకింది వారికి అటువంటి అనుభవాలేమీ కలిగించకుండా

ఉదాత్తంగా ఉన్నతంగా వ్యవహరిస్తుందా?

ఆధిపత్యపు తరతరాల అణచివేతకు గురై భౌతికంగా, బౌద్ధికంగా, శారీరకంగా, మానసికంగా నలిగిపోయిన దళితత్వం – అధికారాన్ని చేజిక్కించుకుంటే ఏమౌతుంది? కె.ఎన్. మల్లీశ్వరి కథ 'పెత్తనం', ఈ సున్నితమైన విషయాన్ని కఠోర వాస్తవిక నేపథ్యంతో విమర్శించి, విశ్లేషిస్తుంది. తరతరాలుగా వివక్షకు గురై

ఆత్మగౌరవాన్ని, ఆత్మస్థైర్యాన్ని కోల్పోయిన దళితత్వానికి ఒక్కసారే అధికారం లభిస్తే? ఎన్నో అంశాల్లా, ఇదీ అనేక పార్శ్వాలున్న విషయమే. ఆ అధికారంతో మంచిని స్థాపించవచ్చు; లేదా తనకి జరిగిన తీరని అన్యాయానికి కక్షకట్టి సాధింపనూవచ్చు.

అతడొక దళితుడు. వివక్షాపూరిత సమాజానికి ఎదురొడ్డి నిలచిన వీరుడు. దళితుడైన తానే ఇకపై చరిత్ర రాస్తానని రొమ్ము విరచిన మేరునగధీరుడు. ముళ్ళ కంపల్లాంటి ఆంక్షలను తొలగించుకుంటూ, తన తదనంతరం వాళ్ళకి తోవ నిర్దేశిస్తూ, అదే తోవలో తానూ దూసుకుపోతున్న శూరుడు. జిల్లాఉన్నతాధికారిగా ఉద్యోగం చేస్తూన్న సత్యరాజు. భార్య సరోజ, అతనే చదివిస్తే ఉన్నత విద్య అభ్యసించిన గృహిణి. ఉపాధ్యాయినిగా పని చేస్తుంటుంది.

'వీడీవోను లైంగిక వేధింపులకి గురి చేస్తున్న జిల్లా వున్నతాధికారి' అన్న హెడ్డింగ్, కింద సత్యరాజు ఫోటోతో వార్త వస్తుంది. దీనితో కథ ఉపోద్ఘాతంనుంచి అసలుదిశగా కదులుతుంది. ముందు సరోజ చూస్తుందా వార్త. అపుడే నిద్రలేచిన సత్యరాజు ఆమెను చూసి ఎప్పటిలా ఎంతో నిర్మలంగా నవ్వుతాడు. తప్పు చేసినవాడైతే ఇలా నవ్వలేడనుకుంటుంది. పేపర్ చూపిస్తుంది. చూస్తూనే, నొసలు ముడివేసిపూర్తిగా చదివాకా పెద్దపులిలా కనిపిస్తాడు. అదీ, మాటువేసిన పెద్దపులి తనమీదే దాడి జరిగినపుడు చూపే అసహనంతో!

ఫోనులో ఎవరితోనో మాట్లాడుతూ, కాన్ఫిడెన్షియలంటూ ఆమెను వెళ్ళమంటాడు. దానికి అలవాటుపడిపోయిందెప్పుడో ఆమె. పెళ్ళై రెండేళ్ళైనా కాకుండానే ఉపద్రవమా? ఆమెకు ఏం తోచదు. మాట్లాడ్డం పూర్తయేసరికి మళ్ళీ ఎప్పట్లా మొహంలో నమ్మలేని ప్రశాంతం. ఆ ప్రశాంతత, నిర్మలత్వం అంతా నిజమా? నటనా?? మొదటిసారి అనుమానం వస్తుంది. అది ప్రేమా? ముసుగా? అవసరమా? ఏంటసలు? ఏమో!

సరోజ గుచ్చిగుచ్చడిగినా, తనకనవసరం అంటూ, పట్టించుకోవద్దంటాడు. "నువ్వు ఆడదానివి. నీకు రాజకీయాలేమీ తెలీవు...నేను చెప్పినా నీకు అర్థం కా"దంటాడు. ఆమెకంతకు ముందెన్నోసార్లు కలిగిన నివ్వెరపాటూ, నిర్ఘాంతత మళ్ళీ ఇపుడు నాలుగోసారి పొందుతుంది. ఆడ, మగ కూలీలకు వేర్వేరు కూలీ ఇస్తారని

తెలిసినప్పుడు మొదటిసారి నిర్ఘాంతపోయింది. పగలు పనిచేస్తూ రాత్రి సత్యరాజు దగ్గరకు చదువుకోడానికి వెళ్తుంటే రంకు కట్టినప్పుడూ, గూడెం పెద్ద తన అయ్యని మాత్రమే తప్పు కట్టమన్నప్పుడు, అదేంటని సత్యరాజు అడిగితే "యవ్వారాలు నడిపే గుడిసేటి బుద్ధి ఆడ ముండలకే వుంట"దని అన్నప్పుడు ఆమె వరసగా నివ్వెరపడి నిశ్చేష్టితై నిర్ఘాంతపోయింది. అవన్నీ ఒక ఎత్తైతే, సత్యరాజన్న మాట ఒక ఎత్తుగా ఆమెను బాధించింది.

తరతరాలుగా తమ జాతి అనుభవించిన అణచివేత వివక్షకి ప్రతీకారంగా అవమానించడానికి ఒక అగ్రవర్ణపు స్త్రీని అతను ఎంచుకున్నాడు. ఇప్పుడతనికి అధికారం వచ్చింది. ఆ అధికారం అవకాశాన్ని చేజిక్కించింది. వేధింపుకు గురైంది కూడ ఎవరో కాదు. ఉద్యోగానికి ముందు చదువుకునే రోజుల్లో ఎవరింట్లో తాను ఊడిగం చేశాడో ఆ ఇంటి ఆడపడుచే, హేమ. "వందల ఏళ్ళనుంచీ పడ్డ బాధల ముందు యిదో లెక్కే కాదు...వాళ్ళకీ తెలియాలి...వాళ్ళు తెలుసుకోలేకపోతే తెలియజెప్పాలి. అదే చేశా"నని మథ్య పెట్టుకుంటాడు సత్యరాజు.

అతని మాట లెక్కచెయ్యకుండా ఆమె హేమను చూడ్డానికి వెళ్తుంది. కింద చాప వేస్తుంది హేమ తల్లి. వివక్ష తాలూకు అవశేషాలన్నట్టూ, పడక్కుర్చీలో కూర్చున్న హేమ తండ్రి కాళ్ళూపుతూ ఆమెను వచ్చి కూర్చోమంటాడు. జరుగుబాటుకోసం పిల్లని ఉద్యోగానికి పంపుతున్నామంటూ, మీలా మేము చెడి బతికిన రకాలం కాదంటాడు. పదిసార్లు తన ఆఫీసుకి తిప్పుతూ వేధిస్తున్న కారణంగానే యిదంతా చేయాల్సి వచ్చిందంటుంది హేమ. తమ ఇంట్లో వాళ్ళిద్దరూ పనిచేస్తున్నప్పుడు వాళ్ళనెంతో ప్రేమతో చూశానని, అయినా ఎక్కడ వుంచాల్సినవాళ్ళని అక్కడ వుంచకుండా తప్పు చేశానంటుంది. తామిద్దర్నీ వాళ్ళు ముగ్గురూ అదేపనిగా తిడుతుంటే అక్కణ్ణించి వచ్చేస్తుంది సరోజ.

వద్దన్నా కల్పించుకున్నందుకు సత్యరాజుకు ఎక్కడలేని కోపం వస్తుంది. "నిన్ను నేను ఆకట్టుకోకపోడంవల్లనే ఇలా జరుగుతోందని నన్నందరూ తప్పు పడుతుంటే ఎలా? ఎలా పట్టించుకోకుండా ఉండడం? ఇలా ఎందుకు జరుగుతోందో తెలీక మధ్యలో నలిగిపో..." ఆమె మాటల్ని పూర్తిచేయకుండానే, అలా అనద్దంటూ అతనామెను చుట్టుకుపోతాడు. అంత గొప్ప ప్రేమికుడు సత్యరాజు. పదిహేడేళ్ళ తెలిసీ తెలియని వయసులో బస్సులో పొరపాటున హేమను తాకినందుకు తన్నెలా కొట్టారో ఎలా

మరచిపోగలనంటూ ప్రశ్నిస్తాడు, వంకరపోయిన చేతివేళ్ళను చూపుతూ. "వంటినిండా, మనసునిండా ఆ గాయాల ఆనవాళ్ళను మోస్తూ ఏం జరగనట్లు ఎలా వుండ"నంటూ ఆక్రోశంగా ప్రశ్నిస్తాడు.

"ఒకప్పుడు వాళ్ళు ప్రయోగించిన ఆయుధాన్నే, నీకు లభ్యమైన కారణంగా నువ్విప్పుడు ప్రయోగించాలనుకుంటున్నావు. అదే అధికారం, పెత్తనం. ఇకిపుడు వాళ్ళకీ నీకూ తేడా ఏముంది?" ఆమె తార్కికంగా ప్రశ్నిస్తుంది. పెత్తనం కింద నలిగిపోయిన నువ్వే దానికి లొంగిపోడం జీర్ణించుకోలేకపోతున్నాను. అధికారం నీ చేతికందగానే నీ విశ్వరూపం చూపెడుతున్నావు...అంతే కాకుండా, "జీవితాంతం కలిసి నడవాల్సిన సహచరులం మనం. మన మధ్య పెత్తనాల సమస్య రావడం బాధాకరం...నేనెలా రాజీపడాలి? భర్త ఏం చేసినా నోరు మూసుకునే సరోజ...వ్యక్తిత్వం లేని సరోజ...హృదయంలేని సరోజ...వట్టిశరీరం మాత్రమే కలిగిన సరోజ... నీకు చాలు...", ఆమె వాక్ప్రవాహం ఇంకా ఆగకుండా సాగుతూంటే, భరించలేనట్లు చూసి, ఆమె ఒళ్ళో తల దాచుకుంటాడు, "చాలా తప్పు చేస్తున్నాననిపిస్తోంది" అస్పష్టంగా అంటాడు. "తెలిసిందా అయితే" అని ఆత్మీయంగా ఆమె అంటే, "వూ...అర్థం చేసుకుంటాను. యింకొంచెం అవగాహనతో వుంటా"నంటాడు తల్లిముందు తప్పు ఒప్పుకునే పిల్లాడిలా సత్యరాజు.

కథలో అసలు చర్చ అయిన కులవివక్షతో పాటు, స్త్రీవాద రచయిత కావడంవల్ల మల్లీశ్వరి ఆ కోణాన్ని కూడ చర్చించి ఈ కథకు నిండుదనాన్ని తెచ్చారు. సున్నితమైన సమస్యని అంతే సున్నితంగా ఎవ్వరికీ నొప్పి కలుగని రీతిలో చర్చించిన మల్లీశ్వరిని అభినందించాలి.

కథకుడు : ఎ. ప్రభాకర్
కథ : అతడు మనిషి
ప్రచురణ : విపుల
ఫిబ్రవరి 2007

# మానవీయతను కథీకరించిన

# 'అతడు మనిషి'

మనిషి, మనిషి అనిపించుకోడానికి ఉండాల్సిన గుణం ఏమిటి? మానవత్వం. మానవత్వం ఉండబట్టి మనిషయ్యాడో, మనిషిగనుక అతనికి మానవత్వం అబ్బిందో జవాబు చెప్పలేని ప్రశ్న. విత్తు ముందా? చెట్టు ముందా? అన్నట్టే!

ఇప్పుడు మానవత్వం ఏమాత్రం లేకపోయినా మనిషి ఉంటున్నాడు. మనిషిలోంచి మానవత్వం ఎప్పుడో పారిపోయింది. మానవత్వం లేని మనిషి, మనీ సంబంధాల మనిషి, మెనీ సంబంధాల మనిషిమాత్రం మిగిలిపోయాడు. మానవత్వం గల మనిషి ఎప్పుడో చచ్చిపోయాడు. కలికంలోకి లేకుండా పోయాడు.

కానీ, ఉన్నాడంటున్నారు, ఎ. ప్రభాకర్. 30 వసంతాల విపుల కథలపోటీలో ప్రథమ బహుమతిపొందిన కథ 'అతడు మనిషి'. అతడు 'పాకలో మనిషి'. కథకుడు అతడికి పేరు పెట్టలేదు. అతడి భార్యకీ, బుడ్డోడికీ ఎవరికీ పేర్లు పెట్టలేదు.

మానవత్వం రూపెత్తినవాళ్ళు; వాళ్ళు 'మనుషులు', అంతే. 'మానవీయ కోణం' అంటూ రాసిన ఎడిటోరియల్ లీడ్ – "అతడు మనిషి' అద్భుతమైన కథాగమనంతో మానవీయపు లోతుల్ని ఆవిష్కరించిన కథ...చక్కటి శిల్పంతో ఆద్యంతం ఆసక్తికరంగా సాగుతూ పాఠకుణ్ణి కట్టిపడేసే కథ" అంటుంది.

కథలోకి వెళ్తే –అతి సాదా మామూలు కథే. ఓ విశ్వవిద్యాలయం ఉన్నత విద్యార్థి వెంకటేష్ చాలా అర్జంటుగా ఆదుర్రు వెళ్ళాలి. బస్ రూటైతే చాలా దూరం, చాలా సమయం పడుతుందని, అమలాపురంలో దిగి ఆటో పట్టుకుని బోడసకుర్రు రేవులో దిగుతాడు. ఆవలి వొడ్డు పాశర్లపూడి. గోదారి దాటి వెళ్తే ఇట్టే ఆదుర్రు పోవచ్చు. కానీ, ఆటో దిగేసరికే భీకరమైన వాన, అలా కురుస్తూనే వుంది. ఎర్రటి నీళ్ళతో వైనతేయ గోదావరి పాయ పరవళ్ళు తొక్కుతోంది. ఎవర్నడిగినా, ఆ సమయంలో గోదారి దాటడం కష్టమంటారు. సాయంత్రం నాలుగే అయినా, మబ్బులు మూసేసి చీకటైపోయి రాత్రిలాగుంది.

తడుస్తూనే ముందుకు వెళ్తే, ఒడ్డున కాస్తంత దూరంలో భూమికి జానెడెత్తులో పాకొకటి కనబడుతుంది. పాకలో ఒక మనిషి మాత్రం ఉన్నాడు. ఎంత డబ్బయినా పర్లేదు, నావమీద గోదారి దాటించమంటాడు వెంకటేష్. అది అయ్యేపని కాదంటాడు ఆ మనిషి. త్వరగా వెళ్ళకపోతే కొంపలంటుకుపోయే పని. కానీ, ఏ కొంపలైనా ఎలా అంటుకుంటాయి? కుండపోతగా వర్షం ఆగకుండా అలా ధారాపాతంగా పడుతూనే ఉంటే! నెమ్మదిగా పరిస్థితి ఆకళింపుకొస్తుంది. చేసేదేమీ లేక, పాకలోవాళ్ళు చెప్పినట్టు వినడమే చేయాల్సిన పనని మనసును సరిపెట్టుకుంటాడు. ఆ చిమ్మచీకట్లో, కుండపోతలో, పరవళ్ళెత్తే గోదావరి ప్రళయఘోషలో...పాకలో మనుషులు ఉన్నంతలో ఇచ్చిన ఆతిథ్యంతో ఆ రాత్రికి అక్కడ అలాగే ఉండిపోతాడు వెంకటేష్.

మర్నాటి మధ్యాహ్నానిగ్గానీ వర్షం తెరిపివ్వదు. వాళ్ళు చెప్పినట్టుగానే, కొంచెం ఎంగిలిపడి, బయలుదేరతాడు. నెమ్మదిగా సెంటర్లో దిగబెడతాడు పాకలో మనిషి. అక్కడ పోయే సాధనాలేమీ ఉండవు. సన్నని దారి చూపిస్తూ, ఇలా పోడమేనంటాడు పాకలో మనిషి. ఎలా? అడుగుతాడు వెంకటేష్. "నడిచి" అంటాడు. అవునుకదా, కాళ్ళున్నాయిగా నడవడానికని గుర్తొస్తుంది వెంకటేష్‌కి.

కృతజ్ఞతగా రెండు వందలివ్వబోతాడు వెంకటేష్. ససేమిరా తీసుకోనంటాడు. "ఒద్దు బాబూ, తప్పు" అంటూ, "మనిషి సుఖంగా ఉన్నప్పుడు యాపారం చెయ్యొచ్చు బాబూ... కష్టంలో ఉన్నప్పుడు యాపారం చైకూడదు. రాత్రి మీరు కష్టంలో వచ్చారు. మీరు మడిసి...నేను మడిసిని...వానకి ముద్దైన పిట్ట చెట్టుమీద వాలబోతే చెట్టొద్దంటదా...యిదీ అంతే..." ఇంకా చెబుతూ, "రాత్రి ఉన్న పరిస్థితి అన్నారుకదా బాబూ! అలాంటి పరిస్థితిలో మడిసికి మడిసి సాయపడకపోతే ఇంకాణ్ణి మడిసనెలా అంటాం...యిలాగే నాలాంటి మడిసి నీ యింటి ముంగిట నిలిస్తే లోనికి రమ్మంటావా ...బయటగ్గెంటేస్తావా..." సూటిగా అడిగేసరికి నిరుత్తరుడవుతాడు వెంకటేష్. అతని భాషలో తానో మడిసి. అదే నాగరీకం నేర్చిన వెంకటేష్ దృష్టిలో 'అతడు మనిషి'.

కథంతా ఒకే సన్నివేశం, ఒకే వాతావరణం, ఒకే సందర్భం. మనిషి అంతరాంతరాళంలో మానవీయతను మేల్కొలిపే కథనంతో అక్షరాక్షరం, ఆ దిశగానే లక్ష్యాన్ని నిర్దేశించుకున్న రీతిలో కథనల్లారు ప్రభాకర్. ఇదే ఈ కథకు బలం. కళ్ళకు కట్టినట్టు కనబడే సన్నివేశ వర్ణనతో ఆకట్టుకుంటుంది కథనం. "మహోన్నతమైన మానవతావిలువల ముందు విశ్వవిద్యాలయాలు ప్రదానం చేసే పట్టాలు, ఆ విద్యను ఆధారం చేసుకుని నిండే జేబులు ఎలా వెలవెలబోతాయో రచయిత మనసుకు హత్తుకునేలా చెప్పిన కథ"ంటుంది ఎడిటోరియల్ లీడ్. సందర్భవశాత్తు జరిగే సంభాషణల్లోనే ఈ విలువలను ప్రతిపాదిస్తారు రచయిత. అంతేగాని, పనిబెట్టుకుని ఎక్కడా ఏకరువు పెట్టరు. అలాగని కథకుడు తన అభిప్రాయాలేమీ చెప్పలేదని కాదు. తనే సృష్టించిన వెంకటేష్ పాత్రలో సంలీనమవుతాడు కథకుడు.

దయతో, సానుభూతితో కూడిన ఉదారమైన నడవడిక లేదా మూర్తిమత్వం మానవత్వమంటే. మానవత్వమంటే ప్రేమ. మనిషి కదలికలో, ముద్రలో, ప్రాపంచిక దృక్పథంలో, ఎదురయ్యే పరిస్థితుల్లో –చుట్టూ ఉన్న అందరికోసం...ఇతరుల కోసం...మనిషి ఉనికీ మనికీ కోసమైన ప్రేమ. తోటి మనిషిపట్ల, సాటి మనిషిపట్ల ప్రేమ; అతనికోసం తన ఆలోచనల్లో కొంచెం చోటివ్వడం – అదే మానవత్వం. మానవత్వానికి సంబంధించిన ఈ అన్ని కోణాలనూ 'అతడు మనిషి'లో మనం చూస్తాం. కథకుడు ఎ. ప్రభాకర్, – 'అతడు మనిషి'

మానవత్వాన్ని మప్పేకంటే మించిన సామాజిక స్పృహ వేరే ఏముంటుంది? సాహిత్యం యొక్క పరమ ప్రయోజనం మనిషిని మనిషిగా మార్చేందుకు దోహదపడ్డమే.

మనుషుల్లో అనివార్యంగా పాదుగొనాల్సిన మానవత్వం పరిమళించే విధంగా మంచి కథను రాసిన ప్రభాకర్‌ను అభినందిద్దాం.

(22-02-2007)

కథకుడు : మాల్యశ్రీ
కథ : వర్ణచిత్రం
ప్రచురణ : కథాంజలి

## కాపీ కథలు ఎలా వస్తాయి?!

ఒక రచయిత రాసిందే వేరే రచయిత రాసే వీలుందా? విశ్వసాహిత్యంలో ఇలాంటి ఉదాహరణలెన్నో కనబడతాయి.

ఇద్దరు రచయితలు ఒకే పరిసరాలను, వ్యక్తులను, సందర్భాలను చూసి స్పందించి రాసిన రాతలు ఒకే విధంగా ఎందుకు ఉండవు? ఆ పరిసరాల్ని, వ్యక్తుల్ని, సందర్భాల్ని ఆయా రచయితలు తమ దృక్కోణంనుంచి దృక్పథంనుంచి తమ వైయక్తిక జీవనతాత్త్వికతల నేపథ్యంనుంచి చూస్తారు. అందువల్ల కథ ఇతివృత్తం ఒకటే అయినా, వర్ణనలు ఒకేలా సాగినా, ఒకదానికొకటి మక్కీకి మక్కీ కాపీ అనిపించినా... రాసే ఉద్దేశంలో మాత్రం కచ్చితంగా తేడా ఉంటుంది. ఆ విషయాన్ని చర్చించింది మాల్యశ్రీ కథ 'వర్ణచిత్రం', కథాంజలి మాసపత్రికలో ప్రచురింపబడింది.

17-5-2012న నాకందిన మాల్యశ్రీ కథాసంపుటి 'వెన్నెల మలుపులు-చీకటి వెలుగులు'లో ఈ కథ చదవడం తటస్థించింది. ఈ సంపుటిలో ప్రతి కథకీ ఒక ఎడిటోరియల్ లీడ్ ఇచ్చారు. అలాగే ఈ కథకీ- "కొండకోనల్లో, నదీతీరాల్లో, నిర్మలమైన ప్రకృతి సౌందర్యం తొణికిసలాడుతూ ఉంటుంది. ఆ ప్రకృతి సౌందర్యంలో ఒక అందమైన అమ్మాయి ప్రకృతి ఆరాధన చేస్తూంటుంది. భావుకులైన ఇద్దరు రచయితలు కాకతాళీయంగా సందర్శించి, తమ తమ కథల్లో కథానాయికగా చిత్రించుకొంటారు ఆమెని. అదొక అపూర్వ వర్ణచిత్రం. మరుపురాని మనోహర అజరామర అద్భుత చిత్రం. దాన్ని మనమూ దర్శించి అనుభూతిని చెందుదా"మంటుంది.

కథ ప్రారంభం ఒక వివాదంతో మొదలవుతుంది. ఓ పాఠకుడు రాసిన ఉత్తరం, సంపాదకుడి 'నోట్'తోపాటు కథారచయిత మహేంద్రకు అందుతుంది-"పాఠకుడు పేర్కొన్న విషయాలు వాస్తవాలని తెలుస్తోంది...దీనికి తగిన సంజాయిషీ...సంతృప్తికరమైన సమాధానం లభించనిచో మీ పేరు రచయితల 'బ్లాక్' లిస్టులో చేర్చబడుతుంది..." ఒక రచయితకు ఇంతకన్నా అవమానమేం ఉంటుంది? వెనక్కి తిప్పి చూస్తే, పాఠకుడు సంపాదకునికి రాసిన ఉత్తరం ఉంటుంది. "...ఈ వారం మీ 'కాదంబిని' పత్రికలో ప్రచురింపబడిన 'మహేంద్ర'గారి 'వర్ణచిత్రం' కథ ఇదివరలో 'ప్రమోద' అనే మాసపత్రికలో వెలువడిన విక్రాంత్ రచన 'వెన్నెల నృత్యం' అనే కథకు పూర్తి అనుకరణ...ఈ కథలోని ఇల్లు, పూలతోట, ఇతర వాతావరణం, ముఖ్యంగా కథానాయిక రూపలక్షణాలన్నీ 'వెన్నెల నృత్యం' కథలోలాగే వున్నాయి...ఆమె మాష్టారు కూతురే, ఈమే మాస్టారు కూతురే. వాళ్ళు నివసించే ప్రదేశం కూడ ఒకటే. అదే గోదావరి, అదే కొండప్రాంతం. ఈ 'వర్ణచిత్రం' కథ 'వెన్నెల నృత్యం' కథకు చాలావరకు కాపీ కథ అని నిస్సందేహంగా చెప్పవచ్చు..." ఇలా సాగుతుంది పాఠకుడు సునీల్ ఉత్తరం.

పరిపరి విధాల పోతాయి మహేంద్ర ఆలోచనలు. పాఠకుడూ, సంపాదకుడూ తననో కాపీరచయితగా భావిస్తున్నారని, సాహితీలోకంలో తన పరువేమిటని, సాటి రచయితల్లో తలెత్తుకుని ఎలా తిరగడం, పాఠకులకేమని సమాధానం చెప్పాలి... తల తీసేసినంత పనైందనుకుంటాడు, మహేంద్ర.

నాలుగైదు సంవత్సరాల క్రితం ఉద్యోగరీత్యా ఆ ఏజెన్సీ ఏరియాకి వెళ్తాడు కథకుడు మహేంద్ర. అటవీప్రాంతంలో గోదారొడ్డున ఉన్న గిరిజన గ్రామం. ఆ వాతావరణం, ఆ పరిసరాలు, ముఖ్యంగా మాస్టారిల్లు, ఆయన కూతురూ భావుకుడైన మహేంద్ర మనసుమీద గొప్ప ప్రభావం చూపుతాయి. మొక్కలు,లతలు, పూలమధ్య అస్పష్టంగా కదలాడే ఆకృతి...వెన్నెల్లో, ఉదయ తరణి లేత కిరణమో అన్నట్లు...క్రమంగా ఆకుల్లోంచి, కొమ్మల్లోంచి, పూవుల్లోంచి స్పష్టపడిన ఒక నాజూకైన, అందమైన యువతి. పేరు అశ్విని అనీ, పట్నంలో డిగ్రీ చదువుతోందనీ, ప్రకృతి ఆరాధన ముఖ్యమైన హాబీ అనీ..."శిశిరంలో తెల్లని సన్నని నాజూకైన, దొంతర దొంతర పూలతో నిలువెల్లా నిండి, పొడవుగా పోకుగా నాజూకులు పోయే పున్నాగవృక్షంలాగే ఆ అమ్మాయి కూడా" మహేంద్రకో ప్రకృతి దృశ్యమూ, మనోహరమైన కల. అంతే!

వేసవి సెలవుల అనంతరం ఆమె బి.ఇడి చదవడానికి ఎక్కడికో వెళ్ళిపోతుంది. ఇక శూన్యమైన జీవచైతన్యం నశించిన శుష్కదృశ్యమే అయింది రచయితకి మాస్టారిల్లు. ఆ శూన్యంలోంచి, ఆ నిస్సారంలోంచి, ఆ జీవచైతన్యరాహిత్యంలోంచి అశ్విని కథానాయికగా, కొంత కల్పనతో బయల్వెడలిన కథ వర్ణచిత్రం. కాల్పనికాంశం ఏమంటే, వేసవి సెలవుల్లో ఆమె వచ్చిన సమయంలోనే గిరిజన జీవనసంస్కృతుల్ని పరిశోధన చేయడం కోసం ఓ యువకుడైన పిజి స్టూడెంట్ రావడం, ఇద్దరికీ అయిన పరిచయం నెమ్మదిగా ప్రేమగా మారడం, కులాలు వేరవడంవల్ల మాస్టారు వ్యతిరేకించడం, ఇద్దరూ వేరుపడ్డం, ఎవరి చదువుల నిమిత్తం వాళ్లు వెళ్ళిపోడం... ఈ అంశాలన్నీ కథాగమనం కోసం కల్పించబడ్డాయి. ఆ గిరిజనగ్రామంలో అశ్వినిని చూసి ప్రేరేపించబడి స్వహస్తాలతో, స్వకపోల కల్పనలతో రాసిన స్వంత కథ కాపీకథెలా అవుతుంది? విస్మయం. ఆ విస్మయాన్నే నిజాయితీగా సంపాదకుడికో ఉత్తరంగారాసి పంపాడు మహేంద్ర. తరువాతి సంచికలో దాన్ని ప్రచురిస్తాడు సంపాదకుడు. తరువాత మరో రెండు వారాలు గడిచి, మూడోవారం ప్రతిలో మరో గొప్ప విస్మయం. మరో ఉత్తరం. ఆసక్తికరమైన ఆ ఉత్తరం కళ్ళని కట్టేసి దిగ్భ్రమలో ముంచేస్తుంది. ఆ ఉత్తరం విక్రాంత్‌నుంచి!

"కొన్ని పోలికలుండడం సహజమే...అంతమాత్రాన ఇవి ఒకదానికొకటి కాపీ కథలు కావు. మహేంద్రలానే, నేను కూడ ఆ తరువాత

ఆ ప్రదేశంలో కొంతకాలం నివసించి, ఆమెను పరిశీలించి, స్పందించి, నా కథ రాశాను...అందువల్లనే కథానాయిక పేరుతో సహా పరిసరాలూ ఒకటే కావడంతో, అంత దగ్గరి పోలికలు.., పాఠకుడు అపోహ పడ్డాడంటే ఆశ్చర్యం లే"దంటూ, ముడి విప్పుతాడు విక్రాంత్.

"వర్ణచిత్రంకథారచయిత అశ్వినియొక్క ప్రణయం, ప్రేమ వర్ణించి, ఆతర్వాత అది విఫలమై, చివరకు కొత్త ఆశలతో టీచర్ ట్రైనింగ్‌కు వెళ్ళడంతో కథ ముగుస్తుంది. నా కథ అశ్విని టీచర్ ట్రైనింగ్ ప్యాసై, స్వంత ఊళ్ళోనే ఉపాధ్యాయినిగా ప్రవేశించడంతో ప్రారంభించి, ఆ తర్వాత అక్కడికి కొత్తగా వచ్చిన సహోపాధ్యాయునితో ఆకర్షింపబడి, తాను కూడా అతని ఆకర్షణకు గురై ప్రేమించి, పెళ్ళాడి... ఇలా సాగుతుంది", సమస్య తేలిపోతుంది, విక్రాంత్ ఉత్తరంతో.

రెండు కథల్లోనూ తేడాలేమైనా ఉన్నాయా అంటే – ముఖ్యమైంది కాలవ్యత్యాసం. మహేంద్రకి అశ్విని డిగ్రీ చేస్తున్న కన్యగానే తెలుసు. విక్రాంత్‌కు ఉపాధ్యాయునిగా పనిచేస్తున్న అశ్విని మాత్రమే తెలుసు. పాఠకులూ చాల తెలివైనవారు. సునీల్ ఈ విషయాన్ని గమనిస్తాడు. "...ఆ కథలో నాయిక చీరలు ధరిస్తే, మహేంద్రగారి కథానాయిక వోణీలు ధరిస్తుంది. విక్రాంత్‌గారి హీరోయిన్ టీచరుగా అక్కడ పనిచేస్తుంటే, వీరి హీరోయిన్ కాలేజీ స్టూడెంటుగా వుంటుంది. అంతకు మినహాయించి ఈ రెండు కథల్లోని కథానాయికలు రూపురేఖల్లోనూ, అభిరుచుల్లోనూ ఒకే రకంగా వుంటా"రంటాడు. బహుశా ఇపుడు సునీల్‌కి ఏ అభ్యంతరాలూ లేకపోవచ్చనుకుంటా!

కాపీ కథలు ఎంత మక్కికి మక్కీగా ఉన్నా, రచయితల సంస్కారం బట్టి, జీవితానుభవాలను బట్టి, జీవన తాత్త్వికలనుబట్టి సూక్ష్మంగానైనా విభేదిస్తాయని ఈ కథలో నిరూపించారు కథకులు మాల్యశ్రీ. ఆ విభేదించే అంశమే ఆత్మికాంశం. రచయిత ఆత్మగతమైన దృక్పథం – తనపట్ల, మనిషిపట్ల, జీవితంపట్ల, ప్రపంచం పట్ల... ఈ ఆత్మికముద్ర మాత్రమే కాపీలనిపించిన కథలను వేరుపరచే అంశం. దాన్ని పట్టాలి...పసిగట్టాలి. అప్పుడు సృష్టిలోని వైవిధ్యం అర్థమవుతుంది; హృదయం తేలికపడుతుంది.

(మువ్వలు, 29.5.2012)

కథకుడు : డా॥ శిరీష
కథ : పిఠాపురం రోడ్డు
ప్రచురణ : డైరెక్ట్ కథానికాసంకలనం
**2016**

# కాలిక స్థాలిక సంకేతం 'పిఠాపురం రోడ్డు'

సంకేతం! స్థాలికం కావడమంటే, ఒక దృశ్యాన్నో, సమావేశాన్నో, సమాగమాన్నో, సంఘటన్నో, సందర్భాన్నో... త్రిలోకాల్లో ఎక్కడైనా ఇమిడిపోయే ఒక ప్రాదేశిక ఉనికి.

అదే కాలికం కావడమంటే, ఒక దృశ్యమో, సమావేశమో, సమాగమమో, సంఘటనో, సందర్భమో ... త్రికాలాల్లో ఎప్పుడైనా ఇమిడిపోయే ఒక సమయపు అస్తిత్వం. అదే కాలస్పృహ.

స్థాలికమైన, కాలికమైన సంకేతాన్ని సార్వజనీనం చేయడం ఉత్తమ సాహిత్య లక్షణం అవుతుంది. 'పిఠాపురం రోడ్డు' కథలో ఈ పని చేశారు, డా॥ శిరీష. కథానిక-2016, డైరెక్ట్ కథానికా సంకలనంలో వచ్చిన కథ ఇది.

కథలోని సంకేత స్థలం పిఠాపురం రోడ్డు. సంకేత కాలం వర్తమానంలోని ఏదైనా ఒక సాదాసీదా రోజు. వెరసి, అతి సాధారణమైన ప్రజాజీవితం కనబడే స్థల-కాల సంగమం.

పిఠాపురం రోడ్డులోని ఒక జంక్షనులో ఈ సంగమ ఆరంభ సంరంభం మొదలవుతుంది. అదే, "ఎవరిగోల వారిదైన కాకినాడలోని ఆ జంక్షన్‌లోని జనాన్ని చూస్తే ఇంతమంది రోజూ ఎక్కడికెళ్తున్నారా, జిల్లా జనాభా ఇక్కడే ఉన్నారా అన్న ఆలోచన అలుముకుంటుంది." అదీ, అలజడై! అది పిఠాపురం పోయే బస్సుకోసం ఎదురు చూసే ప్రయాణీకులతో ఎప్పుడూ రద్దీగా ఉండే, పిఠాపురం పోయే బస్సు వచ్చి ఆగే జంక్షన్.

ఈ జంక్షన్ నుంచి మొదలుపెట్టి, పిఠాపురం వెళ్ళే సుమారు ఓ అరగంట ప్రయాణమే ఈ కథ ఇతివృత్తం. బస్సు ఎక్కేవారిలో, ఎక్కిన వారిలో రకరకాల స్వభావాలు గల మనుషులు – స్త్రీలు, పురుషులు, పిల్లలు, పెద్దలు, యువకులు, ముసలాళ్ళు... భిన్నత్వానికి అస్తిత్వమైన భారతదేశానికి సంకేతంగా పిఠాపురం బస్సు తోస్తుంది. భిన్నత్వంలో ఏకత్వమే ఉనికిగా కాపాడుకుంటున్న భారతజాతి విశ్వరూపం రామనాథం రూపంలో కనబడుతుంది.

పెనం మీద అట్టులా వేసే వేసవిని, వేదనల్ని రోదనల్ని సాధనల్ని వేడుకల్ని సమన్వయం చేసుకున్న మనస్సు, స్థితప్రజ్ఞత రామనాథం ప్రత్యేకత. తనకెందుకులే అని ఊరుకోక, నేటి తరం పోకడలకు సక్రమమార్గం చూపించడానికి విశ్వప్రయత్నం చేస్తుంటారు.

ఒకప్పుడు జట్కాలూ, రిక్షాలూ ఎక్కువున్న ఆ జంక్షన్ రూటు, ఇప్పుడు ఆటోలకు పెద్ద సెంటరైంది. ఆ జంక్షన్‌లో కొందరి చేతుల్లోంచి వింత ధ్వనుల, వికటాట్టహాసాల సెల్ ధ్వనులు...కవ్వించే, కెవ్వుమనిపించే హోర్డింగులు... వింటూ, చూసుకుంటూ సాగే ప్రయాణం!

నిండు కుండలాంటి గర్భిణీస్త్రీ, సృష్టికి ప్రతిసృష్టి చేసే ప్రకృతి సంపూర్ణ స్వరూపంలా! ఎక్కడానికి నానా తంటాలు పడి బస్సు ఎక్కుద్ది, భర్తతో. సీటు ఉండదామెకు. ఆడవాళ్ళు కూడా ఎవరూ ఖాళీ చేసి ఆమెకు సీటివ్వరు. చూస్తూ కూర్చోలేని రామనాథం, "...తల్లిలాంటిది, తల్లి కాబోతుంది. నిలబడలేకుండా వుందం..."టూ లేచి సీటివ్వబోతుంటే, "మీరు పెద్దవారు, ఆమె కూర్చుంటుం"దంటూ ఓ కాలేజీ కుర్రాడు లేస్తాడు. ఆమె కూర్చుంటుంది. "ఎంతయినా మనుషులం. ఎన్ని అంతరాలు, అంతస్తులు, ఎన్నివ్యత్యాసాలు వున్నా అంతరంగపుటట్టడుగు పొరల్లో మనందరం మానవులం", ఆ క్షణంలో రామనాథం అంతరంగం ఆలోచనని కథకుడు వివరిస్తాడు.

ఆమెకు వెనుకసీట్లో కూర్చున్న స్కూల్ టీచర్ ఆమెను ఇంటరెస్టింగా చూస్తుంటుంది. ఆమె పక్కసీట్లో కూర్చున్న కాలేజీ అమ్మాయి తప్పు చేసినదానిలా ఫీలవుతుంది. బస్సు ఎ.పి.ఎస్.పి స్టాపు చేరేసరికి ఆమె బాధను ఆపుకోలేక సతమతమవుతుంటుంది. రామనాథం సూచనతో టీచర్, కాలేజీ అమ్మాయిలు చోట్లు మార్చుకుంటారు. టీచర్ ఆమెను పొదివిపట్టుకుని, తన వాటర్ బాటిల్లోంచి ఒక అరగ్లాసుడు మంచినీళ్ళు తాగిస్తుంది. భాషకందని ఒక దయార్ద్ర కృతజ్ఞతాభావం ఆమె నీళ్ళునిండిన కళ్ళలో! "ఇంకెంత, 20 నిమిషాలు, ఓర్చుకోమ్మా", టీచరంటుంది అనునయంగా.

తిమ్మాపురంలో ఓ అరడజనుమంది ఎక్కుతారు. అబ్బా, అనుకున్నట్టే చిత్రాడ రైల్వేగేటు పడిపోయింది. పిఠాపురం పోయే బస్సులకు పెద్ద ఆటంకం. ఏ బస్సైనా, ఏ సమయంలోనైనా ఈ ఆటంకాన్ని ఎదుర్కోవలసిందే. ఎంతలేదన్నా, ఓ పావుగంటా, ఇరవై నిమిషాలు. ఓ అరడజనుమంది పన్నెండేళ్ళలోపు కుర్రాళ్ళు సోడాలై, జామపళ్ళై, మొక్కజొన్న కండెలై, మసాలా వడలై బొంగరాలై తిరిగారు ఆ పావుగంటా. ఈ పావుగంటలోను ఎన్నెన్ని మనస్తత్వాలో గిరజాల జుట్టు, చెవిపోగులు, నుదటన నామం, లాల్చి, పంచె, కండువా, నోట్లో చుట్ట ఎన్నెన్నో గొంతు విప్పుతాయి. "ఈళ్ళు దొంగెదవలండీ. నిమ్ముప్పు, కుళ్ళిపోయిన నాలుగు నిమ్మకాయలు, డ్రమ్ముగనీళ్ళలో కలిపేసి, సోడాలు పట్టేసి, రూపాయికి అమ్మేస్తున్నారు"–చిన్న ఉపన్యాసమిస్తాడు, అప్పుడప్పుడే ఎదుగుతున్న రాజకీయ నాయకు డొకడు. ఇంకా చాలరకాల అభియోగాలు వినిపిస్తాడు. తోడు గిరజాల జుట్టువాడు. వాడికొచ్చే లాభమెంతో రామనాథం లెక్కలుగట్టి వినిపిస్తాడు – నిలబడి, పరుగులెడుతూ, ఎండలో అంగలార్చుకుంటూ ఉదయంనుంచి సాయంత్రం వరకు శ్రమిస్తే దొరికేది ఓ పదిహేను నుంచి ఇరవై రూపాయలు మాత్రం. నెమ్మదిగా ఎన్నో కబ్బాలు, కుంభకోణాలు ప్రయాణీకుల సంభాషణలో వెలుగు చూస్తాయి.

ఇంతలో మరో ఆటంకం. రైలుగేటు దాటాకా బస్సు సడెన్‌గా ఆగి కదలనని మొరాయిస్తుంది. బస్సు తోయాలన్నాడు డ్రైవర్. విద్యార్థి, ప్రభుత్వోద్యోగి, ఎదుగుతున్న రాజకీయనాయకుడు, గిరజాల జుట్టోడు, గర్భిణీ స్త్రీ భర్త మరో ఇద్దరు దిగారు. రామనాథం దిగబోతుంటే, "మేం లేమా, మీరు కూర్చోండిసార్" వారించారు, గిరజాల జుట్టువాడూ,

రాజకీయ నాయకుడూ. అయినా ఆయన దిగుతాడు, "తొయ్యలేకపోయినా, కనీసం మీకు భారం కాకుడదు కదా!" అంటూ. ఈ విధంగా సాంఘిక జీవనానికి, సహజీవన చైతన్యానికి, ప్రగతి పథానికి సంకేతమైన బస్సు పదిరకాల ప్రజల భుజబల సంఘటిత శక్తితో జడత్వాన్ని వదిలి ముందుకు కదులుతుంది. రాష్ట్రాలూ, జిల్లాలు, నగరాలూ, పట్టణాలూ, పల్లెలూ, జంక్షన్లూ, సెంటర్లూ – వేటికవే చిన్నచిన్న బుల్లిబుల్లి భారతదేశాలు. అన్నిటికీ కలిపి అఖండ భారతావనికి పెద్ద సవాలుగా ఎన్నో ఎన్నెన్నో సమస్యలు, సంఘర్షణలు. చిన్నచిన్న బుల్లిబుల్లి భారతదేశాలు ఎక్కడికక్కడ ఆ సమస్యల్ని సంఘర్షణల్ని పరిష్కరించుకుంటూ పోవాలి.

కథకుడు ఎక్కడా భారతదేశం అన్న పదాన్ని ఉపయోగించలేదు. కానీ భారతాఖండ భావం పాఠకుడి మదిలో మెదులుతుంది. ప్రస్తుతం మన బుల్లిభారతం సమస్య గర్భిణీస్త్రీ. ఆమె భర్త అస్థిమితంగా ఆమెవంకే చూస్తున్నాడు. ఆమె తన కారణంగానే ఆ బాధ అనుభవిస్తుందనిపించింది. ఆమె చెల్లెలు ఆసుపత్రిలో తోడుంటానందని, కాకినాడ వదిలేసి పిఠాపురం తీసుకొస్తున్నాడు. వెళ్ళేలోపు ఏమౌతుందో?!

చీకటి ఛాయలు ముసురుకున్నా, బస్సులో లైట్లు గుప్పుమని వెలిగాయి. "ఏదైనా హాస్పిటల్‌కి తీసుకెళ్ళు బాబూ!", రామనాథం అభ్యర్థించాడు.

"గవర్నమెంటాస్పిటల్లో మామూలుగానే చూడరు, ఈ రాత్రెవడు పట్టించుకుంటాడు"...

"పట్టించుకోపోతే, ప్రసవం రేపటివరకూ ఆగుద్దా?"...

"ఏ చిన్నప్రభుత్వ ప్రయివేట్ ప్రైమరీ హెల్త్ సెంటర్లలోనైనా సాయంత్రం డాక్టర్లుంటారా!"...

భిన్నాభిప్రాయాలు వింటూ, గర్భిణీ స్త్రీ భర్త చాల భయపడిపోతాడు. రామనాథం రెండు చేతులూ పట్టుకుంటాడు.

"డాక్టర్ లేకపోయినా, నర్సో, ఆయాయో ఉంటారుకదా, ప్రభుత్వాసుపత్రయితే దారిలో దగ్గర్లో ఉంది. అక్కడికే తీసుకుపోండి బస్సును"–

భిన్నాభిప్రాయాలన్నీ ఒకే అభిప్రాయానికొచ్చాయి.

"మాష్టారూ, బస్సు గవర్నమెంట్ హాస్పటల్ దగ్గర ఆపమంటారా?"– కండక్టర్.

"నువ్వేం కంగారుపడవద్దయ్యా, మేం లేమూ!"– రాజకీయ నాయకుడు.

"అమ్మాయి సుఖంగా ప్రసవిస్తుంది. గాబరా పడమాక. మేమంతా లేమా ఏంటి?" – గిరజాల జుట్టు.

"నేను ముందెళ్ళి డ్యూటీలో ఎవరున్నారో చూసి, స్ట్రెచర్‌గాని వీల్‌ఛైర్ గానీ తీసుకొస్తాను" – విద్యార్థి.

రామనాథానికెంతో సంతోషం వేసింది. తన వయస్సు మర్చిపోయాడు. ఇందరు సహకరిస్తే చేయవలసిన పని ఎంత కష్టమైతే మాత్రం ఏమిటి? ఇందరి మంచిమనసుల కలయిక ఒక శుభానికి ఆరంభం కాదూ!

ఇంకా ఎన్నెన్నో ఆటంకాలొచ్చినా, అందరూ సమిష్టిగా వాటిని అధిగమించి చివరికి ఆమెకు సుఖప్రసవం అయ్యే ఏర్పాట్లన్నీ చేస్తారు. సంతృప్తిగా బస్సు ఎక్కుతారు.

రోజూ ప్రయాణించే బస్సేనా?! విద్యార్థి, ప్రభుత్వోద్యోగి, మునిసిపల్ టీచర్, విద్యార్థిని, గిరజాలమోతుబరి, ఎదుగుతున్న రాజకీయనాయకుడు...అందరూ సంతృప్తిగా అక్కడ బస్సులో, ఆ బు..ల్లి భారతదేశంలో!

ఒక్క విషయం గమనించాలి, బస్సులో కూర్చున్నవారిలో, ఆమె సుఖప్రసవానికి దోహదపడినవారిలో ఒక్క పేరుమోసిన, బడారాజకీయనాయకుడూ లేకపోవడం శోచనీయమే కాదు, కాదనలేని సత్యం.

ప్రతీక శిల్పంతో వ్యంజనాత్మకంగా కథ అల్లిన శిరీషకు అభినందనలు.

కథకుడు : విహారి
కథలు : పోల్చుకోగల రాతే!
చెరలాట
ప్రచురణ : ఆదివారం ఆంధ్రభూమి
10 మే 2009
ఆంధ్రభూమి సచిత్రవార పత్రిక
10-12-2009

## బతుకు పుస్తకాల్లో అధ్యాయాలు నింపేది 'ఆర్థికాంశ' కలమే!!

సమాజ గ్రంథాలయంలో పరిశీలిస్తే, ఎన్నో రకాలైన బతుకు పుస్తకాలు కనబడతాయి. ఈ బతుకు పుస్తకాల్లో ఎన్నెన్నో భేదాలు, విభేదాలు. లింగం, వయసు, మనస్తత్వం, అనుభవం మొదలైనవెన్నో భేదవిభేదాల్ని కలిగించే అంశాలు. అయితే జాగ్రత్తగా పరిశీలిస్తే, ఈ అంశాలన్నిటినీ మించిన అంశం ఒకటి కనిపిస్తుంది. లింగమేదైనా, వయసెంతైనా, ఏ మనస్తత్వమైనా, అనుభవమున్నా, లేకున్నా, ప్రతి బతుకు పుస్తకానికీ ఏకసూత్రత కలిగించే అంశం అది.

బతుకు పుస్తకం లిఖించే కలంలో డబ్బుసిరా బాగా ఉంటే, అధ్యాయాలన్నీ ఆనందంగా రొమాంటిక్‌గా సాగుతాయి. ఇంకింకిపోతే అప్పుడు ప్రారంభమవుతాయి అధ్యాయాల్లో కొట్టివేతల తిట్టివేతల తీసివేతలు. బ్రతుకు కథలు అవుతాయి చితుకు వ్యథలు.

అటువంటి రెండు బతుకు పుస్తకాల్ని

రెండు కథలుగా అందించారు, 'విహారి', జె.యస్. మూర్తి. సామాజిక 'స్పృహ'తో 'గోరంత దీపం' వెలిగించి, ఆ వెలుగులో 'గుండెలో కోయిల'ల్ని కథల 'అక్షరం'గా మలచి, 'అమ్మపేరు చీకటి'గా పేరుకుంటూ, 'బొంగరం'లా గతిశీలకమైన నడకతో 'కొత్తనీరు'లా ప్రవహిస్తూనే ఉన్న కథనశిల్పి విహారి.

'పోల్చుకోగల రాతే' అన్నది రెంటిలోను ఒక కథ. ఈ కథలోని బతుకు పుస్తకం రిటైరై చరమాంకానికి చేరిన పులింగం. ఆదివారం ఆంధ్రభూమిలో 10 మే 2009న వచ్చింది.

రిటైరైన ఓ ముసలి తండ్రి ముఖ్యపాత్ర. తన కథని తానే ప్రథమ పురుషలో చెప్పుకునే ఈ పాత్రకి పేరే లేదు. కథలో ముఖ్యపాత్రే అయినా, పేరే లేకుండా చేయడం, అతని బతుకుపుస్తకంలో అతనే 'అప్రాధాన్యత' అయిపోడాన్ని చెప్పకనే చెబుతుంది. కథకుడి చాతుర్యం ఈ చిన్న విషయంలోనే ఎంతో బాగా అర్థమవుతుంది. అనామకుడి బతుకు పుస్తకంలోని వేరే పాత్రలు – మనవరాలు ఉషారాణి, కోడలు వనజ, కొడుకు చంద్రం, మనవడు ప్రభాకర్ – అందరూ తమతమ అవసరాల కోసం డబ్బులు అడుగుతూనే ఉంటారు. చాలా కొద్దిమొత్తాన్ని పాకెట్ మనీగా ఉంచుకుని, పెన్షన్ రాగానే డబ్బంతనీ కొడుక్కి ఇస్తుంటాడు, అనామకుడు. అందరికీ తెలిసిన విషయమే ఇది. అయినా అడుగుతూనే ఉంటారు.

"లోన్ ఈఎమ్మైకి నోటీసొచ్చిందివాళ", అంటాడు కొడుకు. "అదేమిట్రా పెన్షన్ మొత్తం తీసుకురాగానే వారం క్రితమే ఇచ్చేశానుగా!" అని ఎలాగో నోరు పెగుల్చుకుని చెబితే, "మీ లోన్ కోసమే"నంటాడు. పైగా, తన కొడుకుతో ఎద్దేవాగా, "నా నెత్తిన బండపెట్టి వినోదం చూస్తున్నాడ్రా మీ తాత" అంటాడు. నిజానికి ఆ లోను ఎవరికోసం తీసుకున్నది? కొడుకూ, కోడలూ ఒకటై, వచ్చే జీతం అద్దెకే పోతోందని ఏడ్చి మొత్తుకుని సొంతిల్లు ఏర్పరచుకోవాలని తనతో చేయించిన అప్పు. అది కాస్తా తన లోనైపోయింది. మనవరాలు పాకెట్ మనీకోసం, మనవడు స్నేహితులతో ఎంజాయ్ చేయబోయే పార్టీకి భాగస్వామ్యం కోసం తాతనే అడుగుతారు. "నా ఖర్చుల కోసం ఉంచుకున్న డబ్బులు కూడా అయిపోయినైరా ఈ సారీ" అని వాళ్ళకి జవాబివ్వాల్సిన పరిస్థితి. ఆ పరిస్థితి కల్పించేదెవరు? వాళ్ళే కదా!

ఈ కథలోని శిల్ప చమత్కారాంశాలు కథకుడిగా విహారి

'పోల్చుకోగల రాత'ను పట్టిస్తాయి. బతుకు పుస్తకాన్ని వర్ణించే వర్ణనలు, ప్రతీకలన్నీ అచ్చు ప్రక్రియపరంగా ఉండడం కాకతాళీయం కానేకాదు. కథకుడు కావాలని చేసిన శిల్ప విన్యాసమే.

యావన్మంది అవసరాల తీర్చబడని అశక్తతలని "తప్పుల పట్టికల్ని మాత్రమే అచ్చొత్తుతున్న వైనం" అని ఒక్క వాక్యంలో వివరిస్తారు కథకుడు. ఎర్రేటా పట్టికని పుస్తకం చివర్లో కూరుస్తారు. అంటే, బతుకుపుస్తకంలోని ఈ పాత్ర జీవితపు చరమాంకంలో ఉన్న విషయం అర్థమవుతుంది. ఇలాంటిదే ఇమేజరీ అంతా కథనిండా. తనకిష్టం లేని సంబంధాన్ని భార్య ప్రోద్బలంతో ఖాయం చేసుకుని కూతురు రమ్య పెళ్ళి చేసిన తరుణంలో అనామకుడి పాత్ర అనుకునే మాట– "నేను మార్జిన్ ఎక్కువైన పేజీలా ఉండిపోయాను"అని.

ఏ బతుకుపుస్తకంలోనైనా భార్యాభర్తలు మనసా వాచా కర్మణా ఒకటిగా ఉంటే వాళ్ళనెవరూ ఎదిరించలేరు. ఏమీ అనలేరు. కానీ చాలా సంసారాల్లో బొత్తిగా లేనిదీ సంస్కారమే. ఇదే కూతుళ్ళ, కొడుకుల, కోడళ్ళ, అల్లుళ్ళ, ఆఖరికి మనవలు, మనవరాళ్ళ అదుపులేని కామెంట్లకీ, ఈసడింపులకీ ప్రాణం పోస్తుంది. 'కొత్త ప్రకరణం మొదట్లోనే', "ఇవన్నీ మీకెందుకులెండి, నే జూసుకుంటాగా" అని ఫుట్‌నోట్ కింద ఉంచేస్తుంది అనామకుణ్ణి అతని భార్య పరిమళ. కులంకాని అమ్మాయిని పెళ్ళి చేసుకుని కొడుకు వస్తే, నాలుగ్గంటలదాకా నెత్తీనోరు కొట్టుకొని కన్నీళ్ళ పర్యంతమైన పరిమళ, తర్వాత ఎంతో బిజీ అయిపోయి చాలా హడావిడి చేసి రాత్రికి కొడుకునీ, కోడల్నీ పడకింట్లోకి పంపి, వసారాలో ఓ నవారు మంచాన్ని కేటాయించినప్పుడే అనామకుడి బతుకుపుస్తకంలో మరో కొత్త అధ్యాయానికి 'ఎత్తుగడ' సమకూరుతుంది. ఆ కొత్త అధ్యాయమే అందరి నిరసన. తల్లిగా ఆమె చేసింది తప్పో, ఒప్పో అటుంచితే, భార్యగా అనామకుడికి, అతని అభిప్రాయాన్ని బలపరచటానికి తోడ్పడి ఉంటే, కథ మరోలా ఉండేదే!

ఎంత విభేదించినా, భర్తకి భార్య... భార్యకి భర్తే – ఒకర్నొకరు భరించుకునేవారు. కూతురు దిగులుతో తన ఆకారాన్నీ, ఆరోగ్యాన్ని చెడ గొట్టుకుని అర్థంతరంగా భార్య వదిలిపోతే, శిథిలమైన బొమ్మలా అనామకుడు, "ఏ పంక్తికీ, ఏ పదానికీ, ఏ అక్షరానికీ పొంతన లేకుండా పోయి"–ఇదీ శిల్పం – పొడవునా పుస్తకం, దాని ముద్రణపరంగా సాగే

కథనం. చివరికి "గ్యాప్‌లు గ్యాప్‌లుగా పేజీల్లో పంక్తులు. ఎలైన్‌మెంటు చెడిపోయి అచ్చయి బయటికి వచ్చిన పేజీలా" తన మొహం తనకే అసహ్యా మనిపించే భావనలో ఉండగా–

"పుస్తకంలో కవితాపుట తెరుచుకున్న" వైనం. విసిగిపోయి, పోయి చెడతిరిగి బయటినుంచి రాగానే కోడలు నవ్వుమొహంతో మంచినీళ్ళ గ్లాసై ఎదురొస్తుంది. "మమ్మల్నందర్నీ ఇలా సస్పెన్స్‌లో పెట్టి ఎటో వెళ్తే ఎట్టా తాతయ్యా?" అంటూ ప్రేమతో మనవరాలి మందలింపు. "నాతో చెప్తే నేనూ వచ్చేవాణ్ణిగా తాతయ్యా తోడుగా" అన్న మనవడి పలకరింపు. నలుగురి ఆప్యాయతా వచనాలు కలిసి మరింతగా రుచికరం చేసిన రాత్రి టిఫెన్ రెండిడ్లీలూ తిని తీరిగ్గా హాల్లోకి చేరిన సమయంలో తెలుస్తుంది అసలు విషయం. "ఇవ్వాళ ఎల్.ఐ.సీ నుంచీ కాగితాలొచ్చినై నాన్నా. మీరేదో హోల్‌లైఫ్ పాలసీ తీసుకున్నారట. వయసు ఎనభై ఏళ్ళు రాగానే డబ్బు ఇచ్చేస్తారట...లక్షాపాతిక వేలొస్తుందట బోనస్‌లతో కలిపి."

అనామకుడి బతుకుపుస్తకంలో హఠాత్తుగా అతని పాత్రకి ప్రాధాన్యత వస్తుంది. కాదు, తెస్తుంది మెచూరైన ఎల్లైసీ పాలసీ. పాత్ర ప్రాధాన్యతకీ, పేజీలోని అక్షరాల శక్తికీ కీలకాంశం మరింత స్పష్టంగా బోధపడుతుంది.

'చెరలాట' మరో చిన్న బతుకుపుస్తకం కథ. ఈ బతుకుపుస్తకం జీవితంలోని మొదటి పాతికోవంతుని పూర్తి చేసుకుని, ఆ కొద్ది జీవితంలోనే నిండు నూరేళ్ళ అనుభవాన్ని పొందిన స్త్రీలింగం. ఆంధ్రభూమి సచిత్ర వారపత్రికలో (10.12.2009) వచ్చింది కథ. తమిళంలోకి వెంటనే అనువాదమైంది.

ఇరవై ఆరేళ్ళ వసంత భర్త చనిపోయి పుట్టింటికి చేరుతుంది. పద్దెనిమిదేళ్ళప్పుడు మాయమాటలతో ఆమె వివాహం జరిగేనాటికి భర్త ప్రసాదరావు వెలగబెట్టింది డిగ్రీ ఫస్టియర్ మాత్రమే. ఉద్యోగం లేదు. పెళ్ళాన్ని పుట్టింట్లో దించి బలాదూర్‌గా గడపడమే అతని పని. ఏడేళ్ళ ఈ జీవితం తర్వాత ఎయిడ్స్‌తో భర్త మరణించాకా, వసంత జీవితం పెద్ద చర్చనీయాంశమవుతుంది.

"ఇప్పుడున్న పరిస్థితుల్లో ఏదో ఓ వ్యాపకం కావాలి దానికి" అనే నిర్ణయంతో విజయవాడలో ఓ పేథలాజికల్ లాబ్‌లో రిసెప్షనిస్టుగా చేరుస్తాడు చిన్నన్నయ్య సూర్యం. ఒక్క దెబ్బకి మూడు పిట్టలు. గుంటూరు

నుంచి వసంత విజయవాడ చేరుతుంది. వసంతతో పాటు తోడుగా, తల్లిదండ్రులిద్దరూ ఎవరి దారి వాళ్ళు చూసుకోవచ్చు. అన్నయ్య, వదినల ప్రణాళిక తెలిసుండీ పావు అవుతుంది వసంత. లాబ్‌లో ఎకౌంటెంటు కిషోర్ పరిచయం స్నేహమై, స్నేహం అభిమానమై, అభిమానం ఆరాధనై, ఒకరి కష్టసుఖాలొకరికి చెప్పుకునేంత దగ్గరితనమవుతుంది. చివరికి కిషోర్ నుంచి ఒక షరతుతో కూడిన మారేజి ప్రపోజల్ అవుతుంది. షరతేమిటంటే, తన అమ్మకి (కాబోయే అత్తగారికి) ఇంటి పట్టున ఉండే పిల్ల కోడలుగా రా(కా)వాలన్నది. అయితే, తర్వాత తెలిసే విషయమేమిటంటే, ఆమెకి పక్షవాతం. ఏడాదినుంచీ మంచం బతుకే. అందుకే ఇంటిపట్టున ఉండాలనడం!

విధవరాలైన కూతుర్ని ఎవరైనా కోరి పెళ్ళి చేసుకుంటానంటే, తల్లిదండ్రులు ఎగిరి గంతెయ్యాలి. అయితే వసంత తల్లి కిషోర్ ప్రపోజల్స్ గురించి తెలియగానే అంటుంది – "ఏమోనమ్మా! నీ విషయమంతా తెలుసునంటివి. అయినా పెళ్ళి చేసుకోవటానికిలా ముందుకు రావడం బాగానే వుందికానీ, కొంత నిదానంగా ఆలోచించుకో. మేడిపండు లోకం." ఎంతో ప్రేమతో అన్నట్టున్న ఈ మాటలతో తల్లిదండ్రులు కూడ ఈ లోకంలో మేడిపండులేనన్న విషయాన్ని నిరూపిస్తుందామె. "దాని మంచో చెడో తర్వాతగానీ, ముందు మనిద్దరి గతేమిటో ఆలోచించుకోవాలిగా" అనుకునే ముసలి దంపతుల ఆలోచనతో.

అత్తమామల ఇంట్లో ఉద్యోగం లేకపోడం పెద్ద లోపమైతే, అన్నా వదినలకు భారమై ఉద్యోగం చేయాల్సిరావటం, ప్రస్తుతం తనకున్న చిన్నపాటి ఉద్యోగం కూడా మానేయాలనే షరతు. తన జీవితపు భవిష్యత్తు నిర్ణయం ఎవరిది? వీళ్ళందరిదీనా? తనది కాదా!

కిషోర్ షరతు మినహాయిస్తే, తక్కిన రెండు సందర్భాల్లోను వసంత జీవితాన్ని, భవితని నిర్ణయించింది ఆర్థికాంశమే. ఆఖరికి కడుపులో పెట్టుకుని చూసుకోవాల్సిన తల్లే, ఆ ముసలితనంలో దంపతుల భరోసా కోసం కూతురు పెళ్ళి మానుకునే నిర్ణయం తీసుకునేలా సూచనిస్తుంది.

కిషోర్ ఇంటికి వెళ్ళినా, పక్షవాతంతో మంచం మీదున్న అతని తల్లిని చూసి తల దిమ్మెక్కిన వసంత క్షణంలో సగం సేపు ఏదో తెలియని భావోద్వేగానికి లోనైనా, కళ్ళు విచ్చి ఆ ఇద్దర్నీ చూస్తూ లేచి నిలబడింది – "తన కాళ్ళమీద తానే నిలబడింది వసంత". ఈ ముగింపే ఆమె జీవితంలో

వసంతోదయం.

మంచి శైలితో ఆపకుండా చదివించుకునే వస్త్వైక్యత గల ఈ రెండు కథల్లోనూ కథకుడు ప్రతిపాదించిన ఏకసూత్రాంశం ఒకటుంది. అదే ఆర్థికాంశం. 'ఆర్థికాంశ' కలమే బతుకుపుస్తకాల్లోని అధ్యాయాలు రాస్తుంది. రాసిన దానిని అవసరమైతే నిర్మొహమాటంగా కొట్టి పారేస్తుంది. తిరగరాస్తుంది. తిరిగి తిరిగి తిప్పి తిప్పి రాస్తూనే ఉంటుంది. కలంలో సిరా అయ్యేంతవరకూ! సిరా ఏమిటన్నది అర్థం కానిదేమీ లేదు. అదే డబ్బు. డబ్బుగబ్బు.

బ్రతుకు పుస్తకాల్లో అధ్యాయాలు నింపేది 'ఆర్థికాంశ' కలమేనన్నది ఈ రెండు కథల సారాంశం. 2009లో వచ్చిన విహారి మంచి కథలు.

(చినుకు మాసపత్రిక, జూలై 2010)

---

'పోల్చుకోగల రాతే'లో ప్రధానపాత్ర తన బతుకు పుస్తకాన్ని తానే విప్పుకున్న వైనాన్ని , కథనంలో పుస్తకంలో పేజీల్ని ప్రతీకాత్మకంగా, సమాంతరంగా– ఆ పాత్ర బతుకులోని సంఘటనలతో మేళవించటం, కథానిర్మాణ పద్ధతి నచ్చి ... మాకినీడి సూర్యభాస్కర్ అభినందించారు. ...

ఈ సంపుటిలోని (ప్రాప్తం, విహారి కథలు) రెండు కథలమీద తమ విశేషమైన విశ్లేషణని ముందు మాటగా అందించిన సాహితీసౌజన్యమూర్తి సూర్యభాస్కర్‌కు కృతజ్ఞతాభివందనాలు.

శుభాకాంక్షలతో,
**విహారి**

## అనుబంధం

కవి, విమర్శకుడు, కథకుడు, చిత్రకారుడు, చిత్రకళా విమర్శకుడు,
బాలసాహితీవేత్త, వక్త, విద్యావేత్త, ఫ్రీలాన్సర్ జర్నలిస్టు

**మాకినీడి సూర్య భాస్కర్**



# కళాసాహితీ ప్రస్థాన రేఖాంకన

## మాకినీడి ముద్రిత గ్రంథాలు

**కవిత్వం:**

1. సుమ కవితాంజలి, ఆగస్టు 1997, తిరుమల దేవస్థానముల ప్రచురణ
2. ప్రకృతి గీసిన వికృత చిత్రం, మార్చి 2002
3. సెలవ రోజు, డిసెంబర్ 2003
4. కలల పెదవుల నవ్వుల్లోకి..., జనవరి 2008
5. సామెతకో పద్యం, మార్చి 2009
6. పాపికొండల్లో పడవ పాట, మే 2011
7. ఆమె (దీర్ఘ కవిత), 17 ఆగస్టు 2012
8. తడితడిగా ఆలోచించే... 17 ఆగస్టు 2013
9. నాకు నేను దొరికిన క్షణాలు... జూన్ 2016

**హైకు సంపుటాలు:**

10. హైకూ చిత్రాలు (హైకు సంపుటి) నవంబరు, 1997
11. ప్రకృతి (ఫొటో హైకు), అక్టోబర్ 1998; ద్వితీయ ముద్రణ- ఏప్రిల్ 2017
12. రాలిన పుప్పొడి, జనవరి 2000
13. ఋతు రాగాలు, జనవరి 2000
14. హైకు-హైగా, ఆగస్టు 2005

**బాలసాహిత్యం:**

15. జ్యోతి బాల, మే 1996
16. స్వర్ణ భారతి (దేశభక్తి గేయాలు), ఆగస్టు 1997
17. తెలుగు భాష-వెలుగు మార్గాలు (తానాఅవార్డ్ విన్నర్), జనవరి 2006
18. వెన్నెల, 21 డిసెంబర్, 2008
19. బాల్యం ఒక పాట, 21 డిసెంబర్, 2009
20. **కథాసంపుటి : అంతస్సౌందర్యం,** నవంబర్ 2003

**సాహిత్య విమర్శ:**

21. కళాసాహితీ తోరణం, మార్చి 1998, తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణ
22. హైకూ కవిత్వం-అనుశీలన,జనవరి 1999,హైకుపై తొలి విమర్శ గ్రంథం
23. నానీలు-నాలుగు వ్యాసాలు, ఫిబ్రవరి 2003, తొలి విమర్శ గ్రంథం
24. కలం కలలు, మే 2003
25. దృక్కోణం, సెప్టెంబర్, 2003
26. రెండు ఎలిజీల మధ్య, మార్చి 2004
27. తాత్త్విక రెక్కలు - ప్రస్థానం, మే 2008
28. అద్దేపల్లి కవిత్వం-వ్యక్తిత్వం, తత్త్వం, నవంబర్ 2006

29. అమ్మ – పరిమళ వ్యాఖ్యానం, 2008
30. పద్యం–హృద్యం (పద్య కావ్యాలపై విమర్శ వ్యాసాలు) జనవరి 2014
31. అద్దేపల్లి కవిత్వం–పరిణామం, 6 సెప్టెంబరు 2015, అశీతి ప్రవేశం
32. సత్యాన్వేషణలో...(కళా,సాహిత్యేతర సామాన్య వ్యాసాలు) మార్చి 2003

**కళావిమర్శ**

33. కళావిమర్శక వ్యాసాలు, జూన్ 2005
34. కళాస్రవంతి–ఆంజనేయులు, జూన్ 2007
35. ఆర్ట్ స్కూల్ (చిత్రకళ పాఠాలు), జూన్ 2008
36. రామారావు నుంచి రామారావు దాకా, జనవరి 2009
37. మన చిత్రకారులు, ఆగస్టు 2014
38. దామెర్ల – ఆధునికాంధ్ర చిత్రకళ ఆద్యుడు
39. సంజీవదేవ్ – ప్రకృతి 'గీతా'లాపకుడు
40. డా॥ పి.ఆర్. రాజు చిత్రాలు – సౌందర్య వర్ణగీతాలు
41. కళ, కళావిమర్శల పోటుగాడు చలసాని
42. బాపు'రే' – రేఖీయాభివ్యక్తి
43. డా॥ మాచిరాజు – వర్ణసంగీత మాంత్రికుడు
44. రావు వెంకటరావుగారి 'చిత్రమాలిక – స్వర్ణ జ్ఞాపిక'

**మాకినీడిపై వచ్చిన పుస్తకాలు:**

45. రచన–రసన (మాకినీడి సాహిత్య వ్యక్తిత్వ విమర్శ), అక్టోబర్ 2001
46. దృష్టి–సృష్టి (మాకినీడి కళాసమీక్ష), ఆగస్టు 2001
47. మాకినీడి కళాసాహితీ జీవన రేఖాంకన, మే 2012
48. నింగీ–నేల (దీర్ఘ వ్యాసం)–డా. ఎం.వి.వి.ఎన్; 2005లో రాసిన వ్యాసం పున:సవరణలతో మాకినీడి వ్యాసరజతోత్సవం సందర్భంగా 64కళలు.కామ్‌లో ప్రచురితం, మార్చి 2014
49. ఎం. శేఖర్, 'మాకినీడి వచనకవితా సంపుటాలు–పరిశీలన (ఎం.ఫిల్)
50. ర్యాలి శ్రీనివాస్, 'సంపాదకుడిగా మాకినీడి' (ఎం.ఫిల్)
51. వి. విజయకుమార్, 'మాకినీడి సమగ్ర సాహిత్యం–పరిశీలన' (పిహెచ్.డి)
52. శ్రీహస్త రచించిన 'మనసున్న కవి మాకినీడి'

**ఎకడెమిక్ గ్రంథాలు :**

53. పాఠశాల పాలన (టిటిసి విద్యార్థుల కోసం), జిల్లా విద్యాశాఖ ప్రచురణ జూన్ 1999
54. ఎయిడ్స్ నియంత్రణ, చికిత్స (బుర్రకథ), ఆం.ప్ర. ప్రభుత్వ ప్రచురణ, ( A Folk-lore Art-form executed for propagation about

AIDS and its Preventionand Cure, chaired by the Dist Collector Sri Satish Chandra) 2000.

55. చదువుల పండుగ, కాకినాడ పురపాలక సంఘ ప్రచురణ (ఆర్థికశాఖా మంత్రి శ్రీ యనమల రామకృష్ణుడుగారిచే ఆవిష్కరింపబడినది) ఆగస్టు 2002
56. సైంటిఫిక్ టెంపర్ (ఎన్.సి.ఇ.ఆర్.టి పత్రం), అబ్దుల్ కలా సైన్స్ సెల్ ప్రచురణ డిసెంబర్ 2002
57. కొలెస్టిరాల్ , తెలుగు అకాడెమీ ప్రచురణ, మార్చి 2003
58. Infant Feeding, Published by Body & Beauty Care, 15 April,1992
59. అల్లూరి సీతారామరాజు (బుర్ర కథ), మే 2005, జనసాహితి ప్రచురణ
60. తరాల మార్పు కోసం బాలసాహితి (మోనోగ్రాఫ్), జిల్లా విద్యాశాఖ ప్రచురణ నవంబర్ 2006, జిల్లా కలెక్టర్ ప్రసాదరావు గారిచే ఆవిష్కరింపబడింది
61. తెలుగు మనుగడకు వెలుగు మార్గాలు (తానా అవార్డు విన్నర్), జనవరి 2006

**చిరుగ్రంథ కానుక – మరుగంధ మాలిక**

62. అద్దేపల్లి కవిత్వం – పరిణామం
63. గూడ శ్రీరాములు వ్యాసాలు – నిగూఢ విమర్శక విన్యాసాలు
64. మినీ కథన బ్రహ్మ – కె.బి. కృష్ణ
65. కడలి బ్రతుకుల కల్లోల సరళి
66. రాంషా రచనలు – వైశిష్ట్యం
67. ప్రజాచిత్రకారుడు మోహన్

**68. కంచి చేరిన కథలు**

## మాకినీడి అముద్రిత గ్రంథాలు

(Ready Press-copied for bringing into Book-form: Anthologies of Poetry, Litt/Art criticism, Essays and Articles which appeared in various journals, Magazines and Webzines)

**కవిత్వం:**

1. జీవితం (దీర్ఘ కవిత)
2. పొదుపుకో పద్యం (శతకం)
3. రాధికాకృష్ణం (పద్య కృతి)
4. ఆషాఢ గీతాలు
5. మినీ మెగా చురకలు (మినీ కవితల సంపుటి)

**బాలసాహిత్యం:**

5. భూగర్భ ప్రయాణం (జూల్స్ వెర్న్‌కు అనువాదం) బాలల నవల
6. మామయ్య కబుర్లు (పాపులర్ సైన్స్ విషయాలపై వ్యాసాలు)
7. పేరులోన పెన్నిధి, శాస్త్రవేత్తల జీవన సంగ్రహాలు
8. సైన్స్ గీతాలు
9. పెద్దలు చెప్పిన చిన్న కథలు
10. శాస్త్రీయ అవగాహన
11. బాలల గేయ రామాయణం
12. గ్రహాలు-సంగ్రహాలు
13. గాంధీజీ జీవితం (క్రొమాటిక్ సిల్హట్స్‌తో)

14. **కథాసంపుటాలు: పునాస (ఇతర కథలు)**

**అనువాద గ్రంథాలు:**

15. అనువాద కథల సంపుటి
16. టాగూరు గోరా నవల
17. టాగూరు ప్రేమగీతాలు

**సాహిత్య విమర్శ:**

18. విమర్శ-పరామర్శ (సాహిత్య విమర్శ వ్యాసాలు)
19. కవిత్వం చిరునామా
20. కథాలోకనం (తెలుగు కథాసాహిత్యంపై వ్యాసాలు
21. సమీక్షణం ( చిన్న సమీక్షల సంపుటి)

22. కొత్త చూపు (సాహిత్యంలో వివాదాస్పద అంశాలపై వ్యాసాలు!
23. కొత్త పాళీ ( నేను పరిచయం చేసిన కొత్త కవుల గురించి లఘుపరిచయాలు)
24. తెలుగు భాషావ్యాసాలు

**కళావిమర్శ**

25. కళావిమర్శక వ్యాసాలు, (1997 నుంచి ఇప్పటి వరకు వచ్చిన వ్యాసాలు)
26. జీవన సంజీవని (డా॥ సంజీవదేవ్ కళాసాహితీ జీవిత చరిత్ర)
27. కళలు – సంవిధానాలు
28. కాగితంతో కళాకృతులు
29. కవి చిత్రకారులు

**ఆంగ్ల గ్రంథాలు:**

30. Falcon in the Rain (Poetry Anthology)
31. Contemporary Indian Poets
32. Contemporary American Poets

**మాకినీడిపై రానున్న పుస్తకాలు:**

33. రచన–రసన (మాకినీడి సాహిత్య వ్యక్తిత్వ విమర్శ), రెండవ భాగం
34. మాకినీడి కవిత్వం–పరిశీలన, డా॥ ఎం.వి.వి.ఎన్. సౌమ్య

**ఏకడెమిక్ గ్రంథాలు :**

35. ఏకలిపి (ప్రపంచ భాషలన్నిటికీ ఒకే లిపి)
36. రైతుల చేతి పుస్తకం (వ్యవసాయ, ముఖ్యంగా పాడి విజ్ఞానం)
37. విటమిన్లు
38. ఆత్మ విశ్వాసం (సైకాలజీ వ్యాసాలు); సైకాలజీ టుడే మాసపత్రికలో
39. చారిత్రక అట్లాసులు

## మాకినీడి పొందిన ముఖ్యమైన అవార్డులు

1. ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం, తూర్పుగోదావరి జిల్లా సాంస్కృతిక మండలిచే ఉగాది కవితా పురస్కారం, 2016
2. డా॥ రావూరి భరద్వాజ మెమోరియల్ కవితా పురస్కారం, 2015, సి.పి. బ్రౌన్ అకాడెమీ, బెంగుళూరు
3. సూర్యసాహితి కవితాపురస్కారం,
4. విశాలాక్షి (మాస పత్రిక) కథానికా పురస్కారం, 2012 (ప్రథమ బహుమతి రూ 5,000/- పొందిన కథ 'కప్పు ఖాళీ)
5. బాలసాహిత్య పరిషత్, హైదరాబాదు, ఎప్రీసియేషన్ ఆఫ్ 'కమెండబుల్ వర్క్ ఆన్ చిల్డ్రన్ లిటరేచర్, 2012
6. సోమేపల్లి కథానికా అవార్డు, 2012. (ప్రథమ బహుమతి రూ 5,000/- పొందిన కథ 'హత్య చెయ్యనవసరం లేదు')
7. సోమనాథ కళాపీఠం, పాలకుర్తి, చలపతిరావు సాహిత్య విమర్శ అవార్డు,
8. వింగ్స్, మార్కాపురం,
9. భిలాయివాణి కవితాపురస్కారం, 2010
10. ఉగాది సాహిత్య ప్రతిభాపురస్కారం, 2010. వచనకవితా పురస్కారం, ఆంధ్ర సారస్వత సమితి, మచిలీపట్నం
11. వై.యస్. మెమోరియల్ అవార్డు, 2010
12. చిత్రకళావైజయంతి బిరుద ప్రదానం మరియు చిత్రకళా విమర్శ అవార్డు, 2010
13. తానా (ఉత్తర అమెరికా తెలుగు సంఘం) పురస్కారం, 2006 (తెలుగు మనుగడకు వెలుగు మార్గాలు పుస్తక ప్రచురణ, రూ 10,116/- నగదు బహుమతి
14. టామా (మెట్రో అట్లాంటా తెలుగు సంఘం) పురస్కారం, 2006, (ఆంధ్ర మాధ్యమంలో విద్యను ప్రోత్సహించినందుకు) 100 డాలర్లు నగదు బహుమతి
15. బెస్ట్ సిటిజన్ అవార్డు, 2006
16. 'ఇన్‌స్పైరింగ్ టీచర్'. పద్మశ్రీ డా॥దొరైరాజన్ సుబ్రహ్మణ్యం (డా॥ఎల్.వి. ప్రసాద్ కంటి పరిశోధనాలయం డైరెక్టర్)
17. జిల్లా ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు, 2004
18. 'ఇంపాక్ట్ సైన్స్ ఉత్సవ్', 2004
19. 'ఉపాధ్యాయ రత్నం', బాలవేదిక పురస్కారం, 2004

20. 'ఔట్‌స్టాండింగ్ సర్వీసెసె ఇన్ సైన్స్ టీచింగ్', 2004. రోటరీ క్లబ్ కాకినాడ సెంట్రల్ (వొకేషనల్ మంత్ సెలబ్రేషన్స్, 2003-04)
21. శ్రీ నోరి ఉదయ భాస్కరం స్మారక పురస్కారం, 2004 (బెస్ట్ సైన్స్ టీచర్)
22. ఇండస్ట్రియల్ స్పెషల్ అవార్డు, 2004. దక్షిణ భారత విద్యావైజ్ఞానిక ప్రదర్శన టెలిస్కోప్ బహూకరణ
23. Appreciation by James Arthur, Team-leader (Dept of International Development, Britain), "Andhra Pradesh Urban Services for the Poor" Lauded as 'Creative Report", 2003
24. జిల్లా కలెక్టర్‌గారిచే 'బెస్ట్ సర్వీసెస్' అవార్డు, 2002 స్వాతంత్ర్య దినోత్సవం
25. సివిక్ రిసెప్షన్, 2002
26. "చదువును ఆనందదాయకం చేస్తున్నందుకు", క్రియేటివ్ టీచింగ్ అవార్డు, 2002, చైతన్య వనితామండలి మరియు సిడో, కాకినాడ

చిత్రకళా పురస్కారాలు:

27. కోనసీమ చిత్రకళాపరిషత్, అమలాపురం. కెసిపి అవార్డు, 1994, 1995
28. సౌత్ సెంట్రల్ జోన్ కల్చరల్ సెంటర్, నాగపూర్, 1997
29. కొరసాల వండర్ ఆర్ట్ విలేజి, 2003
30. కెసిపి ఆర్ట్ మిత్ర అవార్డు, 2004

Member in 'World Poets' Society, Makineedi's poems translated by him in English are published in the International Journals and Webzines like Asian American Poetry, The Enchanting Verses, Velvet Illusion, Albatros, Poetry First, All Poetry, Poetry Freak, Poetry that Moves, Akashik, Muse India, Chill Breeze, Koumudi,Ee Maata etc.

About 50 poems and 37 articles are published. Some of them are translated into spanish, french, ductch, germanian languages by he Journals and published.

Makineedi translated his poems into Hindi and they are published. A poem , निरंतर बाज़ार won National Award, 2012.

# దృశ్యమాలిక




TANA AWARD-2006




TAMA AWARD-2006



4th WORLD CONFERENCE




MAHABHINANDANA




SOMEPALLI AWARD



UGADI PURASKAR




SOMNATH KALA PITH




SURYA SAHITI




WINGS, MARKAPUR




S.P.C.A. AWARD

# AS A TEACHER




BEST SERVICES



BEST TEACHER



CREATIVE TEACHER



BEST SCI. TEACHER




DEDICATIVE TEACHER